# శ్రీ గోవిందరామాయణము

## ప్రథమ ఖండము



శ్రీ సీతా లక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః





ఆసాద్యనగరీం దివ్యామభిషిక్తాయసీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.

కృతికర్త

ఆత్మకూరి గోవిందాచార్యులు

1971

ప్రథమ ముద్రణము - 500 ప్రతులు.

విరోధికృతు సం॥ ర భాద్రపదము.



1, 2, ఖండముల వెల రు. 8-0

గ్రంథకర్తకు వ్రాసినబడయగలరు
6-1-911/4 ఖైరతాబాదు
హైదరాబాదు-4

ముద్రణ :
నాట్యకళ ప్రెస్
ఖైరతాబాద్
హైదరాబాదు-4.

ACC NO 5366

# నా మనవి

## శ్రీ పట్టాభిరాముఁడు - ముద్రణము

శ్రీ గోవిందరామాయణ మేడుకావ్యములుగ వ్రాసి నేటికి ముద్రింప గలిగితిని (వాల్మీక మేడుకాండములును).

పట్టాభిరాముఁడను, ఈ యుద్ధకాండము వ్రాసినవెంటనే, అపూర్వముగ ముద్రింపబడనది. ఇటుగముద్రింపగలుగుటకు:

శ్రీ పసల సూర్యచంద్రరావుగారు. (ఎమ్. ఎల్. సి., ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు) తోడ్పడిరి.

సంగీతసాహిత్య నాట్యకళాభిమానులును, నాకు చిరకాలమిత్రులును, దేశభక్తులునునగు, శ్రీ సూర్య చంద్రరావుగారీ ప్రథమఖండమును ముద్రించి నా యెడజూపిన ఆదరాభిమానములకు వారికెంతయు గృతజ్ఞుడను, శ్రీ సీతారామచంద్రుడు వీరికాయురారోగ్యభాగ్యముల ప్రసాదించుగాత!

## గోవిందరామాయణ రచన

తలవని తలంపుగ వ్రాయ ప్రారంభింపబడిన, శ్రీ గోవిందరామాయణ రచనమున, ఉత్తరకాండము 1941 సంవత్సరమునాటికే వ్రాసితిని. 1942 వఱకు ముద్రింపజాలకపోతిని. తదుపరి (శ్రీ సీతారామం) శ్రీ సీతారాముడుఁ 1944 వ సంవత్సరారంభమున ప్రారంభింపబడి 1944 శ్రీ రామనవమినాటికే పూర్తిచేసియు 1960 వ సంవత్సరారంభమునగాని, ముద్రింప అవకాశము లభింపలేదు. 16 ఏండ్లు ముద్రణమునకు జాగైనది. రాజకీయరంగమున నిమగ్నుడ నగుటయే, యిందులకు కారణము. 1952లో రాజకీయరంగమునుండి తొలిగియు, ఆరోగ్యముకొఱకై, హైదరాబాదులో 1959 లో స్థిరనివాస మేర్పరచుకొని, పిమ్మట, ముద్రింపగలిగితిని (బాలకాండము:- )

పిమ్మట, ఆరుమాసములలో (అయోధ్యాకాండము) పాదుకాపట్టాభిషేకము వ్రాసియు 1963 లోగాని ముద్రింపవలను పడలేదు. ఇట్లే రక్షక

రాముఁడు (అరణ్యకాండము), ధార్మికరాముడు (కిష్కింధాకాండము) అను కాండములుగూడ 1964లోనే వ్రాయబడియు, 1968లో ముద్రింపబడినవి. (శ్రీ సుందరకాండమును) సుందరరాముడనుదానిని గూడ 1969లో నాలుగుమాసములలో వ్రాసియు, 1971లో ముద్రింపగలిగితిని. పట్టాభిరాముడను యుద్ధకాండము 1970 లో వ్రాసి 1971లో ముద్రింపనోచితిని. ఇందులకు పట్టాభిరాముని కృపయే కారణము. ఈ విధముగ 1940 లో వ్రాయ ప్రారంభింపబడిన శ్రీ గోవిందరామాయణము, ఏడు, కావ్యములును వ్రాసి ముద్రించుటకు 1971 వరకు ముప్పదిసంవత్సరములు పూర్తికావచ్చినవి. కాని ఈ ఏడుకాండములరచనకు సుమారు 4 వత్సరములు మాత్రమే (అప్పుడప్పుఁడు వ్రాసిన కాలపరిమితి) పట్టినది.

## కావ్యస్వరూపము

వాల్మీకము ననుసరించియే కథాక్రమ మంతయు వ్రాయబడినది. తర్జుమా మాత్రముకాదు. వాల్మీకమున కుత్తేజకరములని తోచిన, కొన్ని భావము లితరరామాయణములనుండి సంగ్రహింపబడినవి. వాల్మీకమునందలి వర్ణనలు చాలవఱకు, కుంచింపబడినవి. కొన్ని యొడలవిడిచితిని. కథావస్తువును పాత్రపోషణమును మాత్రమే గ్రహించి, ఇతరములను విడిచితిని. పూర్వకవిప్రయోగములననుసరించిన కొన్ని ప్రయోగము లిందుగలవు బుద్ధిపూర్వకముగ దోషములను చొరబడనీయలేదు అయినను ప్రమాదవశమున, చొచ్చియుండినచో అవి నాయవి. గుణములన్నియు, సర్వరస ప్రపూర్ణుడగు సీతారామునివి.

## పాఠకమహాశయులకు

తప్పు - ఒప్పులపట్టికననుసరించి స్ఖాలిత్యములు సవరించుకొన, పాఠక మహాశయులు ప్రార్థితులు. పండితులకు పామరులకు ఆబాలగోపాలమునకు ఎల్లరకు రసాస్వాదనమునకనుకూలమగు సుప్రసన్నశైలిలో శ్రీ గోవిందరామాయణమంతయు వ్రాయప్రయత్నించితిని. నా యత్నము సఫలమైనదియు, విఫలమైనదియు నిర్ణయింప పాఠకమహాశయులే అర్హులు. నా రామాయణము, సమకాలికులగు, పండితుల ఆదరముగాంచుట, హృదయానందకరము. శ్రీ రాముని కృప!

## కృతజ్ఞత

అచ్చునకనువగు రీతిని వ్రాతప్రతిని సిద్ధపరచిన మా చిరంజీవి సత్యవతికి శ్రీసీతారామచంద్రుడు, మంగళాశాసనము కృపజేయుగాత !

పట్టాభిరామము (యుద్ధకాండము) డను, ఈ కావ్యమునకు తొలిపలుకు వ్రాసిన, శ్రీదివాకర్ల వేంకటావధానిగారికి కడుంగడు కృతజ్ఞుడను. నా ఏడు కావ్యములను, చదివి, శ్రమయనితలంపక, విపులపీఠకను వ్రాసిన, శ్రీ నిడదవోలు వేంకటరావుగారికి నా ధన్యవాదములు.

దీనిని, భక్తితో, ముద్రించిన నాట్యకళా ప్రెస్సువారికి, నా శుభాకాంక్షలు.

శ్రీ జగన్మాత, బాలాత్రిపురసుందరిని సంస్మరించుచు శ్రీ సీతారామచంద్రునకు, ప్రపత్తితో, ప్రణామమర్పించి విరమించుచున్నాను.

## తుదిమాట

మ. హరినామస్తుతిఁజేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససర స్ఫూర్తిన్ వెలుంగొందు, ఆ
హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు, శ్రీ
కరమైయుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్.

మ. అపశబ్దంబులఁగూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వ పా
పపరిత్యాగము సేయుగావున హరిన్ భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ చింతింపుమా!

(భాగవతము పోతన)

మకాం

6-1-911/4

శ్రీ సీతారామనిలయము

6-1-911/4

ఖయిరతాబాదు పోస్టు

హైదరాబాదు-4

ఇట్లు

భక్తభక్తుడు

**ఆత్మకూరి గోవిందాచార్యులు**

23-8-1971

# విషయసూచిక

## (యుద్ధకాండము - ప్రథమఖండము)

### పట్టాభిరాముఁడు

### సంగ్రామయాత్రాశ్వాసము

## 2 అభయాశ్వాసము

## 3 సంగ్రామాశ్వాసము

పట్టాభిరాముఁడు — యుద్ధకాండము

ప్రథమఖండము సంపూర్ణము

# ప్రథమ ఖండము

## తప్పు - ఒప్పుల - పట్టిక

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| 1 | 3 | 3 | యుద్ధ | యిద్ధ |
| 5 | 14 | 3 | ఖిన్నుండకా | క్షోభించి ఖిన్నుండవో |
| 6 | 24 | 3 | మర్కటులబలము | మర్కటబలమ్ము |
| 7 | 25 | 3 | విడువవుత్సాహం | విడువఁడుత్సాహశౌర్యముల్ వీరవరుఁడు |
| 8 | 37 | 1 | వీర | వర |
| 9 | 41 | 2 | మహాస్త్రచయ | మహాస్త్రశస్త్రచయ |
| 9 | 42 | 1 | సంపందల | సంపదల |
| 10 | 50 | 1 | ధైర్య | దైత్య |
| 11 | 51 | 4 | మూనపోవుద | మూనఁబోవుద |
| 11 | 56 | 3 | విషంబది | విషంబరి |
| 12 | 61 | 1 | ఁబ్రక్కల | ఁబ్రక్క |
| 12 | 62 | 1 | రాముండాడ | రాముండన |
| 13 | 65 | 2 | దేనెచూర | దేనెఁజూర |
| 13 | 65 | 4 | పుట్టల | ఁబుట్టల |
| 14 | 65 | 1 | సూర్యుండి | సూర్యుఁడి |
| 14 | 68 | 2 | కేతుస్పర్శను | కేతువుచేఁ |
| 15 | 72 | 2 | పుష్పిత | పుష్పితము |
| 16 | 78 | 4 | వలరు | నలరు |
| 18 | 91 | 1 | దీర్చు | దీర్చి |
| 18 | 93 | 4 | గన | ఘన |
| 19 | 97 | 1 | తనంతగా | తనంతదా |
| 20 | 104 | 1 | తలవంచి | ఁదలవంచి |
| 21 | 111 | 1 | జయంపం | జయింపం |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 21 | 113 | 3 | నిన్ను | నిన్ననీ |
| 21 | 116 | 2 | జయుంప | జయింప |
| 21 | 114 | 4 | వీగుమా | వీడుమా |
| 22 | 117 | 3 | జనె | చనె |
| 25 | 133 | 4 | గనంగ | కనంగ |
| 25 | 141 | 3 | సీతహారియించిదె | సీతనుహారించితె |
| 26 | 145 | 4 | దాశరధీశున | అరఘురాముని |
| 27 | 152 | 3 | ఖువిధవ | ఖువినిటు |
| 27 | 153 | 2 | నహులుజ | నహితతిప |
| 27 | 153 | 3 | ఁజీమతె | జీమయె |
| 27 | 153 | 4 | గోవులు | గోతతి |
| 28 | 153 | 2 | దీనముగనుండెఁద | దీనమైనవి త |
| 29 | 165 | 4 | తేకువతోడన్ | ఁదేకువతోడన్ |
| 30 | 169 | 1 | అమాలా | అమలా |
| 30 | 170 | 2 | జయంబు | జయము |
| 30 | 171 | 2 | లోకత్ర యీజయ | లోకత్ర యీజయ విజ యంబు |
| 32 | 179 | 2 | యా | నా |
| 35 | 201 | 2 | బరాజయము | పరాజయము |
| 35 | 201 | 3 | జంపెద | చంపెద |
| 35 | 203 | 3 | యటుగ | గతి |
| 35 | 206 | 2 | తోతె | వోతె |
| 36 | 207 | 1 | నింద్రజిత్తు | నింద్రజి |
| 36 | 210 | 3 | బ్రహ్మగ | బ్రహ్మగన |
| 37 | 213 | 2 | గాదునింతవఱకు సీత ముట్ట | చేతగాదింతవఱకును సీత ముట్ట |
| 37 | 216 | 3 | నాయీ | యీనా |
| 37 | 216 | 4 | దండుగచ | దండుగఁజ |
| 37 | 230 | 1 | సీతాహి వరియింప | సీతాహినివరింప |
| | | 2, 3, 4 | పై విధముగఁ జదువవలెను. | |
| 38 | 223 | 2 | సహాయార్థంబుగా | సహాయార్థమై |
| 38 | 225 | 1 | నుండగ | నుండ |
| 38 | 225 | 2 | కుమారకుఁడా | కుమారకుఁడే |
| 39 | 226 | 3 | నున్నకున్ | నన్నకున్ |
| 39 | 230 | 2 | రావణ | రావణి |
| 39 | 230 | 3 | బొందెడి | బొందఁగ |

| | | | | |
|---|---|---|---|---|
| 43 | 252 | 1 | సంచిరించు | సంచరించు |
| 43 | 255 | 2 | యేనుగులుకద | యేనుగులహా |
| 43 | 256 | 2 | సుప్రసిద్ధమే | సుప్రసిద్ధమె |
| 46 | 272 | 3 | బూాతాత్మునిన్ | బూాతాత్మునిన్ దైత్యునిన్ |
| 46 | 274 | 3 | మైతింగొని | మైత్రినింగొని |
| 47 | 3 | 3 | గతివిభీ | గతినివిభీ |
| 48 | 7 | 2 | (బరిమాద్ప | (బరిమార్ప |
| 50 | 25 | 3 | మును పే | మును |
| 51 | 27 | 2 | తెల్పఁగనే | తెల్పఁగనౌ |
| 54 | 47 | 1 | అతఁడకాలంబున | ఆతఁడకాలంబు |
| 58 | 74 | 4 | జాలు గ్రహియింతు | జాలును గ్రహింతు |
| 60 | 92 | 4 | నినుగాంచి | నినునేగాంచి |
| 61 | 97 | 4 | వ పాదముపరమనుర | క్తితోఁ దరికివచ్చినవానిని బ్రోచుదీక్షతో |
| 62 | 103 | 1 | కనచుఁడై | కవచుఁడై |
| 63 | 112 | 2 | బ్రప త్తిని | బ్రపత్తిని |
| 64 | 118 | 3 | దద్ది | నద్ది |
| 65 | 126 | 4 | వీవ | మీవ |
| 72 | 169 | 1 | సుసు | సుమ |
| 74 | 183 | 2 | సేతువద్దిని | సేతువునద్ది |
| 75 | 192 | 4 | సమ్మదంబు | సమ్మోదంబు |
| 76 | 203 | 1 | జోపు | సూపు |
| 77 | 208 | 1 | దైత్యులువానరు | రక్కసులున్ హరుల్ |
| 86 | 267 | 2 | లేదిల | లేదు |
| 86 | 268 | 4 | కొండనువసియించెడి | కొండపైనవసించెడి |
| 88 | 285 | 3,4, | శస్త్రసయుతుని | శస్త్రయుక్తుని |
| 89 | 287 | 1 | నీవుహరియించితివో | నీవపహరించితివో |
| 92 | 312 | 2 | వారుగొట్టిరి | వారుగొట్టెరినను |
| 94 | 323 | 2 | త్రిశరు | త్రిశిరు |
| 95 | 330 | 1 | విద్యుజిహ్వు | విద్యుజ్జిహ్వు |
| 96 | 341 | 4 | మూకల్ | మూకన్ |
| 96 | 345 | 1 | నేనొక | ఏనొక |
| 100 | 370 | 1 | అవనీ | అరయన్ |
| 100 | 370 | 1 | నౌనెప | నౌనెప |
| 100 | 370 | 2 | భవమా | వ్వరికేన్ |
| 103 | చివర | | శరణాగతాశ్వాసము | అభయాశ్వాసము |
| 105 | 5 | 4 | విప్పిహసియించు | విప్పుచుహసించు |
| 105 | 7 | 6 | వినాశనమే | నాశనమే |
| 107 | 19 | 2 | నేవరియింతువేళ | నేలవరింతునొక్కొ |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 110 | 41 | 4 | ఠేక | ఠేక |
| 112 | 54 | 3 | మంతనళియింప | మంతయునళింప |
| 114 | 62 | 1 | గ్రిందికిందిగువెంట వారు | క్రిందికిందిగువారు, వారి |
| 115 | 63 | 4 | నర్క సుతుఁడు | హరివిభుండు |
| 116 | 75 | 2 | నలరునుండ | నలరుచునుండ |
| 117 | 81 | 3 | యీ | ఆ |
| 117 | 81 | 4 | జూపు | సూపు |
| 117 | 82 | 3 | బాలననువాడుమూడు | బాలనమూనువాడు |
| 117 | 83 | 4 | వేను | వేగు |
| 126 | 140 | 3 | నాయశరుప్రభుఁ | నాయశరప్రభు |
| 126 | 143 | 3 | తురంగంబులు | తురగావళి |
| 127 | 146 | 2 | భేరి | భేరీ |
| 127 | 149 | 4 | భూమిఁగలిపె | భూమికిడిరి |
| 128 | 155 | 2 | యుద్ధంబుతే | యుద్ధంబునే |
| 136 | 204 | 2 | చేర్చె | వెడలె |
| 136 | 204 | 2 | వృతువనిని | వృతువనికి |
| 136 | 208 | 2 | ఖామరెండైనను | ఖామలెండైనను |
| 140 | 235 | 1 | వీరుఁల | వీరుల |
| 141 | 243 | 2 | విమలకాంతి | విమలశాంతి |
| 152 | 316 | 2 | విజయమదగ | విజయమందగ |
| 154 | 328 | 3 | నలుని | నీలు |
| 158 | 350 | 2 | త్రిశిరుడతఁడు | త్రిశిరుఁడతఁడు |
| 159 | 360 | 4 | వీగగ | వీడగ |
| 162 | 379 | 2 | యందేనువధియించి | యందేనేవధించి |
| 163 | 384 | 4 | మారునం | మారున్ |
| 163 | 385 | 2 | మూర్ఛఁదేరి | మూర్ఛఁదేటి |
| 164 | 391 | 1 | తల | తన |
| 166 | 406 | 3 | హిమమదరాద్రుల | హిమమందరాద్రుల |
| 166 | 406 | 4 | నెత్తవేడు | నెత్తలేడు |
| 167 | 411 | 2 | రణమువీడి | రణమునేరి |
| 174 | 459 | 4 | విడె | విని |
| 175 | 465 | 2 | యీా తుణమందే | యా తుణమందె |
| 175 | 466 | 1 | వెనువెంటవే | ననవెనువెంటనే |
| 181 | 506 | 1 | జ్ఞానహీనబు | జ్ఞానహీనంబు |

| | | | | |
|---|---|---|---|---|
| 181 | 509 | 1 | దీనమ | దీనము |
| 183 | 520 | 17 | రామునేనెవధింప | రామునే వధియింప |
| 187 | 547 | 1 | నీ పరాక్రమము | నా పరాక్రమము |
| 188 | 553 | 4 | యెవ్వరుప్స్నారలెంచి చూడ | యెవ్వరు న్స్నారలెంచి చూడ |
| 195 | 605 | 1 | యీాశర | యాశర |
| 196 | 608 | 1 | తేవచ్చి | వేవచ్చి |
| 196 | 611 | 3 | సుగంధమాజలన్ | సుగంధములాజలన్ |
| 197 | 617 | 1 | పరాక్రమబుమీద | పరాక్రమంబుమీద |
| 199 | 630 | 1 | హ_స్తమునుండిబడన్ | హ_స్తమునుండిపడన్ |
| 200 | 639 | 2 | పోరుటయిని | పోరుటయని |
| 200 | 642 | 4 | భూమిఁబమడియె | భూమిఁబడియె |
| 202 | 654 | 1 | వాలిఁగెలిచి | వాలిఁగెలిచి |
| 203 | 663 | 2 | త్రిశరుఁడాది | త్రిశిరుఁడాది |
| 204 | 665 | 1 | ప్రవీణుల | ప్రవీణులు |
| 206 | 679 | 3,4 | మవేవ్వరు | మరెవ్వరు |
| 208 | 697 | 2 | ఆకిరీటాలంకృతమంత | ఆ కిరీటంబుతోఁగూడ |

# శోధిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 3 | 9 | ధి | థి | 46 | 9 | తు | తి |
| 4 | 1 | జ్వ | జ్ఞ్వ | 49 | 9 | దు | థు |
| 5 | 7 | డం | డ | 57 | 2 | ను | ణు |
| 8 | 6 | పా | శా | 58 | 14 | దు | థు |
| 8 | 9 | వ | ప | | 25 | దు | ఢు |
| 9 | 16 | ఖుద | బుధ | 59 | 27 | దు | ద |
| 11 | 23 | బది | బరి | 60 | 8 | | త్ |
| 14 | 11 | తు | తువు | 61 | 25 | శ | ష |
| 14 | 22 | హ్వా | హ్యా | 62 | 4 | ధ్వ | ద్వ |
| 16 | 21 | మా | మ | | 21 | తే,గీ | ఆ,వె |
| 19 | 17 | డె | డై | 71 | 6 | ధ | ద |
| 25 | 23 | నె | వె | 79 | 9 | లు | లను |
| 26 | 20 | ది | థి | 86 | 16 | విక్రముండు | విక్రముండు |
| 38 | 16 | ఇం | ఇంద్ర | 96 | 8 | ట్ట | ట్టి |
| 45 | 18 | ద్వి | ధ్వి | 100 | 13 | న | స |
| | | | | 130 | 16 | ద్వి | ధ్వి |

శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్ సమేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# అంకితము

కం. శ్రీరామా సతితో నవ
తారంబిలఁదాల్చినట్టి దశరథ పుత్రా!
శ్రీరామా అంకితమిదె
గా రామున యుద్ధకాండ గైకొనుమీవే.

తే।గీ॥ రహి విరోధకృత్ సంవత్సరంబునందు
చైత్రశుద్ధ నవమి నీదు జన్మతిధిని
అస్మదీయ కావ్యమ్మునీ కంకితమ్ముఁ
జేయుచున్నాడ రామయ్య స్వీకరింపు.

శా. శ్రీరామా విడిరాజ్యమున్ వనములో సీతాసతిన్ బాసి, సం
చారంబూని హరీశుతో హనుమతో సఖ్యంబుసేకూరగ
న్వారాశిందరియించిలంకనరిసిన్ నాశంబు గావించి, సీ
తారామంగొని రాజ్యమూను రఘుచంద్రా! కొమ్ము నీవీకృతిన్.

ఉ. శ్రీయుత రామచంద్ర విర చించితి వాల్మీకి పల్కినట్టి, రా
మాయణమేడు కాండముల హర్నిశలు నేనినునాత్మనిల్పి, ఆ
ప్యాయముగాగ నీదుకథ నంకితమిచ్చితినీకె, నా
రాయణ! నిన్నెనేశరణ మంటిని భద్రగిరీశ రాఘవా!

ఉ. నేచరితార్థతంగనఁగ నీకృపవ్రాసిన, ఏడుకాండముల్
బ్రోచిననీవప్రోతువను బుద్ధిని నిశ్చలభక్తితోడ, ఈ
నీచరితంబు సర్వమును నీకిదెఅంకితమిచ్చినాడ భ
ద్రాచలరామభక్తవర దా కరుణాకరజానకీవరా!

# తొలిపలుకు


**ఆచార్య డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు**

ఎమ్. ఎ. పి. హెచ్. డి.

ఆంధ్ర శాఖాధ్యక్షులు : ఉస్మానియా విశ్వవిద్యాలయం


శ్రీరామచంద్రుని అవ్యాజ కృపాకటాక్షము చేతను, ఇరువదియేండ్ల ప్రాయముననే తాతగా రుపదేశము కావించిన శ్రీరామమంత్రము నవిచ్ఛిన్నముగా జపించుచుండుటచేఁ గల్గిన పుణ్యవిశేషము చేతను, తమ సంకల్పబలముచేతను శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు గోవిందరామాయణమున చివరిదైన యుద్ధకాండమునుగూడ ప్రకటించి కృతకృత్యులుకాఁ జాలినారు. వారు మొట్టమొదట నుత్తరకాండమును రచించి యుండుటచే నీయుద్ధకాండమే వారి రచనలలో చివరిదైనది. నిర్మలభక్తి ప్రేరితులై వారీ రామాయణము నిట్లుపూర్తిచేసి తమ 'ప్రాణనాథు' డైన శ్రీరామచంద్రుని పాదపద్మములకే యర్పించి తమ పుట్టు కృతార్థమొనరించుకొనఁ జాలినారు.

వ్రాయఁగలేదుదీని వరపండితవర్గము నిల్పిదృష్టిలో
వ్రాయఁగలేదు సత్కవుల వ్రాతలతోఁదులదూగ నెంచుచున్
వ్రాయఁగలేదు సుమ్మి ధనవాంఛను బేరుప్రతిష్ఠలెంచుచున్
ధ్యేయకమూర్త్యహో! నిను మదింనిలఁబెట్టఁదలంచి వ్రాసితిన్

అని వారు చివర శ్రీరామునితో మనవిచేసికొన్న విషయములో నసత్యమించుకంతయు లేదు. వారు తెల్పినట్లు శ్రీరాముఁడు భక్తులను పాయక వెంబడించుచు వారికిఁ సత్కార్యములందు చేయూత నొసంగుచు చరితార్థతనావహించుచుండును. భగవద్భక్తివిశ్వాసములు గాఢముగా నాటుకొనియున్న వారెంతటి ఘనకార్యములనైన నవలీలగా, జేయఁజాలుదురనుట నిర్వివాదమైన విషయము.

శ్రీమద్రామాయణము నందలి మొదటియాఱు కాండములలో యుద్ధ కాండము చాల విస్తృతమైనది. ఇందు వీరము ప్రధానరసము. కరుణ రౌద్ర బీభత్సాద్భుతరసము లందెడనెడ కానవచ్చును. సాధారణముగా యుద్ధములను వర్ణించునప్పుడు కవులిరు పక్షముల యోధులు నొండొరులపై విసరుచుండు బాణముల సంఖ్య నేకరువుపెట్టుచు పఠితలకు విసువుకల్పించు చుందురు. శ్రీమాన్ ఆచార్యులవారు యుద్ధకాండమునుగూడ నట్టివిసు వెక్కుడను గలుగనీయక అత్యంతరమణీయముగా సంతరించియున్నారు. వారు వివిధ యుద్ధములను, వివిధయోధులు ప్రదర్శించిన ధైర్యపరాక్రమములను విశదముగా వర్ణించియున్నారు. ఇంద్రజిత్తు మహాపరాక్రమవంతుఁడు; శస్త్రాస్త్ర విశారదుఁడు; మాయాయుద్ధమునందారి తేరినవాఁడు. అతఁడు కావించిన యుద్ధము నాచార్యులవారు విశదముగ వర్ణించియున్నారు. అతనికున్న ప్రాధాన్యమట్టిది. లోకమున "రామరావణయోర్యుద్ధం రామ రావణయోరివ" అను ప్రతీతి యున్నది, వారిరువురును లోకోత్తర పరా క్రమ సమంచితులు. ఇరుపక్షములకును నాయకులు. అందుచే నాచార్యుల వారు వారి యుద్ధమునుగూడ వివరముగా వర్ణించియున్నారు. యుద్ధ సమయముల నిరుపక్షములందలి యోధులును మాంద్యములేక అపూర్వమైన వ్యగ్రతతో కూడియుందురు. ఆ వ్యగ్రత నాచార్యులవారు నేర్పుతో ప్రద ర్శించియున్నారు. ఆ కారణముచే వారి యుద్ధవర్ణన మెక్కుడను విరామము లేక చాలచులుకుగా సాగిపోవునట్లు కనిపించును.

యుద్ధమొనరించునప్పుడు యోధప్రతియోధులొండొరుల నీసడించుచు శస్త్రాస్త్రప్రహారములచే నొకరి నొకరు మించుటకు యత్నించు చుందురు. హనుమదింద్రజిత్తులకును. ఇంద్రజిద్విభీషణులకును, రామ రావ ణులకును జరిగిన యిట్టి సంభాషణముల నాచార్యులవారు చక్కఁగా విశదీక రించియున్నారు. ఆ సమయమున నాయోధు లొండొరులు కావించిన యపరాధముల నెత్తిపొడుచుట సరసమై యింపునింపుచున్నది.

యుద్ధమునకు ముందు లంకారక్షణమునకై రావణుఁడవలంబించిన విధానమును, తన పక్షమునందలి యోధులతో కావించిన మంత్రాంగమును ఆచార్యులవారు చాల నేర్పుతో వివరించియున్నారు. రాక్షసయోధు లహంకార పూరితులు; రామపరాక్రమానభిజ్ఞులు. వారు రావణుని యెదుట

గావించిన ప్రగల్భములు వారి అవివేకమును. అహంకారమును చక్కగా వెల్లడిచేయుచున్నవి.

రావణుఁడు రాముని మాయాశిరమునుజూపి సీతకు భ్రాంతి పుట్టించుటకై యత్నించెను. అట్లె రామలక్ష్మణు లింద్రజిత్ప్రయుక్త నాగపాశములచే బద్ధులై పడియున్నప్పుడు సీతకు వారినిచూపి ఆమె మనస్సున పరివర్తనము కలిగించుటకై యత్నమొనరింపఁబడినది. ఇంద్రజిత్తు మాయసీతను జంపి రామలక్ష్మణులకు నైరాశ్య నిర్వేదములు కల్పించుటకు పాటుపడెను. ఆ సమయముల సీతయు, రాముఁడును విలపించుట కరుణరసమయముగా వర్ణింపఁబడినది. అప్పుడు సీతను సరమాత్రిజటలును, రామలక్ష్మణులను విభీషణుఁడును సత్యకథన పూర్వకములైన ధైర్యోక్తులతో నూఱడించిన తెఱంగు రమ్యముగా నున్నది. రావణుఁడు యుద్ధమున బహుబలపరాక్రమముసేకాక యీ విధముగా వంచనను, మాయనుగూడ నవలంబించి విజయములు పొందుటకై కాంక్షించెను. కాని లాభము లేకపోయెను. ఇంద్రజిత్తు నికుంభిలావనమున నప్రతిమాన తేజోబలసంపదలనంది విజయము సాధించుటకై యత్నించెను. విభీషణోపదేశమున లక్ష్మణుఁడరిగి తత్ప్రవనమున కంతరాయ మాపాదించెను.

శుకసారణులు వానరవీరుల బలమునుగాంచి ఆశ్చర్య చకితులై వారలతో పోరుటవలన లాభములేదనియు సీతను రామునికర్పించి సంధిచేసికొనుట యుక్తమనియు రావణుని కెఱింగించిరి. అట్లే కుంభకర్ణుఁడుకూడ నాతనికి హితోపదేశమొనరించెను. కాని విధి యావిధముగా నిధనము ప్రాపింపవలెనని నొసట వ్రాసియుండుటచే రావణుఁడు వారిమాటలు పాటించియుండలేదు. అంగద సందేశమును, మాల్యవంతుని యుపదేశమునుగూడ నాతఁడు పెడచెవిని బెట్టుట కదియేకారణము.

సుగ్రీవుఁడొకప్పుడావేశము నొంది యొంటరిగాఁబోయి లంకపైఁబడెను. అప్పుడాతఁడు రాక్షసవీరుల చేజిక్కి పలుపాట్లు పడవలసివచ్చెను. రాముఁడా సమయమున నాతనికై పడిన సంతాపమతని యాశ్రితజనవాత్సల్యమును చక్కగా సూచించుచున్నది. కుంభకర్ణుఁడు సుగ్రీవుని మూర్ఛితుని గావించి యెత్తుకొనిపోయెను. హనుమంతుఁ డదిచూచుచునే యుండెను.

తాను రక్షణ మొసంగుట సుగ్రీవుని యపకీర్తికి కారణమగునని యాతఁడట్లు చేయక సుగ్రీవుని ధైర్యబలపరాక్రమము నెఱింగినవాఁడు కావున నాతఁ డెట్లయినఁ దప్పించుకొని రాఁగలడని యూహించి యూరకుండి వానర యోధుల నూఱడించెను. సుగ్రీవుఁడు మూర్ఛనుండి తేరుకొని కుంభకర్ణుని గోళ్ళతోరక్కి పండ్లతోఁ గొఱికి తప్పించుకొని బయటఁబడెను.

రామాయణమును దీర్ఘ శరణాగతిగా భావించు వైష్ణవ సంప్రదాయ మున్నది. దానినిబట్టి యందాదినుండి తుదిదాఁక కొన్ని శరణాగతుల పరంపర కానవచ్చును. ఈ శరణాగతులకెల్ల తలమానికమని చెప్పఁదగినది విభీషణ శరణాగతి. విభీషణుఁడన్నకు పలుతెఱంగుల హితోపదేశము కావించి సీతను రామునికర్పించుట మేలని బోధించెను. రావణుఁడు క్రుద్ధుఁడై యాతని పరాభవించెను. అతఁడు చేయునదిలేక తన సచివులతో బయలుదేరి రాముని శరణువేడెను. ఆ సమయమున రాముఁడు జాంబవంతుస్సుగ్రీవలక్ష్మణాదులనెల్ల వారివారి యభిప్రాయములు వెల్లడింపకోరెను. వారెల్లరును రాక్షసుఁడును, శత్రుసోదరుఁడునైన విభీషణునికి శరణమొసంగుట హానికరమని భావించిరి. ఒక్క హనుమంతుఁడు మాత్రమతనికి తప్పకశరణమొసంగవలెనని యభిప్రాయపడెను. శ్రీరాముఁడతనితో నేకీభవించెను. శ్రీరాముని శరణాగత రక్షణతత్త్వ మపూర్వమైనది.

ఒక్కమాఱైన నీవాఁడ దిక్కునీవె
యనెడువానిని రక్షింతువభయమిచ్చి
సర్వభూతాళి నభయాన సంచరింప
వాని శరణార్థి రక్షించు వ్రతమునాది.

యని యాతఁడు పల్కుట యిందుకుఁ దార్కాణము. రాముఁడు లాభము నపేక్షించి విభీషణుని చేరఁదీయలేదు. శరణాగత రక్షణమాతనికిసహజసిద్ధము. అతఁడు సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడు కదా! యుద్ధసమయమున విభీషణుఁడు చేసిన సాయముకూడ చాలగొప్పది. సత్వర విజయప్రాప్తికాతండు నైతము కొంత తోడ్పడెననుటలో నతిశయోక్తిలేదు.

ఆచార్యుల వారితరకాండములందువలెనే యీ కాండమునందును ఆయా పాత్రల శీలములను చక్కగా పోషించియున్నారు. శ్రీరాముఁడు

ధర్మస్వరూపుఁడు. యుద్ధసమయమున బాణముల సోకోర్వలేక రావణుఁడే శరణాగతుఁడగునేమో యని సుగ్రీవుఁడు సందేహము ప్రకటింప నప్పుడాతనికయోధ్యయే యొసంగెదనని చెప్పఁజాలిన మహానుభావుఁడు. రావణవధానంతరము విభీషణునిఁబిల్చి వెంటనే యాతనికి సాంప్రదాయిక కార్యములు యథావిధిగా నొనర్పవలెనని యాతఁడుపదేశించెను. వైరములు మరణాంతములనియు, రావణుఁడు నీకువలెనే నాకును సోదరుఁడేయనియు విభీషణునితో నాతఁడు పల్కుట యతని సమభావమును ప్రకటించుచున్నది. అతని భ్రాతృప్రేమ యనన్యాదృశమైనట్టిది. లక్ష్మణుఁడు మూర్ఛితుఁడైనప్పుడతఁడు

పడయఁగావచ్చు భార్యల బంధుతతుల
దేశదేశంబులందు సందియములేదు
దేశదేశంబులందు నెందేనిగాని
భ్రాతను సహోదరుని పొందువాడలేదు.

అనిపల్కి యుండుట జగత్ప్రసిద్ధము. అతఁడయోధ్యలో భరతుని సంభావించిన తెఱంగుకూడ నతని యలౌకిక భ్రాతృవాత్సల్యమునకు తార్కాణము. భరతుని భ్రాతృభక్తి సాటిలేనిది. శ్రీరాముఁడు భరద్వాజాశ్రమమున నుండి ముందుగా నాంజనేయుని నయోధ్యకు పంపెను. శ్రీరామునికి స్వాగతమొసంగుటకై భరతుఁడు కావించిన ప్రయత్నములాతని నిర్మలమైన భక్తిని చెప్పకచెప్పుచున్నవి. తనవంటి పుత్రుఁడును భరతునివంటి సోదరులును నెచ్చటను నుండఁబోరని రాముఁడే యొకప్పుడు చెప్పియుండెను. శ్రీరామభరత సమావేశము నాచార్యులవారెంతో రమణీయముగను ఉదాత్తముగను వర్ణించియున్నారు. రావణవధానంతరము శ్రీరాముఁడు సీతను గూర్చి పల్కిన పల్కులనుబట్టి యాతని కామె శీలమునెడ సందేహముగలదని భావింపరాదు. లోకమును సంతృప్తిపరచుటకై యాతఁడట్లు కావించెను. సీతయు నగ్నిలోఁజొచ్చి తనయలౌకిక పాతివ్రత్యమును పావిత్ర్యమును ప్రకటింపజాలెను. ఆమె యగ్నిప్రవేశమునకు ముందు-రామునితోఁబల్కినపల్కులు వైశిష్ట్యముతోఁగూడియు (పుట 100) పరమసత్యములై భాసించుచున్నవి. రావణవధానంతరము రాక్షసస్త్రీల బాధింపవలదని సీత హనుమంతునితోఁ జెప్పుట ఆమె సహజకరుణాళుత్వమునకు నిదర్శనము. రావణాదులు రాక్షసులైనను హృదయశూన్యులుకారు. ఆచార్యులవారి విషయమును పెక్కు

సన్నివేశములలో వ్యక్తముచేసి యుండిరి. పుత్రులు మరణించినప్పుడును, కుంభకర్ణుడు మరణించినప్పుడును, రావణుఁడు కావించిన విలాపముచని హృదయమందలి యార్ద్రభావమును సూచించును. సరమ, త్రిజట, మండోదరి మున్నగువారు రాక్షసాంగనలయ్యును మహోదాత్త చరిత్రలు. సీత అగ్నిప్రవేశము తరువాత బ్రహ్మశంకరులేకాక దశరథుఁడుకూడ స్వర్గము నుండి విమానముపై నరుదెంచి ఆశీర్వాదము లొసంగుట అద్భుతముగా నున్నది.

రావణవధకు పూర్వమగస్త్యుఁడరుదెంచి శ్రీరాముని కాదిత్య హృదయము నుపదేశించినట్లు వాల్మీకి రామాయణము నందున్నది. ఆచార్యుల వారుకూడ దానిని సూచించి దానిమహిమను చక్కఁగా వివరించిరి. రాముఁడు దానిని యథావిధిగాఁ బఠించెను. సూర్యుడు ప్రత్యక్షమై యాతనికి తప్పక విజయముకలుగునని ఆశీర్వదించెను. ఆదిత్య హృదయపఠనము వలన రోగములు నశించుటయేకాక విజయముకూడ సిద్ధించును. దానిమహిమ అప్రతిమానమైనట్టిది.

శ్రీమాన్ ఆచార్యులవారిశైలి నివాతస్తిమితకాసారజల సదృశమైనట్టిది. ప్రసాదమాధుర్యములు దానినిసర్గ గుణములు. పాండితీ ప్రకర్షను ప్రకటించుటకై వారెచ్చటను యత్నింపరు. వారి రచన సులభమై, సరళమై, సరసమై ఒడుదుడుకులు లేకుండ సాగిపోవును. దానికి వారి హృదయమునసే కాకదేహమందంతట రక్తమువలె వ్యాపించియున్న భక్తియే కారణము. వారి రచన భక్తిసంపన్నుని జీవితమువలె నిర్మలమును పవిత్రమునై పరిఢవిల్లును.

జన్మము లొసంగినన్ నిన్నె సంస్మరించు
మనుగడ నిడఁగమాత్రంబె మనవిసేతు
నదియు నీస్వేచ్ఛమైఁ జేయుమయ్య రామ!
రామ గోవిందరామ శ్రీరామరామ !

యనునది వారి తుదికోరిక. అకోరిక దుర్లభమైనదికాదు. భక్తజనతా పరాధీనుఁడైన శ్రీరాముఁడు దానిని పూరించితీరును. ఆచార్యులవారు భక్తితో నారంభించి కావ్యమును భక్తితోముగించినారు. అనారోగ్యస్థితిలో నుండి కూడ వారీ మహాకార్యమును నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందించుటకు

శ్రీరామచంద్రుని కరుణయేకారణము. వారు భగవదనుగ్రహమునకు పాత్రులై ఆయనుగ్రహమును కావ్యరూపమున లోకమునకుకూడ నందిచ్చినారు. ఇది వారి జీవితాదర్శమునకేకాక జన్మచారితార్థ్యమునకును గొప్ప సూచన. వారు శ్రీరామచంద్రుని అనుగ్రహమున ననామయశోభితముగను, నిర్మలముగను, నిస్పృహముగను శేషజీవితమును బుచ్చుదురుగాకయని ప్రార్థించుచు విరమించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని
21–7–71

# పీఠిక

పరిశోధనా పరమేశ్వర, విద్యారత్న
**ఆచార్య నిడదవోలు వేంకటరావుగారు ఎమ్. ఎ.**
ఆంధ్రశాఖ మాజీఅధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము

"రాయను నక్షరంబు ముఖరంగతటిన్నటి యించినంతనే
పాయునఘంబుమాయన కవాట గతింజారనీ దభేద్యమై
ఆయఘహారితారకమనాత్తర మంత్రమునంస్మరించి రా
మాయన మోయటంచుఁ గుసుమాంజలిఁ గూర్చెదనిందు వేడుకన్.

శ్రీరామ భక్తాగ్రగణ్యులు బాలాత్రిపురసుందరీ ప్రసాద లబ్ధ భవ్య కవితాసంపన్నులు నైన శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులవారు ధార్మిక రాముడు అనుపేర కిష్కింధాకాండము రచించినవెనుక "సుందరరాముడు" అనుపేర "సుందరకాండము" రచించిరి. సుందరకాండ రచన చేయునప్పుడు వారు రోగపీడితులై యుండిరి. ఆయన "నఖండముదంబున" దానిని వ్రాయుచుండగా, "నుద్దండగతి రుజావృతులైరి. అది గండముగా పరిణమించినది. శ్రీరాముఁడండయై యా "గండము దాటగజేసి, యాకాండము పూర్తిచేయించెను". రామభక్తి బలమువలన ఆత్మకూరివారు తమ యింటి పేరు సార్థకమగునట్లు, ఆత్మవిశ్వాసముగలవారు. వారంత శ్శుద్ధితో నిట్లు యుద్ధకాండము శ్రీరాముఁడే వ్రాయింపగలడని మనకు సూచించినారు.

"ఆయువొసంగి రామకథనంతయుఁ బూర్తిగ వ్రాయఁజేయఁడే
శ్రేయసిగూడి రాజ్యరామఁ బ్రీతి వహించెడి యుద్ధకాండమా
ప్యాయముతోడ వ్రాయఁగలపాటవముం గృపసేయువాఁడె రా
మాయనమో" యటంచునతమాత్మఁ దలంచెడి వానికండయై.

"రామకార్యమెంచి బ్రతుకగలనని 'రాముడే వ్రాయింపగలడని" దృఢనమ్మకముతో శ్రీరామునికిట్లు విన్నపము చేసినారు

"నాకనారోగ్యముం బాపి సాకుమీవ
నీకు పట్టాభిషేకంబు నేనొర్ప
సీతకవఁగూడి పట్టాభిషిక్తురాము
కనులవిందుగ ననుఁ జూడఁగలుగనిమ్మ"

అ_ర్త త్రాణ పరాయణుండగు శ్రీరామచంద్రుఁడాచార్యసూరివారి విన్నప మాలించినాడు. వారికోర్కెను సఫలముచేసినాడు. గోవిందాచార్యులవారు యుద్ధకాండను సంపూర్ణముగా, "పట్టాభిరాముడు" అనుపేర రచించి శ్రీమద్రామాయణమును సంపూర్తిచేసి రామచంద్రుని పట్టాభిషేకము వర్ణించి తాము కవితా చరితార్థతగాంచినారు. మనలను మానసికముగా శ్రీరామ పట్టాభిషేకముగని, పట్టాభిరామునికి భక్తిప్రపత్తులు సలుపు భాగ్యము కల్పించినారు. శ్రీరామ పట్టాభిషేకమే గాక వారి కవితకు గూడ పట్టాభిషేకమైనది.

సజీవమైన యధ్యాత్మిక దృష్టిలుప్తమై నిర్జీవమైన యాంత్రిక విధానమున జీవించుచున్న మనకీనాడు గోవిందాచార్యులవారు, తమ గోవింద రామాయణమూలమున - చిత్తశుద్ధి, కార్యదీక్ష - భక్తి - ప్రపత్తి జీవిత విజయసాధన నుపదేశించి, ఆధ్యాత్మిక ప్రవీణులనుగా నొనర్చినారు. ఆచార్యులవారు తమ కృతిమూలమున నాంధ్రులకందించిన మహత్తర సందేశమీ రామభక్తి భావనయే-రామరాజ్యము వలసినచో రామభక్తియే సదా ప్రాతిపదిక.

"పట్టాభిరాముఁడు" అను పేరుగల యీ యుద్ధకాండమున ప్రథమ ద్వితీయఖండములు రెండింటియందు నీక్రింది రీతిని పద్యములు గలవు. తక్కిన పూర్వకాండలవలె నిందలి యాశ్వాసములకు ప్రత్యేక నామములుగలవు

ప్రథమ ఖండము

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | సంగ్రామ సన్నాహాశ్వాసము | 272 + 3 పద్యములు |
| ద్వితీయాశ్వాసము | అభయాశ్వాసము | 394 + 4 పద్యములు |
| తృతీయాశ్వాసము | సంగ్రామాశ్వాసము | 697 + 2 పద్యములు |

ద్వితీయ ఖండము

| | | |
|---|---|---|
| చతుర్థాశ్వాసము | విజయాశ్వాసము | 562 + 4 పద్యములు |
| పంచమాశ్వాసము | పట్టాభిషేకాశ్వాసము | 418 + 20 పద్యములు |
| | పద్యములు. 2376. | 2343 + 33 |

యుద్ధకాండము రామాయణమ్మున చివరకాండ. ఇందు రామరావణ యుద్ధము ప్రధానమైనది. రామరావణ యుద్ధమేగాక, వానరరాక్షస సైనికుల, సేనాధ్యక్షుల, మహావీరుల, హనుమత్సుగ్రీవాంగదాది ప్లవగ మహానాయకుల యుద్ధములీకాండయందు వర్ణితములు — కుంభకర్ణవధ, ఇంద్రజిల్లక్ష్మణ సమరము లిందు ముఖ్యఘట్టములు.

యుద్ధవిజయానంతరము శ్రీరామచంద్రుడు లంకలో విభీషణునికి పట్టాభిషేకము నొనరించి, సీత యగ్నిప్రవేశ సమయంబున, శంకర బ్రహ్మాది దేవతలువచ్చి, శ్రీరామునికాతని సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తిత్వము దెలిపి, యాతని కీర్తించిరి. సీతను, పరమ పతివ్రతయని యగ్నిహోత్రు డర్పింపగా శ్రీరాముడామెను స్వీకరించి, యయోధ్యకు వెడలెను. దారిలో సీతకు, నాయా ప్రదేశములను చూపుచు, పూర్వకథలను జ్ఞప్తికి దెచ్చుచు, అయోధ్యకువచ్చి, భరతునికి యువరాజ్యపదవినిచ్చి దాను పట్టాభిషిక్తుడై ప్రజలను తన పేరన్వర్థమగునట్లుగా రామరాజ్యముగా పాలించుచుండెను.

ఇందువలన, యుద్ధకాండమను పేరు మూలమునమున్నను శ్రీరామ పట్టాభిషేకముకూడ నిందు వర్ణితమగుటచేత దీనికి "పట్టాభిరాముడు" అను నామ మన్వర్థమైనది. రాముడు లక్ష్మణుడు, సుగ్రీవుడు, రావణుడు, ఇంద్రజిత్తు - అను నైదుగురు నీ కాండమున ముఖ్యులగుటచే, నిది యైదాశ్వాసములతో నుండుట యెంతయు సమంజసమై యున్నది.

యుద్ధకాండము కేవలము యుద్ధవర్ణనలవలననే గాక విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చుట (విభీషణ శరణాగతి) అగస్త్యుడు శ్రీరామునికి ఆదిత్యహృదయముపదేశించుట. (ఆదిత్యహృదయము) అను రెండు ఘట్టములవలన నధిక ప్రాముఖ్యము వహించియున్నది. మూల రామాయణమున గల కాండలలో యుద్ధకాండ కడపటిదేగాక యన్నింటికన్న పెద్దది. ఈ గోవిందరామాయణమున - నది' యన్నింటికన్న పెద్దది. ఫలశ్రుతితోగూడ 2376 పద్యములలో నున్నది. కృత్యాది 9 పద్యములతో 2385 పద్యము లిందుగలవు.

# గ్రంథాంతము

## మంగళ మహాశ్రీవృత్తము

ఈ గోవిందరామాయణము మంగళమహాశ్రీవృత్తముతో ముగించి శ్రీ గోవిందాచార్యులవారీ రామాయణమునకొక లోకోత్తరమైన విశిష్టతను చేకూర్చిరి. ఇంతవఱకు ప్రకటితమైన రామాయణానువాదములయందును నిది కానరాలేదు. ఆంధ్ర కావ్యసాహిత్యమున ననూచానముగా వచ్చుచున్న సంప్రదాయములలో "కావ్యము" మంగళ మహాశ్రీవృత్తముతో ముగించుట యొకటి. ఆదిని నన్నెచోడ మహాకవి తన కుమార సంభవమును శ్రీతో ప్రారంభించి మంగళ మహాశ్రీవృత్తముతో ముగించియున్నాడు. ఆ వెనుక వాఙ్మయములో వ్రేళ్ళపై లెక్కపెట్టదగిన కొందఱు కవులు మాత్రమే యీ సంప్రదాయమును పాటించిరి.[1] ఆద్యతన యుగముననిది పూర్తిగా విస్మృతమైనది. "మంగళాదీని, మంగళమధ్యాని మంగళాంతాని" అని మన పూర్వుల యనుశాసనము. కావున అట్టి పూర్వ విశిష్టసంప్రదాయము ననుసరించి యీనాడీ మంగళ మహాశ్రీవృత్తముతో తమ కావ్యమును, ముగింపజేసి, దీనినుద్ధరించినందులకు శ్రీ గోవిందాచార్యులవారి నత్యంతము నభినందించుచున్నాను.

## నిర్వచన రచన

వాల్మీకి రామాయణము మూలమున నిర్వచనము అనుష్టుప్ శ్లోకములలోనున్నది. ఆదికావ్యమగు రామాయణముననుసరించి కాళిదాసాది కృతకావ్యములన్నియు నిర్వచనములే. ఈ దృష్టితోనే తిక్కన ఉత్తరకాండను నిర్వచనముగా రచియించియున్నాడు. తరువాతి కవులు భాస్కరాదులు మొదలుకొని గోపీనాథము వెంకటకవి వఱకును, గద్యపద్యమిశ్రితమగు చంపూ కావ్యముగానే రచించిరి. కాని యిరువదవ శతాబ్దిని-వావిలికొలను సుబ్బారావు—జనమంచి శేషాద్రిశర్మగారలు నిర్వచనముగానే మూలముననుసరించి రచియించినారు. ఆ రీతిగనే నేడు గోవిందరామాయణమును, ఆచార్యులవారు, నిర్వచనముగ రచియించుట ప్రశంసనీయమైయున్నది. నిర్వచన

---

1. దీనిని గూర్చినా ఉదాహరణ వాఙ్మయ చరిత్ర చూడనగును.

రచన వాల్మీకి మహర్షి కే కాక, మూలరామాయణమునకు విధేయత్వము సూచించును.

అనిర్వచనీయమైన రామకథను నిర్వచించుటకు భగవత్స్వరూపుడగు వాల్మీకికితప్ప యితరులకు సాధ్యముకాదు. అయినను కవులు రామభక్త్యతిశయముచేత శ్రీమద్రామాయణము తమ శక్తికొలది రచించి తమ జీవితము తరింపజేసికొని ధన్యులగుచున్నారు. ప్రస్తుత గ్రంథకర్తలు గోవిందాచార్యులు గారు నట్టి ధన్యజీవులు. వారెట్లు దీనిని రచించిరో తెలియపఱచిన - రామాయణ రచన మూలమున వారిజన్మ యెట్లు సార్థకమైనదియు విశదమగును.

## గ్రంథరచనాప్రణాళిక

### విశిష్టత

గోవిందరామాయణ రచన—తెలుగున నింతవరకు వెలువడిన రామాయణములతో నొకప్రత్యేక విశిష్టత సంపాదించినది. మూలమున — రామాయణము బాల, అయోధ్యా, ఆరణ్యా, కిష్కింధ, సుందర, యుద్ధకాండములను నాఱుకాండములలో నున్నది. ఉత్తరకాండ కూడ గలదు. సాధారణముగ నుత్తరకాండను కవులు యుద్ధకాండాంతముననే రచింతురు. కాని ఆచార్యులుగారు, రామాయణరచన - తక్కినకవులవలె బాలకాండముతో ప్రారంభింపక, ఉత్తరకాండముతో ప్రారంభించినారు. ఇది సమంజసమే కాక సహేతుకము. వారు రామాయణ కథాపౌర్వాపర్యములను చక్కగా నవలోడనము చేసియే యుట్లుత్తరకాండ ముందురచించినారు. ఇది వారిపరిశోధనా పాటవము సూచించుచున్నది.

భారతమున. రామాయణకథ ఆరణ్యకాండమునగలదు. భారతమూలమునను్న రామాయణమును, ఆంధ్రభారత కవిత్రయములో నొకడైన ఎఱ్ఱన తెలుగు చేసియున్నాడు. ఆరణ్యపర్వము షష్ట, సప్తమాశ్వాసములలో 320 గద్యపద్యములతో నందున్న రామాయణకథ. ఉత్తరకాండమున

1. భార—అర-6ఆ. 266 నుండి 409. 7ఆ. 1-167 = 320.
మూల కథలో గూడ మార్పులున్నవి.

నున్నట్లుగా, రావణ, కుంభకర్ణ, విభీషణ జననాదివృత్తాంతము, రావణుడు తపస్సుతో దుర్నిరీక్ష్యుడై యుండుట అనుసంశములతో ప్రారంభమగుచున్నది. భారతముననున్న యీ రామాయణమును. "వ్యాసరామాయణము" అని పేర్కొనవచ్చును. ఆచార్యులవారుత్తరకాండముతో ప్రారంభించుటచే, వారు వ్యాసవాల్మీకి రామాయణములను రెండింటిని సమన్వయించినారని ద్యోతకమగుచున్నది.

ఎఱ్ఱన వెనుక నాంధ్రసాహిత్యప్రపంచమున రామాయణరచన నుత్తరకాండముతో ప్రారంభించినవారు గోవిందాచార్యులవారొక్కరే. తక్కిన రామాయణానువాదకులలో కొందఱు — యుద్ధకాండాంతమునసే ఉత్తరకాండము రచించిరి. పందొమ్మిదవశతాబ్దిలో రామాయణ యథామూలానువాదమునకాద్యుడైన గోపినాథ వెంకటకవి – ఉత్తరకాండము రచింపనేలేదు. వేంకటకవికి పూర్వులు భాస్కరాదులుత్తరకాండము దెలిగింపలేదు. కావున నీవిషయమున గోవిందరామాయణ మొకప్రత్యేకత సంతరించుకొనినది.

## కాండప్రతినామములు

# ఆశ్వాసనామ సార్థకత

ఇంతవరకు తెలుగు భాషలో నే రామాయణానువాదమున కన్పట్టని యొక విశేషమిందు కన్పట్టుచున్నది. మూలమునందువలె, తెలుగున — కథాక్రమమును ననుసరించి చేసేప్పుడియున్న బాలకాండాది నామములేగలవు. గోవిందరామాయణమున మాత్రమట్లుగాక, ఆ యా కాండములలో గల విషయ విశేషములను బట్టి విభజింపబడియున్నవి. ఇందున మఱియొక విశేషమున్నది. వాల్మీకిరామాయణమున శ్రీరాముడే కథానాయకుడైనను, కాండల నామముల మూలమున శ్రీరాముని మూర్తిమత్త్వము, రామాయణ కథాశరీరమునందెట్లు వ్యాప్తమై తేజరిల్లుచున్నదో మనకవగతముకాదు ఈ రామాయణమున చూడుడు. ప్రతికాండయు రాముని పేరనే యుండుటచే నిదియొక ప్రత్యేక ప్రతిష్ఠాగౌరవము బడసినది.

1. బాలకాండము – సీతారామము
2. అయోధ్యాకాండము – పాదుకా పట్టాభిషేకము[1]
3. అరణ్యకాండము – రక్షకరాముఁడు
4. కిష్కింధాకాండము – ధార్మికరాముఁడు
5. సుందరకాండము – సుందరరాముడు
6. యుద్ధకాండము – పట్టాభిరాముడు
7. ఉత్తరకాండము – ఉత్తరరామచరిత్రము

పై విభజనవలన మనకు రామాయణఘట్టములతో రాముడే మన కడుగడుగునకు ప్రత్యక్షమగుచున్నాడు. అంతేకాక యీ నామముల మూలమున వ్యక్తిగతముగా నాయాసందర్భములలో, తదనుభవములను గ్రహించి, మనము తాదాత్మ్యమును పొందగలము. అనగా, దీనిని చదువుచున్నప్పుడు కవితా శైలిపైగాక కావ్యకథానాయకుడగు శ్రీరామచంద్రునియందే లగ్నమగునని యర్థము.

## ఆశ్వాస విభాగములు

పై రీతిగానే, ఆశ్వాసములును ప్రథమ ద్వితీయాది నామములచే గాక, విషయములను బట్టి నామనిర్ణీతము లైనవి. ఆశ్వాసవిభాగమును, నాయా నామములతోనే గాక వానియందుగల పద్యసంఖ్యతోగూడ క్రిందవివరించుచున్నాను.

**బాలకాండ**

| | | | |
|---|---|---|---|
| సీతారామము: | 1. శిలాకృపాశ్వాసము | – 124 | |
| | 2. అనతారాశ్వాసము | – 167 | |
| | 3. కల్యాణతాశ్వాసము | – 590 | 881 |

---

1. ఈ భాగమున ఆచార్యులవారు పాదుకలను వర్ణించినపుడు పాదుకారాముడు అనియే వాడిరి. అట్లున్న చదువరులకు బోధ్యమానము కాదు. కావున ప్రసిద్ధమైన పాదుకాపట్టాభిషేకము అను నామమే వాడినారు.

## అయోధ్యాకాండ

పాదుకా పట్టాభి-
షేకము:

| | | | | |
|---|---|---|---|---|
| | 1. | రాజ్యాశ్వాసము | - 160 | |
| | 2. | మాయాశ్వాసము | - 267 | |
| | 3. | సత్యాశ్వాసము | - 535 | |
| | 4. | భక్తాశ్వాసము | - 661 | |
| | 5. | ప్రపన్నాశ్వాసము | - 570 | |
| | 6. | పాదుకాశ్వాసము | - 111 | 2364 |
| | | | | 3245 |

## అరణ్యకాండ

| | | | | |
|---|---|---|---|---|
| రక్షక రాముడు: | 1. | వాత్సల్యాశ్వాసము | - 182 | |
| | 2. | విమోచనాశ్వాసము | - 138 | |
| | 3. | పరిత్రాణాశ్వాసము | - 264 | |
| | 4. | ధర్మాశ్వాసము | - 495 | |
| | 5. | ఆత్మాశ్వాసము | - 318 | |
| | 6. | పరమాత్మాశ్వాసము | - 251 | 1648 |

## కిష్కింధా కాండ

| | | | | |
|---|---|---|---|---|
| ధార్మిక రాముడు; | 1. | దాక్షిణ్యాశ్వాసము | - 125 | |
| | 2. | ప్రతిజ్ఞాశ్వాసము | - 158 | |
| | 3. | సత్యపరాక్రమాశ్వాసము | - 198 | |
| | 4. | సఖ్యాశ్వాసము | - 204 | |
| | 5. | అన్వేషణాశ్వాసము | - 119 | |
| | 6. | ప్రతాపాశ్వాసము | - 245 | 1049 |

## సుందరకాండ

| | | | | |
|---|---|---|---|---|
| సుందర రాముడు | 1. | తరణాశ్వాసము | - 110 | |
| | 2. | ప్రయత్నాశ్వాసము | - 210 | |

| | | | |
|---|---|---|---|
| | 3. దర్శనాశ్వాసము | - 665 | |
| | 4. ఉపదేశాశ్వాసము | - 321 | |
| | 5. ప్రమదాశ్వాసము | - 158 | 1464 |

**యుద్ధకాండ_ప్రథమఖండము**

| | | | |
|---|---|---|---|
| పట్టాభిరాముడు: | 1. సంగ్రామసన్నాహాశ్వాసము | -284 | |
| | 2. అభయాశ్వాసము | - 398 | |
| | 3. సంగ్రామాశ్వాసము | - 699 | |
| **ద్వితీయఖడంము** | 4. విజయాశ్వాసము | - 566 | |
| | 5. పట్టాభిషేకాశ్వాసము | - 438 | 2385 |
| | | | 9791 |

**ఉత్తరకాండ**

| | | | |
|---|---|---|---|
| ఉత్తరరామచరిత్ర | 1. విహారాశ్వాసము | - 143 | |
| | 2. వియోగాశ్వాసము | - 169 | |
| | 3. సుతోదయాశ్వాసము | - 148 | |
| | 4. నిర్గమనాశ్వావము | - 153 | |
| | 5. పునస్సంయోగాశ్వాసము | - 138 | 751 |
| | 36. ఆశ్వాసములు | | 10542 |

ప్రచారములోనున్న ప్రస్తుతరామాయణక్రమమునను సరించి, ఉత్తర కాండ చివర పెట్టినాను.

పై వివరణనుబట్టి ఈ మహాకావ్యము 36 ఆశ్వాసములతో, 10542 పద్యములతో విరాజిల్లుచున్నది. ఇందు ముప్పదియాఱాశ్వాసములే యుండుటలో నొకమహోత్తమ తత్త్వమిమిడియున్నది. అదిహరిహరాద్వైత తత్త్వము. శైవమతము ననుసరించి, ఆ మతతత్త్వము షట్త్రింశత్తత్త్వ సంపుటీకరణము.[1] షట్త్రింశత అనగా 36 శ్రీరామశివతత్త్వము "ఏకమేవాద్వితీయమ్"

---

1. శైవమత షట్త్రింశ తత్త్వ వివరణమునుగూర్చి నేను విప్రుల్లపీఠికా వ్యాఖ్యాన సమేతముగ పరిష్కరించిన పండితారాధ్యుల శివ తత్త్వ సారము చూడనగును. అది కృష్ణాపత్రికాధిపతులచే ప్రకటితము-1968.

గలవి యైనవి వాస్తవముగా, నీ యాశ్వాసాంత పద్యములన్నియు నొక ప్రత్యేకాశ్వాసముగా పరిగణింపవలెను. ఈ 217 సంఖ్యయందును నొక సాంకేతిక మిమిడియున్నది. కృతిపతి శ్రీరాముడు దశావతారస్వరూపుడు. ఈ పద్యముల సంఖ్యకూడిన దశమసంఖ్యయే వచ్చును 2+1+7 = 10. దీనికి "ఆశ్వాసాంతాశ్వాసము" అని నామముంచిన యన్వర్థమగును.

ఇట్టి నిగూఢవిషయము లెన్నియో నీకావ్యగర్భమున నంతర్భూతములై యున్నవి.

ఈ 217 పద్యములు రెండు శతకములు. వీనిని ఆత్మనివేదనాశతకములనవచ్చును. ఈ రెండును భక్తులు పారాయణ కుపయోగించు మహత్తగలవి నవీనయుగకవితా సంప్రదాయములతో నన్వయించిన నిది ఆత్మాశ్రయకవిత.

ఛందస్సు - పద్యకావ్యములలో ద్విపదరచన

"గద్యపద్యమయం కావ్యమ్ చంపూరిత్యభిధీయతే" అను నియమమును బట్టి చంపూకావ్యములైన మనప్రబంధములలో, పద్యములకు నడనడవచనములు మాత్రమే గన్పట్టును కాని యిందట్లుగాక వచనముగాక, దానిబదులు ద్విపదలుపయోగింపబడినవి. కావ్యము నిర్వచనముగాన, ఆచార్యులవారు వచనప్రసక్తిలేని ద్విపదల ననుసంధించిరి. తిక్కనవచనము నుపయోగింపకుండ పద్యములనే యుపయోగించెను. అతని కాలమున ద్విపదలకు కావ్యప్రవృత్తి లేకపోలేదు. కాని అవి, పాదనియతికలవి కావు కావున యాతడుజ్జగించెను.

ఆచార్యులవారు ద్విపదలను పద్యకావ్యములో ప్రవేశపెట్టి యొక నూతన సంప్రదాయము నెలకొల్పిరి.[2]

## దండకము

పద్యకృతులలో దండకమును స్తుతిపరముగానే యుపయోగింతురు కాని, ఆచార్యులవారిందుఒకవృత్తాంతమును చెప్పునప్పుడును, సంభాషణయం

---

1. తిక్కన భారతమున 234 పద్యములుగలవు. ఆశ్వాస సంఖ్య 47.

2. ఈ ద్విపదలలో ప్రాసయతి వాడుట నూతన సంప్రదాయమే. ఇది ప్రాచీనులైన పాల్కురికి సోమనాథుని మతము తరువాతి వారు వాడలేదు.

దునుగూడ వాడిరి. ఇది వారు ప్రవేశపెట్టిన నూత్నపథకము అయినను నాంయూ సందర్భములలో దండకము నేకధారగాక వాక్యవిభజనచేసి ముద్రించుట నూతనమేకాక యాకర్షణీయమైయున్నది. (చూ. ధార్మిక రాముడు (కిష్కింధ) పుట 99 లక్ష్మణసుగ్రీవసంభాషణ, పట్టాభిరాముడు — (యుద్ధ కాండ) విభీషణుడు రాముని ధర్శించుటకుముందు స్వగతము మొదలగునవి యుదాహరణము.

## వృత్తసంపత్తి

ఆచార్యులవారు, తమరచనలోని రామాయణమునందంతటను, బహుళ ప్రచారములోనున్న చంపకోత్పల సీసగీతములనే వాడియున్నారు. మత్తేభ వృత్తములు చాలతక్కువ. శార్దూలములంతకంటె తక్కువ - కందములంద ముగా నక్కడక్కడ పొందుపడినవి ఇందు పయుక్తములైనవృత్తములలో చంపకోత్పలములే యన్నింటికన్న నధికము:[1] చంపకోత్పలములు హెచ్చుగా వాడుటలో విశేషమున్నది. ఇవి రెండును పుష్పముల పేళ్లతోనున్నని కావున పూజార్హములైన, యీ రెండింటిని, యధికముగా నుపయోగించి, శ్రీరాముని, తమవాక్పుష్పములచేత నాచార్యులవారర్చించియున్నారు. ఇదీయింటి విశిష్టత.[2]

## విశేషచ్ఛంధస్సులు

ఇందు, అంబురుహము, నర్కుటము, ఆర్యావృత్తము, ఇంద్రవజ్ర వినయవృత్తము, బింబవృత్తము, భద్రకవృత్తము, తరల, తోటకము, తోవ కము, దోదకము, మంజుభాషిణి. మానిని, మాలిని, కవిరాజవిరాజితము,

---

1. ఈ మహాకావ్యమునసనే యేవృత్తములు, ఛందస్సులు, ఎన్నెన్ని వాడబడినవో తెలుపుపట్టిక తయారుచేయవలెనని సంకల్పించితిని. కాని కాలహారణమగునని మానితిని: పాఠకలోకమును క్షమింప కోరుచున్నాను.

2. పాల్కురికి సోమనాథుడు తెలుగున తొలిశతకమగు వృషాధిప శతకము వ్రాసినపుడు, చంపకోత్పలములనేవాడి పై అభిప్రాయ మునకు మార్గదర్శకుడైనాడు.

లాక్షణివృత్తము, మేఘవిస్ఫూర్జితవృత్తము, వసంతతిలకము, శిఖరిణి సుగంధి స్రగ్విణి, స్వాగతము అనునవి వాడబడినవి. వీనిలో కొన్ని కావ్యములలో తఱచు ప్రయుక్తములుగావు. వానినిగూర్చి తెలుపుచున్నాను.

1. అర్కుటము, "కొలిచినరామమూర్తి మృదుకోమలపాదములన్"
(సీతారామము-114 పుట)

అని యున్నది. అది 'నర్కుటము' 17 వదియ అత్యష్టిఛందమున పుట్టినది. 11 వ యక్షరము తర్వాత యతి — పైనయతి స్థానమల్లేయున్నది. న, జ, భ, జ, జ, వ గణములు.

2. ఆర్యావృత్తము – సీతారామము పుట 32
"మునితతియున్ జనంబులు ప్రమోదమునందిరిభూ"
ఇది ఆర్యావృత్తమని ముద్రితమైయున్నను నర్కుటమే. యతి 11 వ అక్షరముపై నున్నది. గణములు సరిపోయినవి.

3. లాక్షణీవృత్తము – పాదుకాపట్టాభిషేకము పుట 314
"రాముఁడుసభకును భరతునకును మధురంబుగ నిజనియతిన్ దెలుపన్"
అప్పకవీయమున లాక్షణివృత్తము అనునది లేదు. లక్షణసారమందున్నది.

తోవకవృత్తము "శ్రీరఘురాముని సేవనుబొందన్" అనియు
పాదపవృత్తము "సాగిలి మ్రొక్కుచు జానకి తోడన్" అనియు రెండున్నవి. వీనిపేర్లు భిన్నముగనున్నను నివిరెండును దోవకవృత్తము ననుసరించినవి. దోదకమునకే తోటకము అను పేరున్నట్లప్పకవీయమున గలదు. ఇది త్రిష్టుప్ఛ్చందస్సునుండి పుట్టినది. 7 వ యక్షరము యతి- భ, భ, భ, గ గ గణములు.

దోదకమును, తోటకమును మధ్యయుగమునందలి కవులుగాని, యీ యుగపు కవులుగాని వాడలేదు. వీని వాడుక ఆచార్యులవారి ఛాందః శాస్త్రపరిజ్ఞానము వెల్లడిచేయుచున్నది.[1]

---

1. వినయభద్రక, బింబ, మేఘవిస్ఫూర్జితవృత్తములు కావ్యములలో ప్రయుక్తములుగావు.

## ఉపజాతులు - సీసగీతాదులు

సీసములు - ఇందుసీసములలో చాలవఱకు, సమతపాటింపబడినది. అనగా నాలుగుపాదములో కేరీతిగా నుండునియమము పాటింపబడినది. కావ్య మధ్యమున సీసమాలిక యిండుటయు విశేషమే. పాదుకాపట్టాభిషేకమున 229-30 పుటలలో 29 పాదముల సీసమాలికగలదు. 238 పుటలో 10 పాద ముల సీసమాలికగలదు. ధార్మికరాముడు పుట 3 లో నొకసీసముగలదు. ఇందైదు పాదములున్నవి. సాధారణముగా సీసములో పాదములు సమసంఖ్య లో నుండుట సంప్రదాయము. ఇట్లే నాలుగుపాదములకుమించిన తేటగీతులు గలవు. రక్షకరాముడు పుట 24లో రెండు గీతమాలికలున్నవి. ఒకటి 11 పాద ములు - రెండవది 8 పాదములుగలది. ఇదియు నొకప్రత్యేకతయే.

## మధ్యాక్కర

తెలుగు సాహిత్యమున మధ్యాక్కరలు నన్నయభట్టుమాత్రమే వాడి యున్నాడు. తరువాతికవులలో నన్నయ ననుసరించినవాడు కాబట్టి ఎఱ్ఱన మధ్యాక్కరలు వాడినాడు. ఆ వెనుక, నాటినుండి నేటివఱకు అనగా నీ యిరువదవశతాబ్దమువఱకు మధ్యాక్కరల నెవ్వరును వాడలేదు. ఇరువదవ శతాబ్దమున కావ్యములలో దీనిని వాడినకీర్తి గోవింబాచార్యులుగారిదే.[1]

"ఈ వెసమస్త కైవల్య మీలోకముతే నీకుమేను
నీవెనిత్యానందమూర్తి వీవెనిత్యుండవున్ సుమ్మి

---

1. కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారు మధ్యాక్కరలతో నైదుశతకములు వ్రాసినారు, కాని వారు తమరామాయణ కావ్యములో దీనిని వాడలేదు. వారేకాదు మఱియెవ్వరును కావ్యములో దీనిని వాడుకచేయలేదు.

దేవదేవేశ రామయ్యా ధ్యేయుండ వీవె సతంబు
జీవాత్మనన్ బ్రోవుమీవ శ్రీశాకృపంజూడుమనన్ను

రక్షకరాముఁడు — పుట 232

పై మధ్యాక్కరలో నన్నయ ననుసరించి కాక ఎఱ్ఱన ననుసరించి, నాల్గవగణము మొదటియక్షరముపై యతిపాటింపబడినది. ఇది అప్ప కవీయ లక్షణ సమ్మతము. నన్నయ యొక్కడే, ఐదవగణము మొదటియక్షరముపై యతిపాటించినాడు. ఈ మధ్యాక్కర రచన ఆచార్యులవారి అపూర్వ వృత్తజ్ఞత వెల్లడించుచున్నది.

## యతిప్రాసలు

"కవిత నేరుపు యతికూర్పు కైపుదెలుపు" అని అడిదము సూరన సూక్తి — ఆచార్యుల వారి కవిత దీనికి చక్కని లక్షణము - యతులు నైసర్గికములై తమంతటతామే నేనేవత్తును నేనేవత్తునన్నట్లుగా నతుకు కొనినవి. ప్రాసశబ్దాలంకారపరము - సంయుక్తాక్షరప్రాసలున్నను నవి దుష్కరములుగాక శ్రవణ సుఖదములై యున్నవి. ఛందోవిషయమున కావ్యమంతయు సర్వలక్షణ సంపన్నమై యున్నది.

ర — ఱ. యతులు ర - ల యతులు - అఖండయతులు ప్రాచీన కవి ప్రయుక్తములు — ఇందవి కలవు గావున లాక్షణికములు కావని యధు నాతన విమర్శకులు శంకింతురు. నిశితముగా పరిశీలించిన యట్టి శంకకవ కాశము లేదు. పరిశీలన చేసియే, నేనీ కావ్యము సర్వలక్షణ సంపన్నమని వ్రాసితిని.

## గురు - కవి - భక్త - స్తుతి

ఈ కృతి యందు గురు, కవి స్తుతితో బాటు అవతారికలో భక్త స్తుతి యుండుట విశేషము.

**కవిస్తుతి-ఆదికవివాల్మీకి**

ఉ. [1]నారద సూక్తమైన రఘునాథుకథన్ విని యేఘనుండుళ్ళం
గారరసైక లగ్నమగు క్రౌంచయుగిన్ మగదాని బోయపో
కారుప, శోనపొందుకలకన్ శపియింప దదుక్తిమాధురీ
సారమె సత్కవిత్వ మయిసంధిలె నమ్మహితాత్ము నెన్నెదన్.

తక్కిన కవుల వలెగాక, వాల్మీకిని – ఆచార్యుల వారు దీవింపు
మని ప్రార్థించినారు.

శా. గారాబంబున జానకీధవు మహేకావ్యంబులం గోరదీ
ధీర స్వాంత మొకప్పుడేని, అలవై దేహీశు వాత్సల్యమే
కోరుంగానిమహాత్మ! నిన్దలఁచినీగోరంత సద్భక్తిచే
ప్రారబ్ధంబులయించురీతిమనెదన్ వాల్మీకి దీవింపుమా.

సీతారామము - అవతారిక - 11,12 పద్యములు

గీ. తాను తగియించి భూలోకతారణముగఁ
గలుపహరరామచరితంబు గావ్యరీతి
నాదిగాఁ బల్కి మృతజీవియైన మునికి
ఆచిరంజీవి కెపుడు దాసోహమందు.

పాదుకా పట్టాభిషేకము అవతారిక(23)

**రామభక్తస్తుతి**

ఆంజనేయుడు.

గీ. సతము శ్రీరామ నామసంస్మరణఁ జేసి
యనుపమానందమగ్నుఁ డై యమృత జీవి
యైన రామభక్తుఁడు శ్రీమదాంజనేయు
నాత్మ, నిల్పెద భక్తి దాసోహమనుచు. 25

1. "మానిషాద" అన్న ప్రారంభశ్లోకమునకు ఆచార్యులవారు వివిధాద్భుతార్థములతో 17 పద్యముల వ్యాఖ్యానము రచించినారు. పద్యములు- 30 నుండి 47 సీతారామము.

పోతన, గోపన్న, త్యాగయ్య.

మ. కవియున్ భక్తుఁడుగాయకుండు నగు త్యాగయ్యన్ మహాసిద్ధునిన్
గవినిన్ భక్తుని నిత్యసత్య పదవీకాంతాపరున్ బోతనన్
గవియో భక్తుఁడో సిద్ధుఁడో రఘువరుం గన్నట్టి గోపన్ననున్
స్తవమున్ సల్పుచు మ్రొక్కెదన్ సతమునన్ శాసించిదీవింపఁగన్.(26)

పోతన, గోపన, త్యాగయ్యలు ముప్వురు రామ భక్తులే–పోతనపై ఆచార్యులు గారికి పరమ భక్తి. రామ భక్తులలోనే గాక – పోతన్నను కవిస్తుతిలో గూడ పేర్కొన్నారు.

నన్నయ తిక్కనాది కవినాథులకుం బ్రణమిల్లి భక్తిఁబో
తన్నకు మ్రొక్కితక్కుగల ఆంధ్రమహా కవిశేఖరాళికిన్
మన్ననఁదెల్పి సంస్కృతమునన్ రఘురాముని గాథ వ్రాసివి
ద్వన్నుతి గన్న సత్కవులఁ బ్రార్థనసేసెద మంగళార్థినై. 28

పోతన భాగవతము నుండి,(ప్రథమస్కందము 96-97)"హరినామస్తుతి "అన్న పద్యమును" "అపశబ్దంబుల గూడియున్" అన్నపద్యమును ఆచార్యుల వారు, సీతారామమున పాదుకా పట్టాభిషేకమున, రక్షకరాముడు ధార్మిక రాముడు–సుందరరాముదు, పట్టాభి రాముడు – అను సంపుటములలో తమ విజ్ఞప్తిలో ప్రకటించి పోతనయందు తమకుగల భక్తి ప్రపత్తులు దెలుపు కొన్నారు.

శ్రీరామభక్తిని యావదాంధ్ర దేశమున సుస్థిరముగా ప్రతిష్ఠించిన గోపన్నను త్యాగయ్యను – పోతనతో గూడ సీతారామమున నిట్లు స్తుతించినారు.

ధ్యాన గానామృతమ యుండు త్యాగరాజు
పున్నెముల ప్రోవుకవిరాజు పోతరాజు
పాపరహితుండు భక్తుండు గోపరాజు.
విడున కేవేళనన్ను దీవింత్రుగాక. అవ 14

తెలుగున కావ్యావతారికలో, కవిస్తుతితో గూడ, భక్తులను – స్తుతించెడి సంప్రదాయము పూర్వకావ్యములలో నియతము

గాకన్పట్టదు — ఏ నలుగురైదుగురు కవులు మాత్రమే -
పౌరాణిక భక్తులగు భాగవతులను పేర్కొన్నారు -

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాని
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి"

ఆచార్యుల వారు పై భక్తస్తుతి సంప్రదాయమును తిరిగి కావ్యముఖమున నుజ్జీవింప జేయుట ప్రశంస్యము. అందున నామువ్వురు తెలుగువారై నేటికిని నిత్యజీవితమునందు మనకు స్మరణీయులగుట - కావ్యమునందు వారు ప్రస్తుతులగుట మరియు నభినంద్యము.

పోతన భాగవతపద్యముల నన్ని భాగముల విజ్ఞప్తులలో నుదాహరించినట్లు, త్యాగయ్య గోపనలను కావ్యమధ్యమున మనకు దర్శింపజేసినారు.

**త్యాగయ్య**

భక్తివైరాగ్యముల జ్ఞానపరిణతి గని
సరససాహిత్య సంగీత సకలగతుల
నిమ్నుదనియించి నీ కృపనేవహింప
త్యాగరాజునుగానుగా దశరథసుత

పాదుకాపట్టాభిషేకము మాయాశ్వాసము ఆశ్వాసాంతము 263

పై పద్యమున నాచార్యులవారు త్యాగరాజు భాగవత వ్యక్తిత్వము నెంతో గంభీరముగా నిర్వచించినారు. త్యాగరాజు భక్తిచేతనేగాక, వైరాగ్యముచేత, జ్ఞానముచేత పరిణతి, అనగా సిద్ధిని బొందిన మహనీయుడు—

తొంబదియాఱుకోట్లమారులు, రామనామజపము చేసిన భక్తశిరోమణి ఇట్లు తొంబదియాఱుకోట్లు రామనామజపముచేయుట యందొక మహాంతరార్థమిమిడియున్నది. "మనశరీరమున రోమకూపములు తొంబదియాఱు కోట్లు"1 అనగా త్యాగరాజుదేహమంతయు రామ మయమని. రాముడు హృదయముననేగాక శరీరమంతటను వ్యాపించియున్నాడని యర్థము.

(ఫుట్ నోటు ప్రక్క పేజీలో)

త్యాగరాజు తన కీర్తనలలో నొకదానియందు రామనామ మాహాత్మ్యమునిట్లు విశదీకరించినాడు. రామనామము ఓం నమో నారాయణాయ ఓం నమశ్శివాయ అను రెండుమంత్రముల సంపుటి, ఓంనమోనారాయణాయ అను మంత్రమున-రా

ఓం నమశ్శివాయ మంత్రమున......... మ కలిపి రామ అయినది. పై రెండు మంత్రములలో, రా, మ అను రెండక్షరములు కీలకములు. ఆ యక్షరములు లేనిచో, నవి మంత్రములుకావు. ఇంతటి మహాజ్ఞాని త్యాగరాజు.

## గోపన్న

గోపన్న యనగానే మనకు భద్రాచలరాముడు ప్రత్యక్షమగుచుండును. గోపన్న ఆపాద మస్తకము రామభక్తిస్వరూపమే. ఆచార్యులవారు తమ రామాయణమును నాగోపన్న యిష్టదైవము భద్రాచలరామునికే అంకిత మిచ్చినారు. ఈ విషయ మీవలకే తెలిపితిని. ఆచార్యులవారు భద్రాచల రాముని కంకితమిచ్చుటయేగాక, భక్తిరసబంధురమగు గోపన. దాశరథీ శతక పాదము నొకపట్టున నుదహరించినారు.

"ఆరయనౌనె నీమహిమలన్యుల కేరికిగాని భక్తులౌ
వారలుమాత్రమే కనెడివారలు నీదగు దివ్యశక్తిన
వ్వారలఁద్రోచు దీవెపుడపారకృపార సమూర్తి వౌచునో,
"తారకనామ, భద్రగిరి దాశరథీ కరుణా పయోనిధీ"1
రక్షకరాముడు వాత్సల్యాశ్వాసము ఆశ్వాసాంతము— 159

---

(ప్రక్క పేజీ తరువాయి ఫుట్ నోటు)

1. మనశరీరమునందలి రోమకూపములు తొంబదియారుకోట్లని రాజ యోగామృత ప్రకాశిక, అనుగ్రంథము తెలుపుచున్నది. ఇది యముద్రితము. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందున్నది. ఈ గ్రంథములో మానవశరీర నిర్మాణమును గూర్చి యత్యద్భుత విషయములున్నవి.

1. భద్రాచలరామదాసు దాశరథీ శతకమునుండి పద్యములు నిత్యము పఠించువారు నేడును నున్నారు. ఆంధ్రశతకవాఙ్మయమున నొక ప్రత్యేక విశిష్టత గడించినదీ శతకరాజము.

భద్రాచలరామదాసు గోపన్నను త్యాగరాజు 'క్షీరసాగరశయన' అను కీర్తనలో స్మరించి యున్నాడు. త్యాగరాజు నాదోపాసనచే బ్రహ్మా నందమయుడుకాగా గోపన భక్తికైంకర్యముచే, బొందితోగూడ కైలాసమున కేగినాడు.[1]

తెలుగున భద్రాచలరామ వాఙ్మయమున కాద్యుడు గోపన్నయే. ఎంతమందియో కవులు భద్రాచలరాముని యిష్టదైవముగా నుపాసించి తమ కృతులనారామునకు సంకితమిచ్చినారు. ఈ "భద్రాచల రామ వాఙ్మయము" ను గూర్చి ప్రత్యేకపరిశోధన జరిగిన, గోపన్న భక్తిమహిమయింకను ప్రకాశమానము కాగలదు.

## గురుస్తుతి - గాంధీమహాత్ముడు

తెలుగుభాషలోముఖ్యముగాస్వాతంత్ర్యావతరణమునుండి, భారతపిత యైన గాంధిమహాత్మునిగూర్చి యొకసాహిత్యము వెలువడినది. అయినను నెచ్చటను గాంధీమహాత్ముని తమ గురువుగా స్తుతింపలేదు.[2] గోవిందాచార్యుల వారిట్లు గురుస్తుతి యొనరించినారు.

గీ॥ రామభక్తుండు సత్యపరాక్రముండు
ధార్మికుఁడుగాని సంతత ధార్మికుండు
భారతీయ స్వరాజ్య సంపాదకుండు
గాంధిగురునెంచి మోడ్చెద గరయుగమ్ము (27)

ఆచార్యులవారు గాంధీమహాత్మునికి తగినశిష్యులని యనిపించు కొన్నారు. ఇది భారతస్వాతంత్ర్య సమరచరిత్రయందువిదితము. గాంధీమహాత్ముడు రామభక్తుఁడగుటయేగాక, రామరాజ్యము మనకు ప్రసాదించినాడు.

---

1. ఇది చరిత్రలకెక్కినది. చూడుడు క్రీ. శే. కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగము.

2. 1969 అక్టోబరు 2 తేదీని జరిగిన గాంధీ శతజయంత్యుత్సవ సందర్భమున నేను, ఆధునిక కావ్యజగత్తులో గాంధిసాహిత్యము అను గ్రంథమును వ్రాసితిని. అది యముద్రితము అందు నేను గాంధీ మహాత్మునిగూర్చి వెలువడిన పద్యపద్యవాఙ్మయముసంతను పరిశీలించి, చేసినపరిశ్రమ వివరింపబడినది. శ్రీగోవిందాచార్యులవారి ప్రశంస అందుగలదు.

శ్రీరామునివలె, మహాత్ముడును విశ్వశాంతి కల్యాణములకొఱకు జన్మించిన అవతారపురుషుడు.

**అంకితము**

ఇతర మహాకావ్యములకన్న యిందు, అంకితముగూడ నొకనూతన పద్ధతి ననుసరించియున్నది. ఆ కావ్యములో "అంకితము" కావ్యాదిని అవతారికలోనే యుండును ఇందట్లుగాక, ఆచార్యులవారంకితము కావ్యాంతమున గావించినారు. ఈ కృతి భద్రాచల రామభద్రునికి కృతి. ఆ భద్రాచలవాసున కంకితమిచ్చుచు, ఆచార్యులవారు సమర్పించిన పద్యపుష్పాంజలి పరమ భక్తాగ్రగణ్యుడగు గోపన్నను మనకు జ్ఞప్తికి దెచ్చుచున్నది.

ఉ. నేచరితార్థతంగనుదునిక్కము, బాలపదాశ్రితుండనై
నోఁచిననోము పండుట ననున్ దరిఁజేర్చినదామె, "ఏక మే
వాచలనప్రధాన" మను నాత్మరచించితి, దీనిఁగొమ్ము భ
ద్రాచలరామ! భక్తవరదా! కరుణాకర జానకీవరా!

ఉ. నీ చిదచిన్మయత్వము మునిప్రకరానుభవైక వేద్యమై
లోచన దుర్నిరీక్ష్యము విలోకన యోగ్యగుణస్వరూపమే
యోచనఁజేయ జెల్లునను యోజనవ్రాసితిదీనిఁగొమ్ము భ
ద్రాచలరామ! భక్తవరదా! కరుణాకర జానకీవరా

ఉ. దాచినవాఁడగాను ధనధాన్యములన్ గుడిగోపురంబులన్
యాచనఁజేసికట్టుపలఁపైనమగల్గినవాడగాను భా
వాచితోస్మరించు హృదయంబున వ్రాసితి దీనిఁగొమ్ము భ
ద్రాచలరామ! భక్తవరదా! కరుణాకర జానకీవరా!

ఉ. ఆ చలిబాధకోర్చి, భరతావనిఁ బుణ్యనదీనదంబులన్
జూచిమునింగి తీర్థవిధిఁజొచ్చియు నిశ్చలశాంతిలేమిచే
బ్రోచెడివాడ వీవయను బుద్ధిరచించితి దీనిఁగొమ్ము భ
ద్రాచలరామ భక్తవరదా! కరుణాకర జానకీవరా!

ఉ. నీ చరణాంబుజోద్భవవినిర్మలమౌ మధువెల్లఁ గ్రోలి క
ర్మాచరణోద్గత శ్రమలనల్లనఁబాయఁగఁ జేసికొంచు స
ద్వాచక తావకీనకృతి వ్రాసితి దీని గ్రహింపుమీవ భ
ద్రాచలరామ! భక్తవరదా! కరుణాకర జానకీవరా!

ఏకప్రాసగలిగి మకుటముగల యీ పద్యపంచకముతో కృతిపతియగు భద్రాచలరాముని బంగారుమకుటముచే నలంకరించి యా వెనుక.

ఉ. అత్తినబత్తిదోడవిన యమ్ముగ నాకవితాసుమమ్ము నీ
మెత్తనిపాదయుగ్మము సమీపమునందిడి పూజసేసితిన్
జిత్తమునందుఁ జేర్పుము విశేషముగానిఁకఁగానుకల్ మఱే
మిత్తును సర్వమిచ్చితి, నిదే శరణంటిని జానకీవరా!

అని అంకితమిచ్చినారు. ఇందాఱు పద్యములున్నవి. ఆఱు తారక మంత్రసంఖ్య మంత్రముచే మంత్రాధిదైవతమున కంకితమగుటచేత నీ కావ్యము సద్యరూపమున మహాఫలప్రదమైయున్నది.

## అంకితము - సార్థక్యము

కావ్యరచనలో ఆచార్యులవారి కవితాదృష్టి లౌకికముగాదు. అది ఆధ్యాత్మికము. అందువలననే వారు కేవలము లౌకికానందమును ప్రతిపాదించు—పెద్దన

"నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చుక
ప్పురవిడెమాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పొరయురసజ్ఞులూహ దెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినగాని యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే"

ఈ పద్యమునకు సూటిగా పోతుతగులునట్లాచార్యుల వారిట్లు సమాధానము చెప్పినారు.

"ఊయెలమంచమున్ రమణియున్ విడెమిచ్చుటయున్ రసజ్ఞుడున్
హాయిగమందమారుత మనంతముగాఁ బ్రసరించు సౌధమున్

ప్రాయమునేల యొక్క-గుణరామ పదద్వయ భక్తిగల్గుచో
వ్రాయఁగఁజాలమే సుజనరంజనముల్ రసవత్ప్రబంధముల్.[1]

పెద్దనది లౌకిక 'రామ' తత్పరత – ఆచార్యులవారిది ఆధ్యాత్మిక 'రామ' భక్తిరసతత్పరత.

## కవితాదర్శము

"కావ్యరచనమున 1. ఔచితి 2. రసము 3. పాకము 4. నూతనవిషయ పరిశోధన యీ నాలుగువిషయములు నాలత్యములు" అని ఆచార్యులవారు సీతారామమున "మనవి" చేసినారు.

## 1. ఔచితి

ఔచిత్యము కావ్యగుణములలో నొకటి. పౌరాణిక కథలు కావ్యరూపమున వెలయునప్పుడు కావ్యము రసాత్మకము కావున, పురాణములనుండి గ్రహించిన యితివృత్తములలో కథాసందర్భములను రసానుగుణ్యముగా మార్పుగావించి యా కథలను హృదయాహ్లాదరకముగా రచించుటయే యౌచిత్యము[1] తెలుగున నన్నయ భట్టారకాదికవులు తమభారతానువాదము నౌచిత్య

---

1. ఈ పద్యము పెద్దన స్వంతముగాదు. కన్నడమున సూక్తిసుధార్ణవమున నున్నదానిని పెద్దన యనుసరించినాడు. ఆకృతి పెద్దనకన్న మూడువందలయేండ్లు ముందుది, కన్నడపద్యమిది.
నిరుపహతి స్థలం మృదుతరాసన మెళ్ళుణి సింపుదంబులం
నరసిద పుస్తకప్రతతిలేఖ కవాచక సంగ్రహం నిరం
తరగృహనిశ్చతస్థితి విచారకసంగతి సత్కశ్రసా
దరతయు నుళ్లసత్కవియు మీసువదాగదె కావ్యవార్థియుం"
కన్నడమున ప్రాసయేగాని యతియుండదు. పెద్దన కన్నడ పద్యమునకు యతి పెట్టిసప్రాసల్లేయుంచి తనస్వంతముగా చేసికొన్నాడు. చూడుము నా ఆంధ్రకర్ణాట సారస్వతములు, పరస్పర ప్రభావము (పుట. 132)
2. సంస్కృతభాషలో క్షేమేంద్రుడు "ఔచిత్యవిచారచర్చ" అను ప్రత్యేకగ్రంథమే, వ్రాసియున్నాడు.

మును పాటించి రచనలో మార్పుచేసినారు. ఆచార్యులవారును, రామాయణమున నట్టి ఔచితీ సంపాదకరచన గావించినారు. అట్టివానినొకటి రెండు మాత్రమే యుదాహరించు చున్నాను.

రక్షకరాముఁడు; కాకాసురశరణాగతి ఘట్టమున మూలమున కాకాసురుడు సీత స్తనమును గీరినట్టుండగా ఆచార్యులవారు. "ఉద్దండగతిన్ దటాలుమని ధాత్రిజపాదములంటి కాకిగాబుండుగ ముక్కుతో బొడిచె" అని ఔచితిని పాటించి వ్రాసినారు.

ధార్మికరాముఁడు హనుమంతుని ప్రవేశమున మూలమున భిక్షుకుడని యుండగా, ఆచార్యులవారు బ్రహ్మచారిగా నిరూపించినారు. ఇదియౌచితీ సంపాదకము. "బ్రాహ్మణోనహంతవ్య" అని కలదుగదా.

స్థాలీపులాకన్యాయమున జూపితిని. ఇట్టి పట్టులెన్నో యిందుగలవు. ఈ కావ్యమంతయు నౌచితికాలంబనమే.

## 2. రసము

కావ్యజీవితము రసమని యాలంకారికసూక్తి ఆదికావ్యమైన రామాయణమున నాలంకారికులు నిస్వచించిన నవరసములేకాక పండ్రెండు రసములున్నట్లు ఆచార్యులవారు ఉత్తరరామచరితమున హనుమంతుడు శ్రీరాముని స్తుతించిన సందర్భమున తెలిపినారు.

**అద్భుతము**

సీ. జనకధాత్రీజాని సభ రుద్రధనువె త్తి
        త్రుంచినమేటి యద్భుతరసంబు

**శృంగారము**

కమనీయవసుమకతీన్యకామృదుపాణి
        గ్రహియించి తన్పుశృంగారసము

**కరుణము**

రాజ్యభోగము వీడి రమణితో వని కేఁగఁ
గల్గిననాటి యా కరుణరసము

**రౌద్రము**

ఖరదూషణాది రాక్షసవర్గసంహార
రణరంగ విస్ఫుట రౌద్రరసము

**భక్తి**

మునిబృందములఁ జేరి మ్రొక్కుచున వ్వారి
భద్రంబె యెంచు సద్భక్తిరసము

**హాస్యము**

రహిమించి మోహించి రాక్షసాంగన రాగ
అలనాడు చూసిన హాస్యరసము

**స్నేహము**

స్రుక్కించి వాలిని సుగ్రీవుదరి జేర్చి
నెఱపిన సుఖకర స్నేహరసము

**శాంతము**

జగదేకరాజవై జలధియొడ్డున దర్భ
శయనంబుఁబూనిన శాంతరసము

**వీరము**

భయదగంభీరోగ్ర వారాసినింకింప
విల్లెత్తి పట్టిన వీరరసము

**బీభత్సము**

కాలానల సదృక్షమూల బలాశేష
పాటవస్ఫురిత బీభత్సరసము

### భయానకము

> దళకంఠ కంఠవిదారణా యోధన
> ప్రకటితోద్ధత భయానకరసంబు

### వాత్సల్యము

> భవదీయ పాదసేవారక్తుడైనకీ
> శ[?]ప్రాత్యునెడల వాత్సల్యరసము

గీ. నీవకాకమరెవ్వరు నెఱపగలరు
సర్వరసధామ! జగదేక సార్వభౌమ!
సత్కళామూర్తి శ్రీరామచంద్రమూర్తి!
అఖిలపద నిత్యవర్తితుభ్యం నమోస్తు! 1–106

ఇందు శ్రీరాముడు సర్వరసధాముడుగా వర్ణించి, ఆచార్యులవారు శ్రీరామవిష్ణ్వంశను సూచించినారు.

దేవతలు శ్రీ మహావిష్ణువును స్తుతించు సందర్భమున కాళిదాసమహాకవి రఘువంశమున వ్రాసిన యీ క్రింది శ్లోకము పైరచనకు ప్రమాణము.

> "రసాంతరాణ్యేకరసం యథాదివ్యం పయోఽశ్నుతే
> దేశే దేశే గుణేష్వేవ మవస్థాస్త్వ మవిక్రియః"

రామాయణకథ ఆ యా కవులరచనలలో, వారివారి రసభావములచే రంజితమై, రసాంతరముల బొందుచున్నది.

### భక్తిరసము

పై రామాయణరసనిరూపణమున శృంగారాది నవరసములతో, భక్తి, వాత్సల్య, స్నేహరసములున్నవి. వీనిలో భక్తివాత్సల్యములను ప్రాచీనాలంకారికు లంగీకరింపలేదు. కాని, మహాద్వైతి, మహాభక్తుడనైన మధుసూదన సరస్వతి భక్తిరసాయనమున భక్తిని రసముగా ప్రతిపాదించినవెనుక నవీనాలంకారికు లంగీకరించిరి. ఇక నీ గోవిందరామాయణమున నాద్యంతములు, భక్తిరసప్రపూర్ణములు, ఆచార్యులవారి భక్తిరసము పునాదిపై తమ కావ్యసౌధము గట్టినారు.

గోవిందరామాయణమునకు "భక్తిరసము" జీవితము, ఈ రామాయణ కావ్యశరీరమునకు భక్తిప్రాణము.

గీ. "భక్తిరసము పునాదిగాఁ బ్రబలఁజేసి
కరుణరస కావ్యసౌధంబు గట్టువాఁడ
జానకీరామ లక్ష్మణుల్ దీనియందు
కాపురముఁ జేయుచుంద్రు స్వకర్మఁజిక్కి

అని ఉత్తర రామచరితమున (అవ. 9.)

గీ. కరుణరసవర్తి యీ మహాకావ్యమూర్తి
భవజలధి దాఁటుగతిఁజూప భక్తతతికి
భక్తిరసము పునాదిగాఁబాదుకొలిపి
కట్టెదఁబ్రవర్తి సౌధమీ కావ్యమందు.

అవ. 6.

గీ. భక్తిరసము ప్రధానమౌ ఫణితియిద్ది
రక్తిగట్టనొలెదొ సద్భక్తవరుల
సూక్తులె ప్రమాణమ్ములౌ ముక్తిగోరు
కవితయిఁదుండడగునె శృంగారగతులు. (అవ. 7.)

గీ. భక్తిరసము పునాదిగాఁబాదుకొలిపి
కట్టెదఁబ్రవర్తి సౌధమీ కావ్యమందు
నవనవోన్మేష రసముల నారతంబు
నారగించుచు నిందుఁతుమయ్య రామ!

అని పాదుకాపట్టాభిషేకమున (అవ. 16.)

గీ. భక్తిరస ఝురీదివ్య ప్రవాహగతినిఁ
దెనుగునిడికారవుందీపి తేలియాడఁ
దేటతెల్లంపుఁబలుకులదిద్ది దీర్చి
యీ యరణ్యకాండము వ్రాయఁజేయుమమ్మ.

అని 'రక్షకరాముడు' లోను (అవ. 4.)

"వ్రాసి, వనీనివాన కథభక్తిరస ప్రథితంబుగా భర
న్యాసగతిం బ్రపత్తిని మనంబిడి" (అవ. 9.)

అని ధార్మికరాముడు లోను-

క. మునువ్రాసిన రీతిగని
పును భక్తిరసంబు దనరఁబూర్ణంబుగఁజా
వని పావనసీతారా
ముని కథవ్రాయింపుదేవి మ్రొక్కెద నీకున్. (అవ. 9.)

అని సుందరరాముఁడు లోను. భక్తిరసమునే యుద్ఘాటించి, పట్టాభి రాముఁడులో

"భక్తతతిదీవన లొసంగ"
"భక్తుఁగాపాడెడి భక్తవత్సలుడు"

అని మొదలిడి రామభక్తుఁడు, భక్త భక్తుడునైన ఆంజనేయు నుతించిః
"భక్త భక్తుండనై దీనివ్రాయువాడ"

అని యీ మహాకావ్యమును ఆచార్యులవారు సంపూర్తి జేసినారు.

2. గోవిందరామాయణము భక్తిరసమునకు భాష్యము.

1. ఇందు శ్రీరామపట్టాభిషేకముతోబాటు
భక్తిరసమునకు పట్టాభిషేకము.

భక్తిరసైక కావ్యములలో శృంగారరసమునకు స్థానములేదు. ఆచార్యులవారీవిషయమునే

"ముక్తిగోరుకవిత యిందుండదగునె శృంగారగతులు"

అని వ్యక్తపరచినారు. ఈ సందర్భమున వారికి వరవడి పోతనభాగవతమే. అయితే భాగవతము భక్తి ప్రధానమై భక్తిసూత్రములకు వ్యాఖ్యానమైనను, అందు శ్రీకృష్ణగోపికా శృంగారవర్ణనమున్నదీ గదా, సమన్వయమెట్లని సాహిత్యవిమర్శకులకు సందేహము గలుగవచ్చును. అట్టి సందేహమున కీషన్మాత్ర మాస్కారములేదు. భాగవతమునందలి శృంగార మలౌకికము.

ఆధ్యాత్మికము, లీలామానుష విగ్రహుండగు శ్రీకృష్ణుని యోగమాయా విలాసమేగాని వేఱుకాదు. భాగవతమునందు భక్తిశృంగారముల కాధ్యాత్మిక సంబంధమిట్లు పోతనయే వివరించినాడు. షోడశస్త్రీసహస్ర సంగతుడైన శ్రీకృష్ణునిజూచి నారదుడు,

ఆ. పరమభాగవతుడు పరమేష్ఠితనయుండు
మనుజలీలఁజెంది మహితసౌఖ్య
చిత్తుడైన యాహృషీకేశు యోగమా
యా ప్రభావమునకు నాత్మనలరి. (దశ. ఉ. 625)

క. నీమాయఁదెలియు వారలె
తామరసానన సురేంద్రతాపసులైనన్
ధీమంతులు నీ భక్తిను
ధామాధుర్యమున బొదలు ధన్యులుదక్కన్. (దశ. ఉ. 627)

అని హర్షించినాడు. భగవంతుని యోగమాయా శృంగారచర్యలు భక్తులుతక్క తక్కినవారు గ్రహింపలేరు.

ఆచార్యులవారు బహుగంభీరమగు వైభాగమునగల భక్తిశృంగార సంబంధము సంపూర్ణముగా నాకళించుకొన్నారు.

భాగవతము పురాణము. అందామూలాగ్రముగా భగవద్భక్తి ప్రపంచితమైనది. గ్రంథమంతయు నాధాత్మికమే. కావున నందు శృంగారమున్నను నది యాధ్యాత్మికమే. ఈ కారణముచే నందాధ్యాత్మిక శృంగారమునకు తప్ప లౌకికమైన కావ్యశృంగారమునకు ప్రవేశములేదు.

రామాయణము, భాగవతమువలె పురాణముకాదు అది లౌకికమైన కావ్యము. సాహిత్యదృష్ట్యా అది జగదాదిమకావ్యము. కావ్యమున శృంగార రసముప్రధానముగాన యందలిశృంగారము లౌకికము. ఆలంకారికులు రసరాజముగా నిరూపించినది లౌకికమగు శృంగారరసమగుటచేతను నది కావ్యజీవితమగుటచేతను, కావ్యములలో శృంగారరసము వర్ణింపకతప్పదు. రామాయణమున శృంగారాది నవరసములున్నవని యాచార్యులవారు నిరూపించి, అందొక ఘట్టమును మాత్రమే చూపినారు.

మఱి కొన్నిపట్టులశృంగారము చూపవచ్చును. అవకాశమున్నది. కాని ఆచార్యులవారి యాశయమదికాదు. రామాయణమేకైకముగా, భక్తిరసముతో ననుసంధానముచేసి, లౌకికమగు నాకావ్యము నాధ్యాత్మికముచే ప్రతిపాదకముగా ప్రపంచించుటయే వారిధ్యేయము. అందువలన కావ్యమంతయు నాధ్యాత్మికమైనపుడు లౌకికమైన కావ్యరసశృంగారమున కందాస్కారమే లేదు. ఇంత గంభీరసూక్ష్మదృష్టితో శృంగారరసతత్వము పరీక్షించినవారగుటచేతనే ఆచార్యులవారు.

ముక్తిగోరుకవితయందుండఁదగునె

శృంగారగతులు – అని నిర్ణయించినారు లౌకికకావ్యరసానందమును, ఆధ్యాత్మిక భక్తిరసానందముగా పరిభవింపజేసి, గోవిందరామాయణమున కొక ప్రత్యేకవిశిష్టతను వారు సమకూర్చినారు.

## 3. పాకము

భక్తిరసము ప్రపంచించుట కనువగు పాకము ద్రాక్షాపాకమని ఆచార్యులవారి తీర్పు. సీతారామమున

క. ద్రాక్షాపాకము నెక్కొన
దీక్షనుఁగృప సేయుమమ్మ దేవీ" (అ. వ. ౮.)

అని తన కుపాస్యదైవమగు బాలాత్రిపురసుందరిని ప్రార్థించినారు వారే.

"ద్రాక్షరసమ్ముగ ముసిఁగి" అని పాదుకాపట్టాభిషేకమున (అవ. 6) అందే" లోకారాధ్యంబగు నీ పురాణకథ ద్రాక్షాపాకమై యొప్పఁగన్" అని వ్రాసినారు (అవ. 17)

"ఎన్నెద ద్రాక్షాపాకం
బన్ని యెడలఁదీసఁగూడసంబా యుసవే"

అని రఘుకరాముడు అవ. 6 పద్యములలోను తెలిపి ద్రాక్షాపాకము, తమకావ్యమున నేకైకపాకముగా నిర్వహించినారు. "శ్రీనిధియై యనాది

చిదచిత్సద సన్మయమాతృదేవియై "అనుకుత్తరరామచరిత్ర ప్రారంభపద్యము మొదలు, పట్టాభిరాముడను యుద్ధకాండచివర" మంగళము భక్తులకు మంగళము శ్రోతల కుమాపతికి మంగళమహాశ్రీ" అన్నంతవఱకు నీ గోవిందరామాయణమంతయు ద్రాక్షాపాకమున కేకైకలక్ష్యము.

విశ్వవిఖ్యాత విమర్శకులు కే. శే. వేలూరి శివరామశాస్త్రిగారు "ఈ గోవిందరామాయణం చదివినతరువాత పానకం అక్కఱలేదు అని తమ యభిప్రాయము తెలివినారు. ఆచార్యులుగారును, "గడగడ నిఱుపానకము గైకొని త్రావునటుల్ రచింతు అని పాదుకాపట్టాభిషేకము అవ. 15 లో చెప్పినారు. ఇది స్తవముగాదు వాస్తవమే ఇచటపాకము. పానయోగ్యమై పానకమైనది. పానశబ్దమునకు 'కప్రత్యయము' చేర్చిన పానము పానకమగును. పానకము శ్రీమహావిష్ణువు నివేదనములో నొకటి[1] ఇందువలన భక్తిరసముచేతనేగాక పాకముచేతను నీ కావ్యము భగవదర్పితమైనది.

## పాషాణపాకము

అర్థరసభావములను వివరించు విధానమే పాకము అందు ద్రాక్షాకదళీ, నారికేళపాకములను మూడుభేదములుగలవు. దానిలో సరళమై, సులభసుందరమై, ఆబాలగోపాలమున కాస్వాదనీయమైనది ద్రాక్షాపాకము. ఈ మూడింటిలో నారికేళపాకము, పండితాఖండలులకేగాని తక్కినవారి కందదు ఆచార్యులవారు వైమూడింటితోపాటు "పాషాణపాకము" అను నాల్గవపాకము గల్పించినారు. ఇది నారికేళపాకముపై మెట్టుకఠినాక్షర పదబంధమగుభాషతో సమాసజటిలమై విద్వత్కవులకుగూడ గ్రాహ్యముకానిరచన. దీనిని రక్షకరాముడు (ఆరణ్యకాండమున) బహుసరసముగా నిబద్ధించియున్నారు.

ఆ. వె. వలదుకఠినభాష పాషాణపాకంబు
రాళ్లరప్పలంజనురాచవారు

1. మంగళగిరియందు వేంచేసియున్న నృసింహస్వామికి (విష్ణువు చతుర్థావతారము) ముఖ్యనివేదనము పానకమే "మంగళగిరి పానకాలరాయడు" అని యాదేవుని వాడుక నామము. పానకాలు పానకాలరాయడు అను పేరుగల వారు మనలోనున్నారు.

పాదయుగళిబొందు పాషాణబాధనే
కర్ణయుగముగూడ గాంచనేల? (అవ. ౫)

ఇందును, ఆచార్యులవారి భక్తిరస భావనము హృదయమునకు హత్తుకొనుచున్నది. ఆచార్యులవారుమహాభక్తులు వారు, తాము భక్తిప్రపత్తులు చూపుదైవమునకు నేమాత్రమాయాసముగాని, క్లేశముగాని కనిపించు సందర్భమును సహింపలేరు. వారు వ్రాయబోవుకాండ అరణ్యకాండ. అరణ్యము కఠినమగు శిలలచే, కంటకములచే, చిన్నచిన్న రాళ్లరప్పలచే గమనము కడు కష్టముగలిగించును. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై యరణ్యముల సంచరింప వలయును. పుట్టుభోగులు, పూలబాటలపై నడచెడి సుకుమారులు కౌమారవయస్కులునగు రామలక్ష్మణులు వారికన్న సుకుమారియై అసూర్యంపశ్యయైనసీతయు, కఠినశిలాఘటితమైన దుర్గమారణ్యమున నడకలో కడు కడగండ్లుబడియుందురు. వారి కెట్లయిన వనవాసము తప్పదు గావున నీ గమన క్లేశము తప్పదు. ఆనాడు వారికరణ్యగమనమువలన గలిగిన బాధను, ఆచార్యులవారికిముందు రామాయణకవులా ఘట్టమున కొంతవరకు పాషాణపాకమునే యవలంబించి మన కర్ణములకు కటుత్వము నాపాదించినారు. చూడుడు భాస్కరరామాయణము అరణ్యకాండము.

క. కాకోలవ్యాకులమును
ఘూకాకుల భీకరంబు ఘోరమృగవ్యా
ళాకరమును ఝల్లీనిన
దాకర్ణనదుస్సహంబునగు పేరడవిన్. ౯. ప.

శా. రక్షశ్శిక్షణదక్ష రామవిశిఖ వ్రాతంబులో విభవ
త్ప్రక్షాపేక్షసమక్ష రాక్షస జలాధ్యక్షేక్షయక్రవ్యముల్
పక్షిక్షుద్గత రూక్షవక్త్రములకున్ భక్షింపవే పెట్టి నీ
దక్షప్రక్షిప దక్షి కుక్షిగళదోదర్పంబు చెండాడిన్. (2-175)

"ఆనాడువారు పాదములందు పొందిన బాధను, తిరిగి-దానినట్లనే వర్ణించి, కర్ణములకుగూడ బాధకల్గించుట, "ఎందుకయ్యా" అనిఅచార్యులవారు బాధపడి యీ యరణ్య కాండమున నంతయు తక్కినవానివలె, ద్రాక్షాపాక

ముతో మృదుపదజాలముతో రచించి కర్ణపేశలము కావించినారు. ఈకాండ చదువుచున్నప్పుడు మనమరణ్యమున నున్నట్లే భావింపుము ఒకసుందరోద్యానమునను న్నట్లుభావింతుము. అది ఆగార్యులవారి కవితాశక్తి[1] పాషాణములను ప్రసవములనుగామార్చును.

## రీతి

పూర్వాలంకారికులు చెప్పిన రీతినే నేడు మనము 'శైలి' యని వాడుచున్నాము. కాని యీ పదము సంస్కృతముగాదు ఇది **"style"** అనునాంగ్లపదము నుండి తెనుగున వాడుకలోనికి వచ్చినది. రీతి యనగా పదబంధము. అది మూడు విధములు వైదర్భిగౌడి, పాంచాలి.

గోవిందరామాయణమున నున్నది

## వైదర్భి రీతి.

"బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా
నాతిదీర్ఘ సమాసాచ వైదర్భీరీతి రుచ్యతే"

కఠినము లేక. పరుషవర్ణ పదములు కానిది సరళమైన కూర్పుగలది, దీర్ఘసమాసములు లేనిది వైదర్భి.

ఈ మహాకావ్యమున పదివేల నాల్గుపందలకు పైగానున్న యిన్ని పద్యములలోను నెక్కడ చూచినను వైదర్భరీతియే స్ఫురించును. అసలిందు సమాసములే లేవు. తిక్కన చెప్పినట్లు" అలంతి యలంతి పదములంగా సాళసింధించిన రీతినిక్కైతచేతోమోదము" గూర్చికొనినది.

ఇందాది నుండి యంతమువఱకు సన్నిఘట్టములందును, నిట్టి మనోరమమైనరీతిని ధారాశుద్ధితో నీకావ్య మొప్పుచున్నది, ఆచార్యులవారి రచన

తేలికయని పేలవముగాదు
తెలుగని సంస్కృత సంపర్కములేక యుండదు
అనుకరణమున కలవియదు

1. పాషాణపాకము - కవి ప్రయుక్తమైన పదము.

ఆధునికయుగమున సర్వలక్షణసంపన్నమును సజీవమునగు తేటతెలుగు కవితకు ఆచార్యులవారాద్యులు, కడపటివారు.

## నూతనవిషయ పరిశోధన

గోవిందరామాయణము వాల్మీకి మూలమునేయనుసరించినను, నిందితర గ్రంథముల యందున్న రామాయణకథా విశేషములెన్నో సంతరింపబడి యున్నవి. ఇవియన్నియు నింతవఱకు తెలుగున నే రామాయణ కావ్యముల యందును లేవు. ఆచార్యులుగా రనేక రామాయణములనుపురాణములను, సంహితలను పరిశోధించి వానినిందు నిబంధించిరి. ఇవి యన్నియు మనకు క్రొత్తవి, కనివిని యెఱుగనివి కావుననే నూతన విషయపరిశోధనలనవలసి వచ్చినది.

ఇందా యాకాండములలో మూలానువాదములైన వాని నాయా సందర్భముల సర్గశ్లోక సంఖ్య వివరణము తీయబడినవి కొన్ని చూపు చున్నాను.

(1) వత్స రామ యనుచు" వైరులు నశియింత్రు
గాక " యనుచు, దీర్ఘ కాలజీవి"
వౌదుగాక యనుచు నాశీర్వదించెను
శ్రీసమేతుఁడౌచుఁ జెలఁగసుతుఁడు.

సీతారామము 1–61

మూలము: వత్సరామ! చిరంజీవ హతాస్తే పరిపంధినః

5వసర్గ. 38శ్లో

(2) సకలవిదుఁడ రాముశైలూషుని విధాన
యౌవనవతి భార్యనబలసతిని
ఎవనికప్పగించి యేగెదివడవిక్
వెంటగొనుము సీత వెంటనంటు

మూలము: స్వయంతు భార్యాకౌమారీం చిరమధ్యుషితాంసతీమ్
శైలూష ఇవమాంరామ వరేభ్యోదాతుమిచ్ఛసి

30వ సర్గం 8 శ్లో.

(3) "సీప్రసాదమును బొంద' దపించుచున్నవాఁడ; న
వ్వానిఁదలంతె అంగుళికివాడ సమానుడు యుద్ధమందునన్
మూలము: అంగుళ్యానసమో రామోమయయుద్దేసమామషః
తవభాగ్యేన సంప్రాప్తం భజాన్వవరవర్ణిని.

18 స. 19 శ్లో

కొన్నిపట్టుల మూలార్ధములు వివరింపబడినవి. మరికొన్ని సందర్భముల 3/11, 32/22, 92/8 అని మూలములు సూచింపబడినవి. వీనిలో పైసంఖ్య శ్లోకమును, క్రిందసంఖ్య సర్గమును తెలుపును.

మూలములోలేని క్రొత్తవిషయములను చేర్చినపుడు ఆచార్యులవారా యాస్థలములలోని యేయే గ్రంథముల నుండి గ్రహించిరో, దానిని పుట యడుగున తెలిపినారు. వాని వివరణ సీతారామమున.

(1) "రావణకుంభకర్ణులు పరాజయమొందెదరింద్ర! యశ్వినీదేవతలిర్వురున్
రావణకుంభకర్ణు లశ్వినీ దేవతలనియు, శాపవశమున రాక్షసులై రావణకుంభకర్ణులుగా జన్మించిరన్నకథ వశిష్ఠరామాయణము నుండి గ్రహింప బడినది.

(2) "నెలలునిండిన కౌసల్య నిద్రయందు
నప్పుడప్పుడు శ్రీనాథునాద్యుఁగాంచి"
అను కౌసల్య స్వప్నవృత్తాంతము భారద్వాజ రామాయణము నుండి సంగ్రహితము.

## శ్రీరాముని నర్మసూక్తులు-సీతారాముల ఛలోక్తులు

ఇందు 12 పద్యములలోనున్న నర్మసూక్తులు మూలమునలేవు. ఇవి యితర రామాయణములనుండి గ్రహింపబడి, బహుమనోహరములై యున్నవి. వనవాసగమన క్లేశము పరిహరించు వీనిలో కొన్ని యుదాహరించుచున్నాను.

(అ) సీత-శాతశిలామయకంట కావృతమైన దారిలో
మెట్టపల్లముల పాదములవేయుచు తడబడుచుండుట

చూచి, రాముడు, నీవట్లు నడచుచుండగా నేను
చూడలేను నీవు తూలిపడిపోవుదువు గాన
"పూనదగున్ మదీయభుజమున్ భవదీయకరాబ్జ మూతగా"
నీచేతితో
నా భుజమునూత చేసికొని నడువము" అని
రాముడామెతో చెప్పినాడు. (2-32)

ఇది దుర్వాసరామాయణము నుండి గ్రహింపబడినది.

(ఆ) సీతయరణ్యమున నడువలేక తడబడుచుండగా రాముడు భూదేవితో "ఏమమ్మా నీకుమార్తె తామరదళములకంటె మృదువైన పాదములు గలదిగదా. ఆమె కాలుమోపుటకైనా, నీకఠినత్వమువూని మెత్తగా నుండుమమ్మా" అని కోరినాడు.

ఇది హనుమద్రామయణమున గలదు, (2-34)

సీత ఛలోక్తులన్నియు హృదయంగమములు. "బహు కఠినమైన పాషాణము నుండి స్త్రీలుద్భవించునపుడు హలముచే దున్నినమాత్రాన స్త్రీలు పుట్టుటలో నాశ్చర్యమేమున్నది" అప్పుడు మాతల్లి తాను మృదువైనదనే నిరూపించినదిగదా. ఇక—

నాగేటితో దున్నినంతమాత్రాన నొకనారి యుద్భవించుట జరిగింది గదా పాయసము తిన్నంతమాత్రాన నొకపురుషుడుద్భవించునపుడు నాగేటి చాలులో నారులుద్భవించుటలో నాశ్చర్యమేమున్నది.

ఇది దేవీరామాయణము నుండి గ్రహింపబడినది.

స్థాలీపులాకన్యాయమున కొన్ని యుదాహరించితిని ఇంకనెన్నో యున్నవి పైనపేర్కొనిన-

(1) వసిష్ఠరామాయణము
(2) భారద్వాజరామాయణము
(3) దుర్వాసరామాయణము
(4) హనుమద్రామాయణము

(5) దేవీరామాయణము అనువాని నుండియేకాక

(6) శివరామాయణము

(7) యాజ్ఞవల్క్యరామాయణము

(8) ఆధ్యాత్మరామాయణము మున్నగు నితరరామాయణముల

నుండినూతన విషయములనేకము లిందాచార్యులవారుచేర్చినారు. మనమింతకు ముందు విచిత్ర ఆనంద. అద్భుత పట్టాభి రామాయణములను మాత్రమే యెఱుగుదుము. పై రామాయణములనుగూర్చి యేమాత్ర మెరుగము. ఇట్లు ఇతర రామాయణములేకాక, ఉమాసంహిత, పరాశరసంహిత, రామోపనిషత్తు, పద్మపురాణము మున్నగు బహుగ్రంథములను ఆచార్యులవారు పరిశోధించి వానిలోని కథలనిందుచేర్చుటచేతనే రామాయణమునకు నొకనూతనత్వమేర్పడి ప్రత్యేకత నాపాదించినది.

ఇది వారికవితారచనా పాటవమేగాక, పరిశోధనా పాటవమును ప్రకటించుచున్నది.

## మూలమునకు పెంపకము

ఇందు నూతనవిషయములేకాక, వ్యాఖ్యానములను నవలోకించి, మూలమునకు తెనుగున నొక మనోహరమైన వ్యాఖ్యాన కావ్యముగా నాచార్యులవారు దిద్దితీర్చినారు. వాల్మీకిహృదయగవేషణచేసిన పూర్వాచార్యుల రచనల సారమంతయు నాచార్యులవారావేశము పట్టుటచేత నీ రామాయణమింతలోకోత్తరమైనది. రెండు ఉదాహరణములుమాత్రమే చూపుచున్నాను. సీతాకల్యాణఘట్టము, సీతారామము

ఇయం సీతామమసుతాసహధర్మ చరీతవ
ప్రతీచ్ఛ చైనాంభద్రంతే పాణిగృహ్ణీష్వం పాణినా.

ఈ కల్యాణశ్లోకమున కాచార్యులుగా రెనిమిది పద్యములు, రచించి యష్టశోభనము గావించినారు.

"ఇది సుమసీత నాదుసుత యెన్నికగన్నది కన్నెలందునే
మిదితగు పేరుగా దనుచునెంతువో సీతకత్తానఁగాపునం

పదగనునట్లు కర్మఫలవంతుఁడ వౌదువునీవు సర్వదా
మదిఫలమెంచఁబోదు కృషిమాన్యయ యోనిజసీత నీకిలన్" 5-471

ఈ పద్యమైనవెనుక "పాణీగృహ్ణామి పాణినా" అను వాక్యమునకు, "గ్రహియింపుముఁబాణి పాణిచే" అను మకుటముతో నేడుపద్యములు రచించి నారు.

"పృథివినిఁబుట్టియుంటఁబృథివీతల సద్గుణ జాలమెల్లయీ
సుదతికి సంక్రమించెఁబరిశుద్ధసదాయపరాధమోర్చు భూ
తపయనుభూతధాత్రీయగుఁదల్లిని బోలు క్షమాంతరంగయి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁబాణిచే, 472

ఈ మకుటపద్యములన్నియు నుదహరింపదగినవే అయినను గ్రంథవిస్తర భీతి మదియొక్క పద్యముమాత్ర ముదాహరించుచున్నాను.

పదిలముచేసి పెంచిన విభాసుర దివ్యసువర్ణరేఖయే
విధమునగాని యెప్పుడను పీడక విద్యగణించినట్టికో
విదభవదీయ దాసిబుధవిశ్రుత మంగళమూర్తిసీత ఇ
య్యదియమదీయపుత్రి కసుమా గ్రహియింపుము పాణిపాణిచే. 473

ఇందేడుపద్యములను చంపకములే - ఒకే ప్రాసమకుటములు గలవి. "ఇయంసీతామమసుతా" అను శ్లోక ప్రథమపాదము "ఇది సుమసీత నాదు సుత" అని ప్రారంభమై "పాణిగృహ్ణామి పాణినా" అను నాల్గవపాదమున గల వాక్యమునకు "ఇయ్యదియమదీయ పుత్రిక సుమా గ్రహియింపుము. పాణి పాణిచే" అని ప్రతిపద్యముననేగాక చివరపద్యమున నుండుటచే, పై శ్లోకమున కిది వ్యాఖ్యపద్యవాఖ్యానమై యున్నది.

ఈ యేడుపద్యములును నన్వర్థములు. పాణిగ్రహణ సమయమున ముఖ్యమైనవి. సప్తపదులు త్రొక్కుట[1] అనుప్రక్రియ. దీనిని ద్యోతకముచేయు టకే ఆచార్యులుగారు, ఏడుపద్యములను వ్రాసి యీసప్తపది సంప్రదాయము కావ్యమున నిబంధించినారు.

1. సప్తపదులు త్రొక్కుట. అనువివాహ ప్రక్రియనుండియే తెనుగున "చరణంబు ద్రొక్కుట" "కాలు ద్రొక్కుట" అను జాతీయము లేర్పడినది. రెండింటికి పెండ్లియాడుట అనియే యర్థము.

లక్ష్మణునకు సుమిత్ర సెలవొసంగుట పాదుకాపట్టాభిషేకము.

"రామం దశరథం విద్ధిమాం విద్ధిజనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధిగచ్ఛతాత యథాసుఖమ్.

అయో. 40. స. 9. శ్లో.

ఈ శ్లోకము వివిధార్థములుగల ప్రసిద్ధశ్లోకము. ఆచార్యులవారీ యర్థములన్నింటిని, 7 పద్యములలో విపులముగా దెలిపియున్నారు.

చ. దశరథు డేగురుండనుచు దాశరథిన్ గమమీ వనీస్థలిన్
యశముఁదలంచి యెంచుముసుమా సనుఁబోలినమాత సీతఁగా
నశననివాస సౌఖ్యముల నావన మెంచుమయోధ్యగా సదా
భృశతపముండి గొల్వఁదగు జ్యేష్ఠుని లక్ష్మణ! పోయిరాఁదగున్.
5-506

గీ. దశరథుండు సోపాధికతాతయయ్యు
పుత్రులకుఁగష్టములఁగూర్చెపుత్ర! రామ
చంద్రుఁడు నిరుపాధికుఁడైన జనకుఁడయ్యుఁ
ప్రేమమైఁబ్రోచునతని సేవింపుమయ్య. 5-511

సోపాధికతాత = అతనికి జన్మించుటవలనతండ్రి నిరుపాధికము = అతనికి జన్మింపకపోయినను స్వాభావికమైన తండ్రి.

దశరథుఁడు — అను శబ్దము విష్ణుపరమైన యర్థములు చెప్పబడినవి.

దశ — పక్షి - రథుడు - వాహనముగలవాడు విష్ణువు

దశ - దేహము — రథుఁడు — ధరించినవాడు

దశ - పదిదేహములుధరించినవాడు; పది యవతారములనెత్తినవాడు విష్ణువు.

## గోవిందరామాయణము

### ఆధ్యాత్మిక విశిష్టత

"అందఱూ ఒక యెత్తు - అగస్త్యుడొక్కఁడు ఒక్కయెత్తు" అన్నట్లుగా, తెలుగుభాషలోనింతవఱకు వెలువడిన రామాయణము లొకయెత్తు

గోవిందరామాయణ మొకయెత్తు - అని ఘంటాపథముగా చెప్పవచ్చును. ఈ రామాయణమున కిట్టిమహత్తుగలుగుటకు, నిందలి యాధ్యాత్మికతయే హేతువు. ఈ కృతిలో రసమునుగూర్చి చర్చించునపుడు, భక్తిరసమిందు జీవనాడియగుటచే, నిది లౌకికావధినతిక్రమించి, యాధ్యాత్మికమై, యాంతరంగికానందము ప్రసాదించుచున్నదని వివరించియున్నాను.

## తారకమంత్రసిద్ధి

ఇష్టదేవతోపాసన, మంత్రజపము సర్వసిద్ధిప్రదమని ప్రత్యక్షముగా నిరూపణచేసినవారాచార్యులుగారే. [1]తాతయుపదేశింప రామతారకమంత్రమిరువదవయేటినుండి ఏబదేండ్లుగా నేకాగ్రనిష్టజపించినారు. మంత్రసిద్ధులైరి వారు సంకల్పించిన రామాయణము సంపూర్ణమైనది. తారకమంత్రాధిదైవమగు శ్రీరామునికే తమ రామాయణము నంకితమును, మంత్రాత్మకముగానే చేసియున్నారు.

"ఓం' కార ప్రభవమ్ము నీమహిమ సర్వోత్కృష్టమీ సృష్టిలో
'శ్రీం' కారుణ్యగుణాకరంబు సకల శ్రేయస్కరంబౌ సదా
'ఐం' కాలజ్ఞతఁగూర్చి జ్ఞానకరమై యాముష్మికంబిచ్చెడిన్
'రాం' కామ్యంబుల దీర్చిబ్రోచెడిని శ్రీరామాభవన్మంత్రమై"
కావ్యమందంతటను రామమంత్రము ప్రస్ఫుటీకరింపబడినది.

"రామాయనమో" అన్న మంత్రమడుగడుగున మన మనసునకు దట్టుచుండును. పాదుకాపట్టాభిషేకమున, ఆచార్యులుగారు 2310 పద్యములు వ్రాసి వాని మంత్రాత్మక సాంకేతికము నిట్లు వివరించినారు.

గీ. సలిపితి సహస్రనామార్చనలవినూత్న
పద్యపుష్పాలనినుమ్మారు పరమభక్తి
..................................
ఇనుమారుసహస్రనామార్చనలు. 2016

1. ఇరువదియేండ్ల ప్రాయముననే యుపదేశము తాతచేసెనీ
వరమహనీయ మంత్రము జపంబొనరించితినేఁబదేండ్లుగా.
పట్టాభిషేకాశ్వాసము 421 వ.

2. ఉత్తర రామచరితము పునస్సంయోగాశ్వాసము 114 ప.

"తొంబదియునాల్గు నిన్నూరు తోడగలిపి
పద్య సుమదక్షిణయు గూడవరలునిందు"

పద్యదక్షిణ 294

మొత్తముపద్యసంఖ్య 2310 = 2 + 3 + 1 = 6 తారకసంఖ్య— 2310
ఇట్లు పద్యసంఖ్యయేగాక - ఆశ్వాససంఖ్యయునారే.
"అమరెనాశ్వాసములు గూడ నారుగాగ
నేషడక్షరి శిరసావహించినాడ"

షడక్షరి - తారకమంత్రసంఖ్య - తరువాతి రామాయణ భాగముల నామములలోను పాటింపబడినది.

రక్షకరాముఁడు-
ధార్మికరాముఁడు-
సుందరరాముఁడు-
పట్టాభిరాముఁడు-

రక్షకరాముడు - ధార్మికరాముడు — ఈ రెండింటియందాశ్వాస సంఖ్యయునారే.

ఆరణ్యమున మునులు తారకమంత్రమున రాముని స్తుతించిరి.

ఓం రామాయనమోయను
రాం రామాయనమయనుచు రామాయనుఐం
రాం రామాయను ఐం శ్రీం
రాం రామాయనుముని తతి రాముంగనుచున్

రక్షకరాముడు - పరిత్రాణాశ్వాసము - 249
రామాయణమంతయు ఇట్లే తారకమంత్రాత్మకమై విరాజిల్లుచున్నది.
రామాయణము మంత్ర సంపుటీకరణ మగుటచేతనే.
"చరితమ్ రఘునాథస్యశతకోటి ప్రవిస్తరమ్
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్"

అని ప్రసిద్ధిగాంచినది. అందు సుందరకాండమున సప్తకోటి మహామంత్రములున్నవని ప్రాజ్ఞులవచనము. సుందరకాండవలె, పాదుకాపట్టాభిషేకము

(అయోధ్యాకాండ) రక్షకరాముడు (ఆరణ్యకాండము) నందును, మంత్ర సంపుటీకరణమే గలదని ఆచార్యులవారు నిరూపించినారు.

పాదుకాపట్టాభిషేకమున భరతుడు పాదుకలను ధ్యానించు సమయమున నవి శ్రీరాముని మంత్రాత్మక రూపములని యిట్లు తెలిపినారు—

కాదిహాదిసాది వేద్యవిద్యలరూపు
రామమూర్తిగాఁగ రాత్రిపవలు
పాదుకాద్వయి భరతుండు గనుచుండు
శాంతమూర్తిగ నగుచు నిశ్చలుఁడునగుచు.

పాదుకాశ్వాసము — 55

ఈ పద్యముక్రింద - కాదివిద్య, హాదివిద్య, సాదివిద్య ఈ మంత్ర విద్యల వివరణ మీయబడినది.

ఇంతకంటె దీనినిగూర్చి వ్రాయుటకు నాకధికారములేదు. పాదుకాంత దీక్షాపరులకు మాత్రమే పైవిద్యల వగాహనములు; అనుభవనీయములు. ఆచార్యులవారు, పై 'పాదుకాంతదీక్ష' యందలి సంప్రదాయార్థమును గ్రహించినవారగుటచే, పాదుకాపట్టాభిషేకముననే దీనిని నిర్వచించిరి. ఇది వారి మంత్రశాస్త్ర పారీణతకు పతాక.

రక్షకరాముడు (ఆరణ్యకాండలో) ఓంకారరూపులు, అడవిగమనము అను శీర్షికలో వారి మంత్ర శాస్త్రానుభవము విదితమగుచున్నది. అందు ప్రణవార్థము ప్రపంచింపబడినది.

సీతా రామ లక్ష్మణులు ముగ్గురు నరణ్యమున నడుచుచున్నారు. వారెట్లున్నారో దర్శింపుడు.

గీ. చిద చిదీశ్వరులొండొంటి జెంతఁబలుగు
చంద మొప్పు నా ముగ్గురు చనెడిరీతి
ప్రకృతి బద్ధ జీవితగ సీత, ప్రకృతి ముక్త
శుద్ధ జీవిగ సౌమిత్రి చొప్పువీర

లవ్యయుని వెంటఁబడుచుండి రనఁగ నొప్పు.

విమోచనాశ్వాసము 21.

ఈ పద్య సంఖ్య 21 యగుట సార్థకము. 2+1 = 3 దీని వివరణ.

ప్రకృతి బద్ధ జీవిత సీత
ప్రకృతి ముక్త జీవి లక్ష్మణుడునిరువు (2)
అవ్యయుఁడైన శ్రీరాముని వెంట— (1) = 3
నడచుచున్నారు శ్రీరాముడేకైక పరతత్త్వము. (ఏక మేవాద్వితీయము)

ఆ. వె. వారిపోకరీతి ప్రణవార్థసూచన
మగుచునుండె రాముఁడ గ్రమంద
కారవాచ్యుఁడును ను కారవాచ్యగ సీత
గాఁగ లక్ష్మణుఁడు మకారమూర్తి (29)

ప్రణవమనగా ఓంకారము – అందు, అ, ఉ, మ, అనునవి మూఁడు మాత్రలు.

— అకారము రాముఁడు
ఉకారము సీత
మకారము లక్ష్మణుడు.

ఇట్లు ఓంకారార్థము నిర్వచింపబడినది

గోవిందరామాయణము కేవలసాహిత్య దృష్టితో గాక, ఆధ్యాత్మిక దృష్టితో నెంతదీక్షగా పరిశీలింపవలెనో సూచనప్రాయముగా జూపితిని. మంత్రశాస్త్రవేత్తలకిది మహానిధానము.

ఇందువలన 'పట్టాభిరాముఁడు' అను పేరుగల యీ కాండమున యుద్ధమేకాక, పట్టాభిషేకముకూడ జరుగుటవలన "పట్టాభిరాముఁడు" అని పేరు సార్థకమైయున్నది.

## ఇష్టదేవతోపాసన

ఆచార్యులవారి ఇష్టదేవత బాలాత్రిపురసుందరి.

"శ్రీనిధియై యనాదిచిదచిత్సద సన్మయ మాతృదేవియై

భానుసహస్ర మండల విభాప్రతిభాసితమూర్తి గల్గియున్
జానగుమోము నన్మధుర శాంతమృదూక్తులఁబల్కు బాల నా
మానస మందునిల్చి యభిమానముతో సుకవిత్వమిచ్చుతన్"

అని తమయిష్టదేవతను బాలను స్తుతించుచు, నీ రామాయణము ప్రారంభించినారు. ఆ బాలా త్రిపురసుందరీ కృపాకటాక్షమున నీ మహా కావ్యము సంపూర్ణమైనది. వారి కవితా విద్యయంతయు బాలాప్రసాదమే. వారికంబయే గురువు.

"త్రిపురసుందరి! నీ పాదతీర్థమందె
యక్షరాభ్యాసముం జేసి యఖిలవిద్య
నభ్యసించితి నా విద్యయంత నీవె.
గురుఁడవాచార్యుఁడవు నీవెకూర్మిగనుము.

రక్షకరాముడు— 3.

ఆచార్యులవారి కవితావిద్యయంతయు అంబప్రసాదమే గావున నీ కృతిలో నన్ని కాండములయందు నైకైకముగా నామె స్తుతియే పెక్కు పద్యములలో గన్పట్టును. అన్నియు "శ్రీనిధి" యైన ఆన్న పైపద్యముతోనే ప్రారంభమై వారి యనుపమాన భక్తి ప్రపత్తులను దెలుపుచున్నవి.

సాహిత్యదృష్ట్యావిమర్శకులకిట్లు బాహ్యముగాగురుస్తుతిగా గన్పట్టి నను, ఆంతరంగికముగా, నిందు ఆధ్యాత్మికమైన గంభీరార్థమున్నది బాలా త్రిపురసుందరి పరదేవత. లలితాంబిక — శ్రీరామో లలితాంబికా అని సూక్తి. "శ్రీరాముడు ఉభయబ్రహ్మము అనగా పరదేవత. 'పరస్యామ్ దేవతా యామ్' లేక పరశివుడు లేకలలితాంబిక" శ్రీ బాలా త్రిపురసుందరీ స్వరూపమే శ్రీరామ స్వరూపమని, ఆచార్యులవారు పాదుకారాముని స్తుతించు సందర్భమున నిట్లు వ్యక్తముచేసియున్నారు.

సీ. సర్వోపనిషదర్థ సకలస్వరూపంబు
శ్రీనివాసంబుగాఁ జెలఁగు దీవ
భక్తశిరస్త్రాణ పరిధవశ్రీరాజ
రాజేశ్వరీమంత్రరాజమీవ

భువనైకమోహన మూర్తిశివంకర
త్రిపురసుందరి దివ్యతేజమీవ
మొదలు తుదయు లేకచదలకతీతమై
నిత్యమై యఖిలమౌ సత్యమీవ
గీ. పాదుకా రామభక్త సంప్రాప్యరామ
పాదుకారామ మౌనిహృద్వాసరామ
పాదుకారామ శ్రీరామ పరమరామ
పాహిమాం పాహిమాం పాహితుభ్యంనమోస్తు.

పాదుకాశ్వాసము 86.

కృతిపతి కృతికథానాయకుడు శ్రీరాముడే గావున ఇష్టదేవతాస్తుతియు బాలాత్రిపురసుందరీ తేజస్వరూపమగు శ్రీరామపరమే. ఇంతటి లోకోత్త రార్థమీ రామాయణ కావ్యమునందంతర్భూతమైయున్నది గాన, ఇంచలి యిష్టదేవతా ప్రార్థనము, కేవలము సాహిత్యపరముగాక, ఆధ్యాత్మికమే యని విశదమగుచున్నది. బాల్యమునుండియు బాలాంబికా భక్తులై అనేముక తారకమంత్రసిద్ధులైన శ్రీ ఆచార్యులవారి యాధ్యాత్మిక జీవితపరిణామ మీ రామాయణమున వ్యక్తమై, లౌకిక రసానందమేగాక బ్రహ్మానంద సహో దరమగు నమృతత్వము [1] కావ్యమునకు సంఘటించి విశ్వజనీనత్వము, శాశ్వ తత్వము గలిగించినది. [2]

## విశిష్టాద్వైత మతసిద్ధాంతములు

ఆధ్యాత్మిక విశిష్టతయందు తెలుపదగిన విషయమింకొకటిగలదు. అది యీ గ్రంథమునగల విశిష్టాద్వైత మతసిద్ధాంతనిరూపణ. రామాయణమునకు విశిష్టాద్వైత మతపరముగ విశ్వవిఖ్యాతమగు గోవిందరాజీయ వ్యాఖ్యానము

1. కేవలము భక్తి ప్రపత్తులను నిరూపించు నీమకుటముతో ఆచార్యులు వారు "పాహిమాం" శతకమును రచియించినారు.
ఈ దృష్టితో విచారించిన — నీ సమీక్షలోనిందలి యధ్యాత్మిక భక్తి తత్త్వసమగ్రపరిశీలన మెంతగానో చేయవలసియున్నది.
2. కాలాంతరము, స్థలాంతరమున దానిని చేయుదును. గభవదను గ్రహము.

గలదు. ఆచార్యులవారు విశిష్టాద్వైతులు కావున నీ గ్రంథమున తన్మత సంప్రదాయములను నిబంధించియున్నారు. వారు తన్మతసంప్రదాయనిష్ఠావరులు.

"తిరువారాధన నిత్యమున్ సలిపి నీ తీర్థంబు సేవింపకే
పరమాన్నంబగుగాక యేదియయినన్ భక్షింపనే నాడునీ
తిరుపాదద్వయి నారగింపిడక నేదేనిన్ గ్రహింపన్ గదా
పరమాత్మా! రఘునందనా! వరద! నీ భక్తున్ గృపన్ జూడుమీ

పాదుకాపట్టాభిషేకము మూయాశ్వాసము 265 ప.

విశిష్టాద్వైతమత ముఖ్యసిద్ధాంతమగు శరణాగతి అనునది, ఈ గ్రంథమున నాయా కథాసందర్భములలో చక్కగా ప్రపంచింపబడినది. రామాయణ మాదినుండి యంతమువఱకును నీ శరణాగతి పరంపరనే ప్రతిపాదించుచుండు టచే దీనికి దీర్ఘశరణాగతి అనిపేరు గలిగినది. సీతారామమున శరణాగతాశ్వాసము, పట్టాభిరాముడు (యుద్ధకాండమున) విభీషణ శరణాగతి యీ శరణాగతి తత్త్వము విశదము సేయుచున్నవి.

ఆచార్యులవారు, వైష్ణవమత సంప్రదాయముల నామూలాగ్రముగా నాకళించుకొన్నవారు. శ్రీరామపరశురామ సంవాదమున "ఇదంతు వైష్ణవం రామధనుఃపరపురంజయమ్" అను శ్లోకములో "పరపురంజయమ్" అను పదము పాదుకాపట్టాభిషేకము. శరణాగతాశ్వాసమున - 526, 527, 528 మూడు పద్యములలో ననువదింపబడినది. అందలి నిగూఢమగు మంత్రశాస్త్ర సంప్రదాయము తద్గోష్ఠి నిష్ఠులుమాత్రమే ప్రవచింపగలరు. తక్కినవారి కధికారములేదు. శరణాగతి స్వరూపములగు ప్రపదము, ప్రపత్తి, న్యాసము, భరన్యాసము [1] అనునవి యీరామాయణమున ప్రదిపాదితములైనవి. ఈ విశిష్టాద్వైతమత సంప్రదాయదృష్టితో నీ మహాకావ్యమును ప్రత్యేకముగా పరిశీలింపవలసియున్నది.

## ఆంధ్రరామాయణవాఙ్మయము

### గోవిందరామాయణ స్థానము

ఈ మహాకావ్యము సందింకను చూపవలసిన విషయము లెన్నోగలవు— వానిని వివరించుట కీచిన్న పీఠికలో నవకాశము లేదు. నవీన కాలమున బుట్టిన

1. వైష్ణవమత సంప్రదాయపరిభాషిక పదము లిందుచాల ప్రయుక్తములైనవి.

కావ్యములను మనము కేవలము సాహిత్య దృష్టితో విమర్శించుట పరిపాటి యైనది. నవీన కాలమున సాహిత్యమున నాధ్యాత్మికత లుప్తమైన కారణమున విమర్శకులట్లు భావించి కావ్యవిమర్శనము చేయుచున్నారు. కాని యిది యెంత మాత్రము సమంజసము కాదు— శాస్త్రీయమును కాదు— ఆధ్యాత్మికమునుసాహిత్యమును నవినా భావ సంబంధముగల మన కావ్యముల నా రెండు దృక్పథములతోడను విమర్శింపవలయును. నవీన యుగమున బుట్టినంతమాత్రమున నాకావ్యమున నాధ్యాత్మికత యుండదను నభిప్రాయము కొందఱు విమర్శకులలో నాటుకొని యున్నది. అందువలన సాహిత్య విమర్శ పాక్షికమై విమర్శనా ప్రయోజనమునకు దూరమగుచున్నది. అట్టివారి దృష్టిని— కావ్యమున నాధ్యాత్మిక వివేచనకు మరల్చుట యే లక్ష్యముగా, నింతవఱకు నీ పీఠిక విపులీకరింపవలసి వచ్చినది. విమర్శకులీ దృష్టి నలవఱచు కొనుట మన సాహిత్యాభ్యుదయ హేతువని నా విన్నపము.

## రామాయణ వాఙ్మయము

తెలుగు సాహిత్యమును నన్నయ నుండి నేటివఱకు పరిశీలించిన వారికి, తెలుగు భాషలో రామాయణ కథకున్న వ్యాప్తి, మఱి యే కథకు లేదని చెప్పవచ్చును. పల్లెపదములు, పడతుల పాటల నుండి పరిణతములైన, ద్విపద, శతక ఉదాహరణ, గేయ, సంకీర్తన, యక్షగానముల నుండి, ప్రౌఢరచనలైన మహాకావ్య ప్రబంధము వఱకు, రామకథ సంబంధములైన రచనలేవిశేషముగా గానవచ్చుచున్నవి. తెలుగున రామాయణ కథకు సంబంధింపని సాహిత్య శాఖ లేదనుట నత్యోక్తియేగాని యతిశయోక్తి కాదు. పరిశోధన ప్రబలముగా నున్న నేటి కాలమున కూడ తెలుగున రామాయణకథా సంబంధమగు వాఙ్మయమెంత యున్నదో, ఎన్ని గ్రంథములుండునో, అట్టిగ్రంథసూచిక గాని రామాయణ వాఙ్మయ కోశముగాని, ఏ సాహిత్య సంస్థలు, విశ్వవిద్యాలయములు వెలువరించుటకు ప్రయత్నింప లేదు. రామాయణమునకు సంబంధించిన కృతులాయా శాఖలలో వేయింటికి పైగా నుండ వచ్చునని యూహా. పరిశ్రమ జరిగిన నిజము బహిర్గతమగును. ఒక్క విషయము మాత్రము నిశ్చితముగా చెప్పవచ్చును.

"అంతా రామ మయం బీ జగ
మంతా రామ మయం"

అన్నట్లాంధ్ర వాఙ్మయమంతయు రామ మయమే.

ప్రస్తుతమిందు కావ్యశాఖలో గల రామాయణములను గూర్చి తెలుపుచున్నాను.

## కట్టా వరదరాజు ద్విపద రామాయణము

ఈ ద్విపద కృతిని గూర్చి లోక మీవఱకెఱుగదు వరదరాజు, రామాయణము 24 వేల శ్లోకములకు 24000 ద్విపదలు వ్రాసియున్నాడు. రసోత్తరమైన రచన. తెలుగు భాషలో నింతకన్న పెద్ద ద్విపదకృతి లేదు.[1] ఇంతవఱకు వాఙ్మయ చరిత్రకెక్కలేదు.

## పద్యకృతులు

తెలుగున రామయణము తొలుత పద్యకృతిగానే యవతరించినది. ప్రాచీనపద్యరామాయణములలో నేటికిని ప్రచురప్రచారమునయున్నది భాస్కర రామాయణము.

భాస్కర రామాయాణము బహుకర్తృకము.[2] బహుపాఠభేదములతో గూడినది. అయినను ఆ రామ నామ మహాత్మ్యము వలన వ్యాప్తి జెందినది.

భాస్కర రామాయణముకన్న మున్ను— ఎఱ్ఱాప్రెగడ రామాయణము వెలసినది. ఇది మనకు లభ్యమగుట లేదు. భాస్కర రామాయణమునకు వెనుక నొక శతాబ్దికి— కొఱవి సత్యనారాయణ రామాయణము రచించెను. అదియును లభ్యము కాలేదు. ఇంకను అముద్రితమై లభ్యమగుచున్న రామాయణములు గలవు.

---

1. దీనియేకైక ప్రతి తంజాపూరి సరస్వతీమహాలు నందున్నది. ఆ ప్రతి నుండి నాలుగు సంపుటములుగా (బాల అయోధ్యా-1 అరణ్య కిష్కింద-1. సుందర-1. యుద్ధకాండ-1.) నేను విపుల పీఠికలతో ఆ సరస్వతీమహాలు గ్రంథాలయము పక్షమున ప్రకటించినాను. అది ప్రభుత్వ ప్రకటితము.
2. భాస్కర రామాయణమునకు పద్యములేకాక, గ్రంథభాగములే పాఠ భేదములుగలవు. కాండాద్యంతము లొకదానితో నొకటి సమన్వయింపవు. నేటి భాస్కర రామాయణమున నితరుల రచనలు చేరినవి. భాస్కర రామాయణమును తాళ పత్ర ప్రతులతో పరిశీలించిసుపరిష్కృతమైన ముద్రణము ప్రకటింపవలసిన యావశ్యకతయున్నది.

## ఆధునిక యుగము

పై రామాయణములన్యూనాతిరిక్తములుగ నున్నవని- శ్రీ వేంకటగిరి ప్రభువులు గోపీనాథ వెంకట కవీంద్రుని రామాయణమును ముద్రించి వ్యాప్తిలోనికి తెచ్చినారు. గోపినాథ రామాయణము–1923 నాటికి నైదు ముద్రణములై యావదాంధ్ర దేశమున నత్యధిక ప్రచారము బడిసినది. అపర పోతనయగు గోపినాథ వెంకట కవీంద్రుని రామాయణము నేడు తిరిగి ముద్రితము కావలసి యున్నది. వెంకట కవీంద్రుని, వారి తరువాత రామాయణమును వ్రాసిన వావిలికొలను సుబ్బరాయ కవీంద్రులు– ప్రత్యేక పద్యమున నుతించిరి. మన ఆచార్యుల వారును. గోవింద రామాయణమున– భాస్కరునితోపాటు– సుబ్బరాయ కవీంద్రుని వెనుక రామాయణము రచించిన జనమంచి శేషాద్రి శర్మను మొల్లతో కలిపి యిట్లు స్తుతించిరి.

లలితామ్నాయ కథా విధాన రచనా లావణ్యునిన్ భాస్కరున్
విలసత్ శబ్దసమన్వయ ప్రథితు గోపీనాథునిన్ సత్కవిన్
బొలతిని మొల్లను వాసుదాసు దపసిన్ బూజ్యుండు శేషాద్రినిన్
దలఁతున్ వీరలు భక్తి వ్రాయుటను సీతారామ సత్కావ్యమున్

పాదుకా పట్టాభిషేకము అవతారిక

పై వివరణ బట్టి నేడు వ్యాప్తిలో నున్నవి. (80)

భాస్కర రామాయణము } ప్రాచీనములు
మొల్ల రామాయణము }
గోపీనాథ రామాయణము

(వాసుదాసు) వావిలికొలను ఆంధ్ర వాల్మీకి రామాయణము }
జనమంచి శేషాద్రి శర్మ } నవీనములు
ఆంధ్ర రామాయణము-

ఈ తరువాత శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు రామాయణము తెలిగించిరి. కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షము- సాహిత్య లోకమునకు పరిచితమే.

"ఆలపింతుము కుశలవులైన మేము
మధు మధురమైన యట్టి రామాయణంబు"

అని ఆనాటి కుశలవుల వలె ఈనాడు వేంకట పార్వతీశ్వర కవులు రామాయణము గీతపద్యములలో రచించిరి.

నేడు అత్మకూరి వారి గోవింద రామాయణము సంపూర్ణమై ఆంధ్ర సాహిత్య ప్రపంచము నలంకరించినది. ఇంతవఱకును, గోపీనాథ రామాయణ మును గూర్చి సాధికారమైన విమర్శ గ్రంథములు రానేలేదు. వావిలికొలను రామాయణము మంథర వ్యాఖ్యానముతో ఉండుటచే నారామాయణ విశిష్టత మనము గ్రహింపగలము.

ప్రాచీనములైన భాస్కరాది రామాయణములనే గాక నవీనములైన, గోపీనాథ వావిలికొలను రామాయణములను నామూలాగ్రముగా పరిశీలించి తిని. నవీన యుగమున వెలసిన రామాయణములలో గోపీనాథ రామాయణము పురాణస్థాన మాక్రమించినది. ఆంధ్ర దేశమున పలుచోట్ల గోపీనాథ రామా యణము పురాణముగా చదివెదరు[1] కాని, ఆ రామాయణము- పురాణముగా చదివి చెప్పవలసినదే- ఉత్తమ సంస్కారమున్నవారికి తప్ప, అందలి ప్రౌఢ రచనయందఱికి అవగాహనము గాదు.

గోవింద రామాయణ మట్లుగాక, పఠితలకేపాటి సంస్కారము, అథవా వాచకత యున్నను, స్వయముగా చదువుకొని, కావ్యము నవ గాహన చేసికొని యానందించుట కనువైన మృదు మధుర సులభ రీతిలో నాబాల గోపాలమున కందుబాటులో నున్నది. రచనా మాధుర్యముతోబాటు ఈ రామాయణమున తక్కిన రామాయణము లన్నింటికంటె, రామ భక్తి

1. కీ. శే. నాజనకులు సుందరము పంతులుగారర్థము చెప్పగా నేను గోపీనాథరామాయణము చదువు భాగ్యము లభించినది. ఇప్పటికి నలుబదేండ్ల క్రిందట, విజయనగరమున, ఒకసంపన్న గృహస్థులైన చావలి రామమూర్తి, శేషయ్యగారల యాధ్వర్యమున నీరామా యణ పఠనము జరిగినది.

ప్రతిపాదకమై, రామ పరతత్త్వ ప్రదీప్తమై, యెట్లు బహుముఖములుగా ప్రత్యేక విశిష్టతతో విలసిల్లుచున్నదో యీ వఱకు వివరించి యున్నాను. ఈ దృష్టితో విచారణ చేసిన-

గోపీనాథ రామాయణము-

గోవింద రామాయణము-

అను రెండే- రామాయణ వాఙ్మయము ననేగాక- నవ్యాంధ్ర సాహిత్య జగత్తున నా చంద్రతారార్కముగా నిలిచి, ఆంధ్ర మహాజనులను తరింప జేయగలవు.

## విజ్ఞప్తి

గోవింద రామాయణ కావ్య తత్త్వము సంపూర్ణముగా నాకళించుకొనుటకు అందలి యాధ్యాత్మికతా విశిష్టత గ్రహించుటకు- ఆ గ్రంథము సంపూర్ణ స్వరూపముతో వెలయ వలసియున్నది. నేడీ కృతి- ఏడు సంపుటములుగా విభక్తమై యున్నది. ప్రతి సంపుటమునకు, పీఠికలు, ఉపోద్ఘాతములు, ప్రశంసలున్నవి. ఇందువలన, మనమాయావిభాగములలో నున్న విశేషములు గ్రహింపగలుగుచున్నామే గాని అనుస్యూతముగా నాది నుండి యంతము వఱకు గల కావ్య తత్త్వమును గ్రహింప లేకున్నాము. అట్టి కావ్యతత్త్వము నామూలాగ్రముగా నవగాహనము జేసికొనుటకు, నీ ఏడు సంపుటములు నేకాకారమున.

### ''ఒకే సంపుటముగా''

విపుల పీఠికా, వ్యాఖ్యా విశేషములతో నవతరింప వలసిన యావశ్యకత యున్నది. అప్పుడీ కావ్యము యొక్క నిజస్వరూపము మనకు సాక్షాత్కరించును.

శ్రీ రామ చంద్రుని యనుగ్రహమున- నీ యేడు కాండలు నొకే సంపుటమున వెలువడి- ఆంధ్ర సాహిత్య ప్రపంచము నలంకరించి ప్రచారము నందుగాక!

ఇప్పటికి ముప్పదేండ్ల క్రిందటననగా క్రీ. శ. 1941 లో మొదలైన యీ మహాకావ్యము నేటికి క్రీ. శ. 1971 లో పూర్తియైనది ముప్పదేండ్లు కావున

గోవింద రామాయణమునకు త్రిదశత్వము గలిగినది. త్రిదశులనగా దేవతలు. సకల దేవతా సార్వభౌముడైన శ్రీ రాముడే దీనిని వ్రాయించినాడు. తన భక్తునిచే రచితమైన నీ గోవింద రామాయణ కృతికి శ్రీ రాముడే- అమృతత్వసిద్ధి చేకూర్చును.

ఇరువదేండ్ల క్రితము కట్టా వరదరాజు ద్విపద రామాయణ కృతిని పరిష్కరించి ప్రకటించు సందర్భమున నాకు రామాణము గూర్చి పరిశ్రమ చేయు భాగ్యము లభించినది. తిరిగి నేటికట్టి యవకాశము లభింపజేసిన వారాచార్యుల వారే. ఈ పట్టాభిరాముడు అను యుద్ధకాండమునే కాక, రక్షకరాముడు (అరణ్య కాండ), ధార్మిక రాముడు (కిష్కింధా కాండ), సుందర రాముడు (సుందర కాండ) అను వానిపైన గూడా నాచే వ్రాయించుటకు హేతు భూతులు వారే. వారి కోరిక ననుసరించి గ్రంథము సంపూర్తియైనది. కావున ఈ పట్టాభి రామ కాండమునకు కొంత విపులముగా పీఠిక వెలయించినాను. ఇంకను వ్రాయవలసిన విషయము లెన్నో మిగిలి పోయినవి. గ్రంథము ఒకేసంపుటముగా ముద్రితమైనప్పుడు విశేష విషయ విలసితముగా పీఠిక సంతరించెదను. పాఠక లోకమును మన్నింప గోరుచున్నాను.

లౌకికములగు సాహిత్య గ్రంథములకు పీఠికలు వ్రాయు నాకిట్టి యాధ్యాత్మిక భక్తి నిధానమగు తమ గ్రంథమునకు పీఠికను వ్రాయు మహదవకాశము లభింప జేసిన శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యుల వారికి నామనః పూర్వక కృతజ్ఞతా సూచకముగా నీ పద్యాంజలిని సమర్పించు చున్నాను.

## పద్యాంజలి వాల్మీకిస్తుతి:

ఉ. శోకమె శ్లోకమైన రససూక్తుల రామకథన్ రచించె నే
కైక మహాక్షరంబున నఘావళి ద్రుంచెడు కావ్యమూర్తి గా,
నా కవితావతార ప్రథమాంచిత తీర్థమునై వెలుంగు వా
ల్మీకి మహార్షి వర్యునకు మేదుర భక్తి నమస్కరించెదన్.

## గోవింద రామాయణ స్తుతి:

ఉ. శ్రీకరమైన రామ కథ చేకొని, భక్తి రసప్లుతంబుగా
నా కథునీ తరంగ నటన ప్రతిమల్లనవీన సూక్తిము

క్త్యాకృతిగా నొనర్చి కవితా చరితార్థతఁ గాంచినట్టి సు
శ్లోకుని, నాంధ్ర సత్కవన శూరు నుతించెద నాత్మకూరినిన్.

మ. స్తవనీయంబుగ ప్రాక్తనైక కవితా చాతుర్యముల్ జూపుచున్
నవ మాత్రాశ్రయమౌ కవిత్వము ను సంధానించి ప్రాజ్ఞవ్యులై
కవులెల్లన్ భవదీయ కావ్య రచనా కౌశల్యము న్మెచ్చ రా
ఘవు గీర్తించిన నీ మహాప్రతిభకున్ గై మోడ్పు లర్పించెదన్.

మ. నవ భావధ్వని నూత్న రీతులఁబద న్యాసంబు లొప్పారఁగాఁ
కవితా నర్తకి భక్తి భామినిగ సంకల్పించి శ్రీ రాఘవ
ప్రవరామేయమహత్త్వ తత్త్వ ము ను సంప్రాప్యంబుగాఁ జేయునీ
శ్రవణానంద కరాంధ్ర కావ్య కవితా సంపత్తికిన్ మ్రొక్కెదన్.

శ్రీ. మందారైక ఫలప్రదంబుఁ ద్రిజగన్మాన్యంబు రామాయణం
బందించెన్ సకల ప్రపన్నులకు భక్త్యైక ప్రభావాప్తి గో
విందాచార్యుఁడు దివ్యభక్తి కవితావేశుండు, మాధ్వీరస
స్కందం బై నిఖిలాంధ్రలోక జనతా కర్ణామృత స్యందిగాన్.

ఉ. ధ్యేయుఁడు రాముఁడే త్రిజగతీస్థలి తారక మంత్ర మొక్కటే
ధ్యేయము. ధ్యేయమంచు నుపదేశ మొనర్చిన "ఆత్మకూరి రా
మాయణ కావ్యరాజము ముదామర భూజము నాంధ్రభాష రా
మాయణ కావ్య భారతికి, మానితమైన కిరీటమయ్యెడిన్.

కృతి పతియగు శ్రీ రామచంద్రుడు, కృతికర్తయైన గోవిందా చార్యుల వారికి ఆయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాత!

ఇతి శివమ్

లక్ష్మీకాంత నిలయము
2-2-1137/5, సరస్వతీ నగరము
(న్యూ నల్లగుంట).
12. 7. 1971.

నిడుదవోలు వేంకటరావు

శ్రీ రామాయనమః

# శ్రీ గోవింద రామాయణము

## పట్టాభిరాముడు

## యుద్ధకాండము

### సంగ్రామసన్నాహాశ్వాసము

#### ప్రార్థనాదికము

ఉ. శ్రీ నిధివై యనాది చిద చిన్మయ దివ్య శుభంక రాంబవై
భాను సహస్ర మండల విభా ప్రతిభాసిత మూర్తి గల్గియున్
జానగు మోమునన్ మధురశాంత మృదూక్తులబల్కు బాల నా
మానసమందు నిల్చి యభిమానముతో సుకవిత్వమిచ్చుతన్ 1

ఉ. వ్రాసితి నారుకాండములు వ్రాయగఁబూనిన యుద్ధ కాండమున్
వ్రాసినఁబూర్తియౌను రఘురామచరిత్ర, రస ప్రపూర్ణమై
భాసిలగాఁ బ్రసాదగుణవంతముగా సుజనాళి మెచ్చగా
వాసిగ వ్రాయజేయుము కృపామయ బాల త్రిలోక సుందరీ 2

ఉ. సల్లలితాంబ నీదు పద సన్నిధి నిల్చితి, నేబదేండ్లుగా
నుల్లము పల్లవింపగ మృదూక్తుల సత్కవితా ప్రదాత్రివై
యెల్ల రఘూద్వహోత్తముని యుద్ధచరిత్రము వ్రాయఁజేయవే
చల్లని చూడ్కులన్ రచన సల్పఁగఁ జేయు త్రిలోకసుందరీ. 3

తే. గీ. యుద్ధకాండంబు వ్రాయఁ బ్రసిద్ధ రీతి
విజయ రాముండు విజయంబు వెలయఁజేయు
అండదండగ నిలుచు నా యయ్యగూడ
భక్తతతి దీవన లొసంగ వ్రాయునటు గ 4

శ్రీ రామాయనమః

## సంగ్రామయాత్రాశ్వాసము

# కథా ప్రారంభము

కం. శ్రీ వైకుంఠ నివాసా
రావణసంహారకర్మ రాముఁడ వగుచున్
భూవర జన్మము నెత్తవె
దేవానీకంబు కోర్కి దీర్పఁగ రామా! 1

శ్రీ రఘురామభక్తుఁడు విశిష్ట గుణాన్వితవాయుజుండు, సీ
తారమణీ శుభంబు విశదంబుగఁ గన్నది విన్నదెల్లయున్
దీరుగ లంకఁ జేరినగతిన్ వివరింపఁగఁ గాంచి యర్కజున్
ధీరమతిన్ యథోచితవిధిన్ రఘుచంద్రుఁడు బల్కెహృష్టుఁడై 2

మ. హనుమంతుం డసమానుఁ డీ పృథివిలో నన్యుల్ నివర్తింపఁజా
లని కార్యంబొనరించె గా జలధినే లంఘింపనౌనే, మహా
వనధిన్ దాటిన దాటు గాక భయదంబౌ లంక శోధించి, సీ
తను జూడంగలవాడునై మఱల సాధ్యంబౌనె వేరేరికిన్. 3

కం. శ్రేష్ఠుఁడు భృత్యులయందు వి
శిష్టముగా జేనియానఁ జేయుచు దోడా
శిష్టకృతి సలుపువాడు, ప్ర
కృష్టముగా హనుమ సేసె నిటుగ నృపాజ్ఞన్. 4

. గీ. రావణాసురపాలిత లంక కేగి
యొరులు చొరలేని యా లంక నొాదిగి తిరిగి
పట్టుబడకుండ జానకిఁ బలుకరించి
మఱలి వచ్చె వాయుజుఁడు సామాన్యుఁడొకో 5

ఉ. ఊరును బేరునుం గల మహోజ్జ్వల రాఘవ వంశ కీర్తి నీ
మారుతి నిల్పె, లేనియెడ మా కులమెల్ల నశించిపోవదే
ధారుణికన్యయున్ దశరథాత్మజులున్ బ్రతుకంగలార, తె
వ్వారలు సాటి, యీతనికిఁ బ్రజ్ఞను, భక్తిని కార్యదక్షతన్.

ఆ. వె. ఆత్మహత్య పాప మంటదు మాకింక
సీత క్షేమ మనుచుఁ జెప్పియుంట
నింత యుపకృతి హనుమంతుఁడొనర్పంగ
నీ మహాత్మున కిపు డేమి సేతు.

ఉ. ఈతని మేలు సేత కితఁడేసరి, యే బహుమానమీయ నీ
చేతకుసాటియౌ నిలుచుఁ జిత్తము నందిది జీవితాంతమున్
వీత సమస్త కామ భయ విజ్జుఁడితండు మదీయ సర్వమున్
బ్రీతినిడన్ సమంబగునె ప్రేమయె తుల్యము దానినిచ్చెదన్.

ఆ. వె. అనుచు గాలి బిడ్డ నక్కునఁ జేర్చెను
రాఘవుండు ప్రేమరాశి యగుచు
హనుమ హృదిని హృదయ మత్తఁగఁ గౌగిటఁ
గ్రుచ్చి గ్రుచ్చె హనుమ మెచ్చు కొనుచు.

తే. గీ. పులకరింతలు మైగొన లలితమూర్తి
భక్తున కొసంగె హృదయంబు భక్తభక్తుఁ
డగుచుఁ బ్రేమాతిశయమున నంతకంటె
నక్షయము వేరు లేదని యాత్మఁ దలఁచి.

ఉ. అంతట రామభద్రుఁడు దినాధిప పుత్రునిఁ జూచి పల్కు, నీ
కెంతయు సంతసంబొదవె నీవు కృతార్థుఁడవైతి, జానకీ
కాంతను రోయుటన్ సఖ! యికన్ దరియింపఁగవార్ధిన్, భయ
క్రాంతుఁడనైతి వానరు లెకాయెకి దాటగలారె నీరధిన్. 1

తే. గీ. హనుమ సీతకు నటఁ జెప్పి నటుగ వింటి
వనచరులు దాటగల రబ్ధి నని, యదేమొ

భయ మొదవుచుండెఁ, దలపంగ వారినిధిని
ననియె రాముండు శత్రు భయంకరుఁడు. 12

తే. గీ. అనుచు ఖిన్నుఁడై యుండ నరాధిపుండు
రవికుమారుండు గనుచు నా రామభద్రు
నాతనికి ధైర్య మొదవఁగా ననఁ గడంగె
వానరులు దాటగల రని వారినిధిని. 13

## సుగ్రీవుని హితము

మ. మతిమంతుండవుఁ బండితుడంవును నామ్నాయార్థ విజ్ఞుండవున్
ధృతిమై భావి నెఱుంగువాడవుసు బృద్ధ్విజాత క్షేమంబునున్
శ్రుతమయ్యేన్ రిపు వుండు వాడ దెలిసెన్ ఖిన్నుండ కా
కతమేమీ? యరిగెల్చు రీతులరయంగా నైన గాలంబునన్. 14

తే. గీ. స్నేహమును గృతఘ్నుండు త్యజించు రీతి
దుఃఖమును వీడఁగాఁ దగు దోర్బలుండ
అరి నిబర్హణ రీతుల నరయఁదగును
పౌరుషముఁ బూనుమీ యింకఁ బూరుషుండ. 15

తే. గీ. యోగి మోక్షబాధకబుద్ధి వీగఁజేయు
భంగిఁ గార్యబాధకబుద్ధి బాయవలయు
నీతిశాస్త్రప్రవీణుండ నేర్పుతోడ
వైరిని జయింపఁ గలమను భావ మొప్పు. 16

చం. జలనిధి నక్రసంకులము చయ్యన దాటుచు లంకఁ జేరి కో
టల కెగఁ బ్రాకి, శాత్రవ భటాళిని రావణరాజు జంపగా
గలరు, నృపాల వానరులు కాగల దియ్యది నీ నిమిత్తమై
జ్వలనమహాగ్నినైనఁ బడవచ్చెడి, నాబలగంబు రాఘవా! 17

చం. ఉరుబలదర్పశేముషి రణోద్ధతి రావణరాజుజంపి నీ
ధరసుతఁ దెచ్చు నా కృషికి ధార్మికవీర!, అనుగ్రహింపుమీ

వరమతిఁ బ్రోత్సహింపుము ప్రభాకరవంశజ! సేతు వొండె సా
గరతరణంబుఁ జేయుటకుఁ గట్టెడిమార్గము యోజసేయుమీ.

ఆ. వె. అబ్ధిఁదాటఁగలిగి యా త్రికూటాద్రిని
లంకఁ గాంచునంత రావణుండు
హతుఁడె కడలి సేతు వమరెడి విధ మొండె
యూహ సేయ వలయు నుర్వినాథ!

తే. గీ. సేతువును గట్టునంతట సింధువుఁ ద్రుటి
దాటి వానర సైన్యంబు దైత్యనాథు
లంకఁగన, లంక సర్వంబు లయము గాదె
ఏల ఖిన్నుఁడ వైతి వీ విపుడు రామ!

తే. గీ. శూరులు నశించుదానికిఁ జూడ నట్టి
దానికి దిగులొంద రెపుడు ధైర్యముఁగని
యత్నకార్యార్థమై చూతు రనవరతము
చనఁగ నుత్సాహ మాపద సంభవించు

ఉ. సేతువు గట్టు యత్నమును శీఘ్రముగా నొనరింపగావలెన్
సేతువు లేక లంకఁగన సింధువు దాట నసాధ్య మెంచ, వి
ఖ్యాతసురాసురాళికిని నన్యుల మాట వచింపనేల వే
భీతిని వీడి యాత్మఁ దలపెట్టుము సేతువు గట్టు పద్ధతిన్.

తే. గీ. శౌర్యవంతుండు వదలఁడు ధైర్య మెపుడు
కాలము గణింపఁదగు నట్టి కాల మిద్ది
వానరుల కృషి విజయంబె పడయు నెపుడు
శీఘ్రగతిఁ జూతువీవు నీ సీత రామ!

తే. గీ. వృక్షపర్వతంబులతోడ రాక్షస పురి
మట్టిఁగలుపఁగలారు మా మర్కటములు
రామ! శంకింపవలదు మర్కటుల బలము
జయము నీవు దె పొందు ముత్సాహ మిపుడు.

తే. గీ. పూనికను వీడ జెప్పుడు(బూరుషుండు
పూన్కి నెరవేర ధైర్యంబె పూనియుండు
విడువ వుత్సాహ శౌర్యముల్ వీరునకును
గథలు వ్యథ లౌట గనమొ లోకంబునందు. 25

ఉ. పోరగసాటి నీ కెవరు మూడు జగంబులయందు రాఘవా!
వీరుఁడ చాపబాణముల వెల్గెడి నిన్ననునంత వైరు లె
వ్వారలుగాని పాఱరొకో పట్టు జయంబె సదా రణంబులన్
ధీరమతిందలంచి కపిధీరుల కాజ్ఞ నొసంగు భావికై. 26

ఉ. సేతువు గట్టి దాటుటయొ సింధువు లేక మఱే యుపాయమో
చేతమునందు నిశ్చితము చేయుము నీవిక కామరూపులౌ
కోతులు వార్ధిలంఘనముఁగూర్చి జయంబొన గూర్చువారు సం
ప్రీతిని, మాటలేల శుభరీతి నిమిత్తములన్ని తోచెడిన్. 27

తే. గీ. అనెడి సుగ్రీవు మాటల నాలకించి
రఘువరుఁడు వల్కె ధీరుఁడై లంకకరుగ
సేతువును గట్టియో లేక జేసితపము
సాగరము నెండఁజేయగ శక్తియుతుఁడ. 28

మ. హనుమా! కన్నులఁ గట్టఁజెప్పు రిపులెట్లా లంక రక్షింత్రు దై
త్యుని సేనాపరిమాణరక్షణగతుల్ దుర్గమ్ములున్ ద్వారముల్
కనియున్నట్టి సమస్తమున్ దెలుపుమీ కర్తవ్య మెంచంగ, వై
రిని నిర్జింపఁగ శత్రుమర్మముల గుర్తింపంగనే సర్వదా 29

హనుమ లంకారక్షణ విధానముఁజెప్పుట

ద్వి అన విని హనుమంతుఁ డా రాముతోడ
గనిన దెల్లయును లంకనుగూర్చి తెలిపె 30

తే. గీ. పరపురంబు జయించెడి బాహుబలుఁడ
దుర్గమంబైన నా లంక తోయనిధికి

నవలి యొడ్డున దక్షిణమందు గలదు
కొండకొనఁ గొండ నంటుచు నుండె రామ. 31

ఉ. నాలుగు గుమ్మముల్ గలిగి నల్దెసలంబరిఖావృతంబునై
వీలొక యింతఁ గానము ప్రవేశము సల్పఁగఁ గోటలోనికిన్
శూలధరుల్ భటాళి బురుజుల్ సతతంబును వేయి కండ్లతో
పాలన సేయుచుండెదరు వైరుల డీకొన యుద్ధసిద్ధులై. 32

తే. గీ. ఎపుడు శాత్రవు లెవ్వార లేగుదెంచు
వారలో యనుభీతి రావణుఁడు మెలఁగు
యుద్ధమెనరింప సైన్యాళి సిద్ధపఱచి
యుంచు సతతంబు జయమె కాంక్షించుచుండు. 33

తే. గీ. పరిఖలు శతఘ్నులును యంత్ర పరికరములు
రథ గజ తురగాదులు గల లంక కోట
దఱికిఁ జనఁగూడ నలవి గాదరయఁ బరిఖ
లన్ని శీతల నీరమయంబు లగుట. 34

తే. గీ. ముందు జలదుర్గమును దాటి పోవవలయు
నవలఁ బర్వత దుర్గంబు నతిక్రమించి
సహజ వనదుర్గమును మీరి చనినఁ గట్ట
బడిన ప్రాకారదుర్గమ్ము వరలు నంత. 35

తే. గీ. లక్షలకు కోట్లకును మించి లంకయందు
శూరు లగువారు గలవారు వీరభటులు
వెండి బంగారు నవరత్న మండలయుతి
ప్రజయు సంతృప్తి సిరియు సంపదల నుండు. 36

తే. గీ. గుమ్మములు నాల్గు వీర భట కోటి గాయు
తూర్పు పదివేలు శూలాలతోడఁ గలరు
పశ్చిమంబున దశలక్ష భటులు చర్మ
కవచధారు లస్త్రవిదులు కలరు రామ. 37

తే. గీ. ఉత్తరంబున శతకోటి యుత్తమబల
మశ్వగజరథములఁగూడి యలరు వార
లుత్తమ కులీను లగువార లున్నవారు
వారు జేనికి విశ్వాసపాత్రు లరయ. 38

తే. గీ దక్షిణద్వారమందు సదా వసించు
లక్షమందిభటులు చతురంగబలము
కోటి వరవీరసైన్యసంకులము పురము
పురి నడుమనుండె సైనికవ్యూహ మరయ. 39

తే. గీ. జలధి గిరి వన దుర్గముల్ సంతరించి
ఆ యగడ్తల నక్రచయంబుఁ దాటి
కృతక దుర్గమ్ము మీరుచు దితి కుమారు
తోడఁ బోరి జయమ్మును బొందవలయు. 40

చం. కలరు త్రికాలధర్మముల కర్మలొనర్చెడి వేదవేద్యులున్
గలరు మహాస్త్రచయ కార్ముకవేత్తలు ధర్మమూర్తులున్
గలరట శౌర్యధైర్యములఁ గ్రాలెడు వీరులు యుద్ధకోవిదుల్
గలరు తపోధనుల్ విభుదకాండము మానవ భోజులందునన్. 41

చం. సురుచిర వస్తు సంపదల శోభ విభాసుర మా పురంబు భా
సుర నవరత్న కాంతిమయ సుందర సౌధ విరాజ మానమున్
బరిసరముల్ వనీ కుసుమ వార సుగంధ యుతంబులున్ సదా
సురపురియా యనన్ గగనచుంబితమై విలసిల్లు గొండపై. 42

తే. గీ. అల త్రికూటాద్రిశిఖరాగ్రమందు లంక
సర్వవిధరక్షణంబున జలపరివృ
తంబయి యలరు నద్దానిఁ దాకనగునె
సుర లసురులకునైనను జూడ వశమె. 43

మ. అయితే నేనొక యంతరావణునిసైన్యవ్యూహ ముంబోరునన్
లయముం జేసితి వీరవర్యులగు వారల్ బోర నాతో యమా

లయముం జేరఁగఁ జేసినాడఁ బరిఖల్ ప్రాకారముం బాడుగా
భయముల్ వీడఁగనా యెగాల్చితినిసర్వంబాపురిన్ రాఘవా. 44

తే. గీ. లంక కేరీతి నైన చేరంగవచ్చు
అంగద ద్వివిధ నళులును నా పనసుఁడు
మైందుఁడును జాంబవంతులే మనకుఁజాలు
నీలుఁడున్నాఁడు దళవాయి నేర్పువాఁడు. 45

తే. గీ. రామ వీర లా దైత్య పురంబునెల్ల
బెల్లగించుచుఁ దేఁగల బల్లిదు లహ
గగన మార్గంబునందుఁ బోఁగలుగువారు
తక్కు బలగంబదేలకో దశరథసుత. 46

తే. గీ. నిశ్చయింపు ముహూర్తంబు నీవ యుద్ధ
యాత్రకుఁ బయనంబు సలుపు నటుగ నాన
నిమ్ము సకల సైన్యంబు రా నీదు వెంట
అంగదాదుల కిప్పుడే యవనినాథ. 47

మ. హనుమంతుండిటు లాడ రాఘవవరుం డాలించుచుంబల్కె నీ
వను నాలంకను భీకరాసురుని రాజ్యంబేను శీఘ్రంబుగాఁ దుని
యల్ జేసెదసత్యమేనువ చియింతున్ వాయుసూనారణం
బునకేగన్ సుముహూర్తమిద్దియెసుమాపోవచ్చుసైన్యంబుతో

తే. గీ. నెత్తిమీదకు రవి వచ్చి నిలచియుండె
నీయదే యభిజిన్ముహూర్తమే శుభంబు
నిప్పుడే ప్రయాణ మగుచు నేగునెడల
రావణుఁడు సచ్చు విజయంబె లభ్య మగును. 49

తే. గీ. ధరణిజను దొంగిలించిన ధైర్యవిభుఁడు
పారిపోవుచునేగ నే వాడఁగాని
వానిఁ బట్టి వధింపంగ వర ముహూర్త
మిదియ సుగ్రీవ పోదగు నిపుడె మనము. 50

తే. గీ. ఉత్తరాఫల్గుణీతార యుత్తమంబు
నాకు సాధనతార యీ నాడె గలదు
సర్వ సైన్యంబుతోఁగూడి సమర మూన
పోవుద మిపుడె రవి శిరంబునఁ గలండు. 51

తే. గీ. మీనమందున సూర్యుండు మేషమందు
శుక్రుఁడున్నాడు గ్రహచార శుభము గలదు
జన్మలగ్నాదిగ గ్రహ సంచార బలము
విజయ మొనగూర్చు బయనమై వెడల నేడు. 52

తే. గీ. కంటిపై ఱెప్ప యదరెడి గన నిది శుభ
సూచకంబగు దెత్తు వసుంధరసుత
రావణుని జంపి విజయంబు రాజిలంగ
నిశ్చయంబిక బయనమై నేడె వెడల. 53

తే. గీ. నెమ్మి సైన్యాధిపత్యంబు నీలుఁడు గొని
మార్గదర్శకుఁడయ్యెడి మనకు నేడు
వన్యఫలమూలజలములు బాగుగఁ గల
త్రోవఁ గొనిపోవుగాత సంతోష మూని. 54

తే. గీ. అనుచు వానరయోధుల కగు తెఱంగు
విధుల నిర్ణయ మొనరించి వీరరాముఁ
డంత సుగ్రీవ లక్ష్మణు లాదరింప
నీలుఁ డూన దగిన రాజనీతిఁ జెప్పె 55

చం. లలిత మనోజ్ఞ సుందర విలాస వనీ ఫల మూలనీరముల్
వెలసెడి దారి మమ్ము గొను వేగమ శత్రు విధంబు నెంచుచున్
సలిలములందుగల్పెడివిషంబది చెట్లనుగుట్లనెక్కి మా
యలఁబచరించుచున్మన ప్రయాణనిరోధముచేయబూననౌ. 56

ఉ. మాయలమారి రాక్షసులు మార్గము నందవరోధ కృత్యముల్
చేయఁగవచ్చుఁ దంత్రములచే బ్రతిరోధము చేయవచ్చు వా

రే యవియైన దుష్కృతుల నెల్ల విధంబులఁ బూనవచ్చుఁగా
నీయవియే గ్రహింపఁదగు నేగెడి దారిని నీల ముందుగా. 57

తే. గీ. దారి శోధింపఁ జను చమూ తతులఁగూడి
ముందు నీవుండు, తన్మధ్య మందు నేను
లక్ష్మణు రవిసుతులఁగూడి రాఁగలాడ
పూను మిక యాత్ర సైనిక ముఖ్య! నీల! 58

ఉ. కొండల కోనలం దసుర కోటులు దాగి హఠాత్తుగా మహో
ద్దండ గతిన్ వనీ చరుల తండముపైఁ బడఁ జూతు రేమొ వా
రుండఁగలట్టి తావుల నెఱుంగగ నంబరమందు ముందుగా
దండిమగల్ కపుల్ చని యథాగతినింబరికింపఁ గాఁదగున్. 59

తే. గీ. అంగదుని మూపు పైన రామానుజుండు
హనుమ మూపున నేను బ్రయాణ మూను
వారలము సైనికులమధ్యఁ బరగుచుండి
యెల్లరకు గోచరింపంగ నెల్ల వేళ. 60

తే. గీ. ముందు వెనుకలఁ బ్రక్కలఁ జమూ చయంబు
కాపుఁ గాయుచునుండఁగాఁ గలుగు వీర
కపివరుల నిర్ణయించె రాఘవుఁడు భాస్క
రాత్మజుఁడు లక్ష్మణుల్ ముద మందు నటుగ 61

మ. అని రాముండాడఁగనర్క సూనుఁడు మహాహ్లాదంబునందోడ నే
పనిచెన్ నీలుని సర్వసైన్యములగూర్పన్ యుద్ధ యాత్రార్థమై
విని రాజాజ్ఞ వనీచరప్రతతివే విచ్చేసె తండంబులై
యనికిన్ రాఘవువెంటనంటనడిసం ధ్యంబెన్ని నాదంబులన్. 62

## యుద్ధయాత్ర

తే. గీ. అంగదుని మూపు లక్ష్మణుం డధివసింప
వాయుజుని మూపుపై రామ భద్రుడెక్కి

అర్కజునితోడ సైన్యమధ్యంబునందు
దశరథాత్మజు లలరంగఁ దరలె సేన. 63

తే. గీ. పొడమె నేల యీనినరీతి మూల మూల
లందు గుహలందు గొండల యందు నున్న
కోట్లకొలదిగ వానర కోటి గూడి
వెడలసాగిరి నీలుని వెంట నంటి. 64

సీ. వికసిత పుష్పముల్ వీచెడి గాలికి
శిరముల రాలి యాశీర్వదింప
సుమచయంబుల దేనె చూరఁగొనుచుఁ దుమ్మె
ద లొనర్చు మధురనాదంబు వినుచు
ఫలములఁ దేనెయు భక్షించి యాట పా
టలఁ దృప్తిమై రాముఁ దలఁచుచుండి
గుట్టల దాటుచుఁ బుట్టల నెక్కుచు
సెలయేళ్ల దూకుచుఁ జెలఁగు సేన
పల్లెటూళ్ల పయిన బడకుండ గపుల చే
ష్టల వీడి శాంతిగా జనెడి సేన

తే. గీ. కిలకిలారావముల సల్పి కెరలు చుండి
రామచంద్రుండు మధ్య విరాజిలంగ
దక్షిణాభిముఖంబుగఁ దరలె సేన
శీఘ్రగతి రావణుని జంపు చిత్త మలర 65

తే. గీ. నేనె చంపెద రావణు నేనె చంపు
వాడ ననుచు నొండొంటితోఁ బంత మూను
చుండి త్వరితగతిని, గోతి దండు వెడలె
రామచంద్రుండు హర్షించు రాము దండు. 66

సీ. మెల్లఁగాఁ జల్లఁగా మెయి సోకి యనిలుండు
వీచుచుండెను శుభ సూచకంబు

మేఘావృతుఁడుగాక మేదిని వెలుగొందు
సూర్యుండియ్యది శుభ సూచకంబు
మృగ పక్షి సంచార మృదుమధుర ధ్వని
శోభించుటయు శుభ సూచకంబు
మనవంశనక్షత్ర మా విశాఖయుఁ బరి
శుద్ధమై నది శుభ సూచకంబు

తే. గీ. స్వచ్ఛజలఫలపూర్ణమై వరలు వనము
వెలయు ఋతుధర్మముల వృక్ష వితతి యెల్ల
పూలు గుబాళించు గంధంబు గాలి గూడి
అన్ని శుభసూచకంబులే యవని దోచు. 67

తే. గీ. రాక్షసుల తార మూలయో రహి దొలంగి
ధూమకేతుస్పర్శను గడు దుష్టమయ్యె
అవనిజను బొందగలవు శుభావహమ్ము
రావణుని జంపెదవు రఘురామచంద్ర. 68

తే. గీ. అనుచు నంగదు మూపుపై నధివసించి
పలుకు తమ్ముని మాటల లలితమూర్తి
దాశరథి విని ముదమున దనరుచుండె
సైన్యమధ్యంబునందు ప్రశాంతవృత్తి. 69

తే. గీ. భూమి నాకాశముల నిండి పోవు సేన
రవిసుతుని పాలితంబయి రాత్రిఁ బవలుఁ
బయనముం జేసి పోయెడ ప్రమద మొప్ప
నాసురుని జంపు నుత్సాహ మతిశయిల్లి. 70

మ. వివిధానేకతరు ప్రసూనలతలన్ వీక్షించుచున్ దాటుచున్
జవమొప్పన్గిరులన్ నదీనదములన్ సహ్యాద్రినిన్మీరి, రా
మవిభుంగూడి మహేంద్రపర్వతము తేమంబొప్పగా జేరె నా
రవిసూనుండునుసైన్యమెల్లయునుసంద్రంబుండుతావుప్ వడిన్.

## సముద్రతరణము

తే. గీ. నీరజాక్షుండు రాముండు నీరనిధిని
జేరి, తరు లతా గుల్మ పుష్పిత శోభ
రాజిలు మహేంద్రగిరి శిఖరంబు నెక్కి
దుర్నిరీక్ష్య గభీర సింధువును జూచి. 72

తే. గీ. లక్ష్మణుండు నర్కసూనుండు రాగ వెంట
గొండ కొన వీడి దిగి తన కోతి సేన
విడిది సేయంగ వనమందు వీర వరుఁడు
కడలి దాటెడి మార్గంబు గనఁ దలంచె. 73

ఆ. వె. కాంచి యర్క సూను గడలి దాటఁగ నీవు
మున్ను దెల్పి నట్టి తెన్ను నేడు
తలఁప వలయు నింక దారియు తీరంబు
లేదు దీని దాట లేరు కపులు. 74

గీ. ఎవ్వడేను సేన వీడుచు నెచట కేని
బోవఁగా రాదు వైరులు పొంచి యుండి
ఛిద్రమొనగూర్ప నెంతురు సేన నెల్లఁ
గాయ యోధు లెల్లెడఁ దిరుగాడ వలయు 75

తే. గీ. త్రివిధ సైన్యంబు జలనిధి తీరమందె
విడిదిగా నుండె, నెలుగులు వేరు చోట
కొండ ముచ్చులు వానర కోటి వేరు
వేరు తావుల గుంపుగా జేరినారు. 76

తే. గీ. పాదచారిగ నడవిని బట్టి రాముఁ
డరుగు దెంచుట వాని పదాబ్జ సీమ
నుబ్బి నువ్వెత్తుగ తఱగ లొప్పి పడుచుఁ
గడుగుచుండిన రీతిగా గడలి యొప్పె. 77

తే. గీ. ముత్తెములతోడ రాఘవు పూజఁబూనె
గడలి, యను రీతి ఫేనంబు గాలి కెగిరి
తెల్లనౌ దాని కణముల ఁజల్లుచుండె
రాఘవు పదాబ్జములమీద రహిఁ జెలంగ. 7

తే. గీ. గాలిచే కొట్టబడి కొండఁ గలియఁ జూచు
పెద్ద కెరటాలు సవ్వడి ప్రేమ మీర
రాముఁ గీర్తించుచుండె సంభ్రదంబనంగ
వలరుచుండెను భీకర మయ్యు రవము. 7

తే. గీ. భయము వలదయ్య రాఘవా భయ మదేల ?
యనుచు నావ్హాన మిడు రీతి నబ్ధినున్న
తిమి తిమింగలమృగసంతతి పెస నలల
పైన నడయాడుచుండెను వారినిధిని. 8

తే. గీ. నీల మేఘావృతంబగు నింగి యలల
నాకులంబగు జలధియు నేకరీతి
గాగఁ దోచుచుండంగ నా కపి చయంబు
సంతసము భయంబుల గనె సాగరంబు. 8

తే. గీ. మైందుడు ద్వివిదు లప్పు డేమరక సేన
నంత గాయుచుండంగ రామాజ్ఞ బట్టి
రాఘవుఁడు లక్ష్మణుంజూచి రమణిఁదలఁచి
యాతురతఁ జూపె దాటఁగా నబ్ధి నంత.

రాముని యాతురత

చం. విడిచి సమస్తసౌఖ్యముల వీడుచు వీటిని నత్త మామాలన్
విడుచుచు దండ్రి నాథు వెనువెంటను గానకు సీత వచ్చి యీ
యడవిని నన్నుఁగూడ విడి నాసురలంక వసించుచుండెగా
ఘడియయుగంబుఁగాఁ గడుపుకాంతనుగాంచుట యెన్నడో కదా

చం. తనదు పతివ్రతా మహిమ దగ్ధము సేయక నోర్చి రావణున్
వినయము భక్తి మీరహృదిపీడకనన్నె తలంచి యాశరున్
దునుమగ నానిమిత్తముగ యోపికఁ బూనుచు వేచియున్న సీ
తనుగనకుండనేనిటుగఁదాల్మివహించుటయెంతకాలమో? 84

చం. అరిని జయించి సీత జలజాక్షిని, లక్ష్మిని గూడు రీతి నే
నరయుట యెన్నడో? దశరథావనిపాలుని కోడలయ్యు భూ
వర జనకాత్మజాతయయి భార్యగ నయ్యును నా కహో నిశా
చర వనితాసమూహమగచాట్లకు లోనొనరింప నుండెగా. 85

తే. గీ. కాల వైపరీత్యంబును గాంచి మనుచు
సహజ కృశదేహయె యుపవాసంబు లూని
దుఃఖ భరిత మనోవృత్తి తోడ సీత
యిప్పు డెటులున్నదో కననెప్పుడో కద ! 86

తే. గీ. కఱకుటమ్మున దైత్యు వక్షంబుఁ గొట్టి
ఆ శరత్కాల నీల మేఘావృత శశి
బయట పడునట్లు దైత్యుల బారినుండి
సీత నేనాడు తప్పింపఁ జేయఁగలనో ! 87

తే. గీ. మలిన వస్త్రంబు విడనాడు మాదిరి నిక
జనకజను పీడఁ గను నార్తి చనుట యెపుడో
విడుచు దుఃఖంబు కాలంబు గడువ కాని
యతిశయించుచునుండె నా కార్తి యింక. 88

తే. గీ. అనెడి రాఘవ రాముని యన్నఁగాంచి
లక్ష్మణుండూరడించెడి రవియు నంత
నస్తమింపంగ వందన మాచరించె
సంధ్యఁగని రాఘవుండంత సకల విదుఁడు. 89

## రావణ మంత్రాంగము

ఉ. ఉండఁగ రాముఁ డా కడలి కుత్తర తీరమునందు నిట్లువానరో
ద్దండ బలంబుఁగూడియట దైత్యవిభుండు సముద్రయామ్యమం

దుండి నిశాచరప్రతతి నొప్పఁగఁగూడి వచింపసాగె, రా
ముండు రణంబు సల్పఁ గపి పుంగవులంగొని వచ్చుచుండుటన్.
కొలువు దీర్చు మంత్రి కూటంబు హితులును,

ఆ.వె. బంధు పౌర ముఖ్య వార యుతుఁడు
దైత్యరాజు పలికె దైత్యుల నెల్లరఁ
గనుచుఁ గాఁగలట్టి కార్య మెంచి. 91

చం. కనిరిగదా మహేంద్ర సమకాంతు మహాత్ముఁ బ్లవంగ ధీరునిన్
హనుమను నీపురంబు వని నంతయు నాశన మొందఁజేసె జం
పెను మన రాక్షసోత్తములఁ బెంపగు లంకను గాల్చె సర్వమున్
జనకజఁ గాంచి క్షేమముగఁ జయ్యన నేగె యొకండు కోతియే

చం. మన మిక నేమి సేయఁదగు మానక మీరు వచింప గాదఁగున్
గను విజయంబు మంత్రము సకాలమునందొనరింప నంచు వా
కొనిరిబుధుల్ రఘూత్తమునిగూర్చిన మంత్రము జేయబూనితిన్.
గనవిజయంబునే మనము గాంచెడి రీతి వచింపఁగోరెదన్. 93

తే. గీ. మంత్రమునఁ జేయఁ బూనిన మహిత కార్య
మేదియైనను సిద్ధించు నెట్టి యెడల
నంచుఁ బెద్దలు మున్నాడి రటుగ నేడు
మిమ్ము గోరెద యోజింప నెమ్మి మీర. 94

చం. హితమతులై సుఖాసుఖము లెప్పుడు పాల్గొను బంధు మిత్రసం
తతి బుధకోటి మంత్రులును దప్పక యోజన చేసి దైవమున్
సతతము లోఁదలంచి కృషి సల్ప జయంబని విజ్ఞు లాడరే
గతముఁ దలంచి ముందు గల కార్యవిధానము దెల్పఁగోరెదన్.

చం. పురుషుల నెంచగాత్రివిధముల్ గద ఉత్తమ మధ్యమాధముల్
జరుపునుమంత్రమున్ బనులసల్పుటకున్ మునుముందెయుత్తముల్
నెరపడు మధ్యముండుతననెయ్యులతోడుతమంత్ర మెప్పుడున్
స్థిరమతిలేక నిల్పుపని జేయుచునా యధముండుమధ్యలో. 96

తే. గీ. మధ్యముఁడు భారమును దైవమందు బెట్టి
స్వీయ శక్తిని గార్యంబు సేయ నెంచు

నధముఁడు తనంతగా కార్య మాచరింపఁ
బూని మధ్యలో విడు యత్నమునె తలంప
దైవమును మంత్రమును గూడ దలఁపడతడు. 97

తే. గీ. మూడు రీతుల మంత్రముల్ గూడియుండు
మధ్యమాధమయుత్తమంబనఁగ నవియు
మంత్రులందఱు నేకమై మంత్రమూన
శాస్త్రరీతినుత్తమమంత్రసరణి యగును. 98

తే. గీ. సచివులు పరస్పర విభేదసరణి నుండి
చివర కేకమై మంత్రంబు సేసిన యది
మధ్యమంబగు మంత్రంబుమంత్రు లేక
మతిని నిర్ణయింపగలేని మంత్ర మధమ
మన నొప్పు వీనిఁ దలఁచి మనఁగఁ జెల్లు 99

ఉ. దానవ శాస్త్ర సమ్మత విధానము మీ రిపు దైకమత్యముం
బూనుచు సంప్రదించి మనపూనికఁ దెల్పఁగఁ గోరుచుంటి న
ద్దాని గ్రహించి వర్తిలెద దానవ కోటి జయించు రీతి నా
మానవ నాథుఁ డాలమును మానకఁ జేయఁగలాడు లంకలో.

ఉ. వచ్చుచునున్నవాడు రఘువర్యుఁడు వానర సేన యుక్తుఁడై
హెచ్చు బలంబుతోడుత గపీంద్రుని లక్ష్మణుగూడి నీరధిన్
స్వేచ్ఛఁబరాక్రమాన్వితుఁడువీరుఁడురాముఁడుదాటి లంకలోఁ
జొచ్చెడినాడు దానవులు క్షోభఁ దపింపని రీతి దెల్పుడీ. 101

తే. గీ. జలధి నింకింపగాఁగల శక్తియుతుఁడు
కాక సేతువునైనను గట్టగలఁడు
రాముఁడు పరాక్రమంబున రాగలండు
నిశ్చయంబిది లేదు సందేహ మేమి. 102

ఉ. రాముఁడు వచ్చుచుండె మనలంకయు సైన్యము మీరలెల్లరున్
క్షేమముగాగనుండుటకుఁ జెప్పుడుపాయమొకండు యోజనన్
నే మిము గోరుచుంటినిదినిర్ణయ మూని వచింప ముందుగా
నేమము నీతి క్షేమములనే తలపోయుచుఁ దెల్పఁగోరెదన్ 103

తే. గీ. అనుచు సిగ్గున తలవంచి యసుర నేత
సభ్యులను గోరె మంత్రంబు సలుప వార
లంత దైత్యేశుని పరాక్రమాతిశయము
నుగ్గడింపంగ బూనిరి బిగ్గరగను. 104

## సభ్యుల ప్రగల్భములు

చం. విజయము నీయదే సకల వీర రణంబుల దానవేశ్వరా
విజయము పొందియుండవె కుబేరునితో నొనరించి యుద్ధమున్
విజయము పొందికై కొనవె విశ్రుత వాయువిమాన రాజమున్
విజయుఁడవౌచు నాలముల వీడఁగఁ జెల్లునె ధైర్యముం బ్రభూ!

చం. హనుమ నుపేక్షసేయుటనె యాతఁడు దగ్ధమొనర్పఁగల్గెలం
కను మన సైన్యముందునుమఁ గల్గెను దానిఁ దలంచి వాని కో
తిని గడు గొప్పగాఁబలికెదేల? నిశాచర కోటిఁ గోతులా
దునుముట ఖడ్గ శూల గదతుల్యము లేవియు లేవెవారికిన్. 106

శా. పాతాళంబున కేగి యుద్ధ మొనరింపంబన్నగుల్ లొంగరే
ఖ్యాతిం గాంచవె యింద్రునిన్గెలిచి వీకం గాలకేయాదులున్
నీతో పోరి యొకండు వత్సరము నెంతే శక్తిమై పొందియున్
ధాతంగొల్చి వరంబులన్ దుదకు మిత్తుల్ గాగ నర్థింపరే. 107

ఆ. వె. యుద్ధమందు మధువు నుద్ధతిఁ బరిమార్చి
వశుని గాఁగఁగొనవె వైర మాపి
దానవపతి మయుఁడు తనదు మండోదరి
సుత భయమున నిడఁగ సతిగఁ గొనవె. 108

తే. గీ. వరుణ పుత్రులఁ జతురంగ బల సమేత
శూరు లనని జయింపవే ధీరుఁడ వయి
యమునితో గూడఁ బోరి జయంబుఁ గనవె
రాజుల బలులఁ జంపవే రాక్షసేంద్ర. 109

తే. గీ. అష్టదిక్పాలకులనీవ యనిని గెల్చి
దివిని, పాతాళముల గెల్చి తేజుఁగలిగి

మూఁడులోకాలసేనలేని వాఁడవయ్యు
నొక్కనరుసెంచియింతఁగా యోజనసుహా! 110

వరభూపాలురఁ జెక్కుమొందిని జయుంపంగల్గియున్ నీవ యీ
నరు శ్రీరామునిగూర్చి భీతిబుటమున్ నాశంబుఁగన్నట్టి యా
మ. ధరణీనాథులకంటె రాముఁడు బలాఁడా? తా నంత వాడైన వా
నరసైన్యంబు సహాయముంగొనుచు చింతన్ వీడు దైత్యేశ్వరా

తే. గీ. నరులు నిను జంప లేరను వరము లేమి
రాముఁ దలపోసి లోవిచారంబుఁ గనుటె
అంతటి ఘనుండు కాడు రామయ్య వినుము
నీవె విజయుండ వౌట సునిశ్చితంబు. 112

తే. గీ. ఇంద్రుఁ బట్టి తెచ్చినవాఁడె యింద్రజిత్తు
చాలు రాముని వానర సైన్యమునకు
రూపు మాపి వారలనిన్ను పురంబు
మమ్ము నెల్లరఁ గాపాడు సుమ్ము యతఁడు. 113

ఉ. మూఁడు జగంబులందునినుబోలినవాఁడెవఁడయ్య నాఁజిలో
నీడగునే సురాసురలు నెవ్వెడ వారి జయించినావుగా
వీడు నరుండు రాముఁడును వృత్తపదాళియు సప్తి దాటఁగా
బోడిమిఁగల్గియున్ననిఁ బోఁగలాఁరె శయంబువీగుమా. 114

తే. గీ. అనుచు సభ్యులు కొందఱం దసుర నేత
వినగ మూర్ఖులై శాత్రవవీర బలము
గణన సేయక దైత్యేశు గర్వ ముబ్బఁ
బ్రమద మొప్పఁగఁ గేల్ మోడ్చి పలికి రంత. 115

ప్రహస్తుఁడు

తే. గీ. దేవ దానవ గంధర్వ ధీర వార
మెవ్వరేగాని పోరి జయుంపలేరు
నిన్ను రాజ! వానరు లెంత? నీ కటంచు
నంత సైన్యనాయకుఁడు ప్రహస్తుఁ డనియె. 116

చం. మనల జయించు నెవ్వరను మత్తుననుంటిమి రాముదూత ఆ
హనుమ;తటాలునంబురము నంతయు కాడొనరించి వెంటనే
జనె నిది యంతకున్ మన నిశాచర కోటియె వీలొసంగె నే
దునిమెడివాడఁ బ్రాణములతోఁ జననిత్తునె వాని జీవిగా. 117

ఉ. కానన సీమలందు తరుకాండములన్ గుహలందు కొండలన్
వానర జాతి నెల్లయును బట్టి వధించెడివాఁడ బంపుమీ
వానరుఁజేత లంక కడుఁబాడయె నీ యవమాన భారముం
బూని సహించు టెట్లిక సమూలము వానరజాతిఁ ద్రుంచెదన్.

తే. గీ. భూమి నాకాశమందునఁ బుడమి క్రింద
నేడ దాగినఁ గోతుల జాడఁ దీసి
యేనె వేటాడు వాడ రాజేంద్ర! వినుము
భయము పడనేల కోతులవలన మనము. 119

తే. గీ. సీత హరియించినట్టి నీచేతవలనఁ
గీడు గలుగదు లేశంబుఁ గ్లేశ మేల?
వానరులచేత కీడేమి పట్టు నీకు
కాపుఁ గాసెద నేనె లంకాపురంబు. 120

దుర్ముఖుఁడు

తే. గీ. అని ప్రహస్తుండు పలుకాడు నంత దుర్ము
ఖుండు తన్ను బంపిన గపి కోటి నెల్లఁ
జంపి వచ్చెద నెటఁదాగ జావకుండ
మూడు లోకాల గాలించువాడ నేను. 121

తే. గీ. వానరుడొకండె మన పురి వల్లకాడు
గాగఁజేసె నీ యవమానమే గతి సహి
యింప గాదగినది భరియింప లేము
హనుమఁ బోకార్చువాడ నేనరుగువాఁడ. 122

## వజ్రదంష్ట్రుఁడు

తే. గీ. రక్తసిక్త పరిఘుఁబూని రావణుఁ గని
వజ్రదంష్ట్రుఁడు బలశాలి పలికె నంత
దొంగవలె వచ్చి పోయిన భంగి హనుమ
రాత్రివేళను బురిఁజొచ్చి రభసఁ జేసె.
వాని తలపేల దుర్ధర్షులైనవారు
రామ లక్ష్మణ సుగ్రీవులఁ దలఁపఁదగు
నొక్కడనె పోయి నవ్వారి నుక్కడంచి
చంపి వచ్చెద నన్నింకఁ బంపు రాజ! 123

ఉ. రాముఁడు లక్ష్మణుండుఁ గపిరాజును మారుతికండదండయై
ఆ మహిజానిమిత్తముగ నంపిరి వారిఁ దలంపకుండ శా
ఖామృగమొండు రేల పురిఁ గాలిడి యల్లరిఁజేసిపోయె నే
లా మన మింతగా నతని యార్భటులం దలపోయఁగాదగున్.

తే. గీ. రామ లక్ష్మణు సుగ్రీవరాజు లబ్ధి
కవలి గట్టున నున్నారు గాన వారిఁ
జంపగానగు నేఁబోయి చంపివత్తుఁ
బంపుమీ నన్ను రాజేంద్ర భయమదేల?. 125

ఆ. వె. పోరు లేక వారి బోకార్చు విధమొండు
జెప్పువాడ నీవు చేయనున్న
దగునె యెల్లయెడల దండనోపాయంబు
సామ దాన భేద సరణి గనుము. 126

ఉ. మాయకు మూలమైన మనమా రిపు చేతికిఁజిక్క బోవుటా
మాయను బూని సైనికుల మాదిరి దైత్యులు వీడి దండనో
పాయము కైకపుత్రకుఁడు పంపఁగ వచ్చిన రీతిఁగాగ వే
పోయి చమూసమూహగతిఁబోందుగ రామునిఁ జేరగావలెన్.

చం. భరతుఁడుపంపె మమ్ము రఘువర్యుఁడతోడ్కొని రాగనిన్ను నీ
పురి నుదయించె నీవె సరిపుచ్చెడి కార్య మదేమి యంచనన్

భరతుఁ దలంచి రాఘవుఁడు పట్టణ మేగగఁ బూనునంత వా
నర భటకోటులన్ విడిచి నాడట గోతుల నెల్లఁజంపనౌ. 128

చం. అసురవిభుండ కూర్పదగు నాసుర మానుష వేషధారులన్
బస రణరంగమందు నిలువంగల యోధుల శౌర్యవంతులన్
వెస రఘురాముఁ జేరి నరవేషముఁ బోల్చగ రాని నీతితో
గుసగుసలాడకుండఁ గడుఁగోడున మాటల నాడువారలన్. 129

ద్వి. ఇటనుండి మేమంత నేగుచు దివిని
యట నిల్చి చంపెద మా కోతి మూక. 130

ద్వి. ఈమాట వినునంత నేసంకటపడి
రాముండు భ్రాతతోఁ జనియెడి దివికి. 131

నికుంభుఁడు

తే. గీ. కుంభకర్ణ పుత్రుండు నికుంభికుండు
రావణుని లోకరావణు రాక్షసేంద్రుఁ
గనుచు మీరెల్ల రిటనె సుఖాన మనుడు
నేనె చని వారిఁ బరిమార్చనే రణాన. 132

వజ్రహనుఁడు

తే. గీ. పర్వతాకారుఁడగు కోపి వజ్రహనుఁడు
నోరు నాకుకొనుచును నోరూరఁబలికె
నేనె చని వారి భక్షింతు నింత యేల
మీరు మీమీ పనులలోన మెలఁగు డిచట. 133

నికుంభాదులు

కం. అనుచున్ సఖ్యులు పలుకఁగ
వినుచున్ నికుంభాదులుఁ గడు వీరులు వేవే
గొని రాయుధముల్ సంగర
మున కపుడే చనఁగఁ గోపమూర్తులు గాగన్. 134

ఉ. అందు నికుంభుఁడింద్రజితుఁడారభసుండు ప్రహస్తుఁ డాది వా
రందఱు లేచి రాజుఁగని ఆహనుమంతు వధింపనెంచుచుం

జిందులు ద్రొక్కుచుండ గని చెచ్చెర సాధు విభీషణుండు వా
రందఱినున్ బ్రశాంతులగు నట్టులఁ జేసి సురారి మ్రొక్కుచున్

విభీషణుఁడు

ఆ. వె. సామ దాన భేద సరణి విడి తొలుత
దండనంబె తలపఁదగునె రాజ
వైరి యెడల నెప్పుడెట్టి యుపాయంబుఁ
బూనవలెనొ యెఱిగి పూనవలయు. 136

తే. గీ. ఎవ్వఁడు ప్రమత్తుఁడై యుండు నెవని శత్రు
తతులు చుట్టుముట్టుచునుండు దైవమరయ
నెవనికిఁ బ్రతికూలమొ వాని నెంచి నీతి
శాస్త్ర విధి దండనముఁ బూన సఫలమగును. 137

ఉ. రాముఁ దలంపరాదటుగ రాఘవుఁ డేమరుపాటు లేని యు
ద్దామబలుం డకాలము నితాంతము రోషము బూనకుండు నా
రాముని మార్కొనం దలతురా? యదిమంచితలంపె దైవమున్
రాముని పట్టునే గలఁడు రాక్షసులార గనంగ నోచరే. 138

చం. కని వినియుంటిమో మన మొకానొకకోతియె యబ్ధిదాటిలం
కను గనెగా మహోదుత్భముగాదె సురారిపురంబునందెగా
దునిమె నిశాచరప్రతతిఁ దోరపు లంకనుగూడఁగాల్చి పో
యెనుగద చాలు దైవము వహించెను రాముని పక్షమంచనన్.

చం. హనుమ యొనర్చినట్టి పని యద్భుతమే కద ! అబ్ధిదాట నె
వ్వనికగు నిట్టి చేతఁదలఁపంగను సాధ్యమె దానిచేత రా
మునికె లభించు దైవబలమున్ గమనింపుము వైరమూపుమీ
జనకజ నప్పగింపు రఘుచంద్రునకున్ శుభమెంచి యన్నరో !

తే. గీ. అరిబలపరాక్రమము నెంచ నలవి యగునె
కొలఁది సేయుచు మాటాడఁ దలఁప రాదు
సీత హరియించి తెచ్చిన చేత మీకు
నా కెటుగ సమర్థింపనౌ సోకులార ! 141

మ. అపకారంబు ఖరాదులన్ దునిమి చేయన్ మారుగా రావణుం
డపకారంబొనరింప రాఘవుని భార్యం దెచ్చె నంచందురా
అపుడున్ ముందుగయుద్ధమూనె ఖరుఁడేయాలంబుఁగావింపరా
రిపునిన్ జంపుటయాత్మరక్షమెయి నేరీతిన్ మహాదోషమౌ. 142

మ. పరదారాగమనంబు కీర్తి చెఱుపున్ బాపంబె ప్రాప్తించెడిన్
సిరిదూరంబగు నాయువుందరిగెడిన్ శీఘ్రంబుగా మృత్యువున్
దరి డాయుంగద రామమూర్తికిడి సీతన్ వెంటనే వైరముం
బరిమార్పందగు వైరకారణము బోవంజేయుమీ అన్నరో.

తే. గీ. రాముఁడు విజిగీషువుగఁడు భీమ బలుఁడు
ఆ దురాధర్షు నెదిరింప నలవిగాదు
అట్టివాని మార్కొను దల పెట్టు లొదవె
అన్న ? అర్పింపుమీ సీత నామె పతికి. 144

ఉ. ప్రాకటవైభవాన్వితము భద్రగజాశ్వరథప్రయుక్తర
త్నాకరలంక రాముఁడు భయానకబాణపరంపరాశిచే
దాకి నశింపఁజేయుట యె తథ్యము తద్గతి రాకముందె నీ
వాకమలాయతాక్షి నిక దాశరథికున కప్పగింపుమీ. 145

తే. గీ. సుఖము ధర్మమ్ము రెండింటి స్రుక్కఁజేయు
కోపమును వీడుమీ దైత్య భూప! యింకఁ
గీర్తి నిరతి వర్ధిలు ధర్మమూర్తివగుచు
నప్పగింపుము మైథిలి నామె పతికి. 146

## మంత్రులతో మంత్రాంగము

కం. తన మంత్రులతో మందిర
మున మంత్రాంగమ్ము దనుజ భూపతి సలుపన్
విని మరుదినమున వెడలెను
ననుజుండు విభీషణుండు నటకున్ మరలన్. 147

తే. గీ. ఉదయకాల శంఖ ధ్వను లొప్పు వేళ
మంగళధ్వానములు సౌధ మంత నిండ

మేఘములఁ జొచ్చు రవివోలె మేనఁ గాంతి
నా విభీషణుం డేగె నన్న కడకు. 148

తే. గీ. పూజలును హోమములు మంత్రపూర్వకముగ
రావణ విజయార్థమ్ముమై ప్రబలుచుండ
వేద ఋక్కులు వినుచుండి విమల గతిని
హర్ష చిత్తుండునై కనె నన్న నంత 149

మ. నవరత్నద్యుతి దిక్కులంబ్రబల సౌందర్యప్రభల్ చాటుచున్
దివినంలుంజనుచున్నదా యనెడి రీతిన్ వెల్గు దైత్యేశు సౌ
ధవరాంతఃపురిలోవిభీషణుఁడుసద్ధర్మార్థమాయన్నకున్
వివరింపన్ జని సింహపీఠి నతనిన్ వీక్షించుఁ జేమోద్భవన్. 150

తే. గీ. సంప్రదాయానుసారంబు జయము పలికి
అన్న కనుసన్న జూపిన యాసనంబు
గొనుచు సచివముఖ్యులె గల గూఢసభను
అన్నగని విభీషణుఁడాడె నమితభక్తి. 151

చం. అవనిజఁ బట్టి తెచ్చిన తదాదిగ నీపురి నెల్ల తావులం
దవశకునంబులే గనఁగ నయ్యెడి చూడుము దుర్నిమిత్తముల్
భువిధవ ! సర్వసౌఖ్యములఁ బొందుచు నవ్వి నశించురీతిగా
నెవరుచరింపనెంతురిల?నించుక యోజన సేయుమన్నరో! 152

## దుశ్శకునములు

సీ. మంత్రానుసారహోమాగ్నిహోత్రములు జ్వ
లింపవుగద ! పొగ లేచుచుండె
అగ్నికుండముల వేదాధ్యయనస్థలి
వంటయిండ్ల నహులు బఱగుచుండె
విమలహోమార్థహావిస్సునఁ జీమ లె
క్కుచుఁ బ్రాకి నద్దానిఁ గుడుచుచుండె
మదపుటేనుగులన్ని మదవిహీనలు గాగ
గోవులు పాలీయకుండ నెండె

తే. గీ. అశ్వముల సకిలింపులు నరిది యగుచు
దీనముగనుండెఁ దగినంత తిండి తినమి
లొట్టిపిట్టల ఖరముల రోమచయము
తడిసి కన్నీట రాలెడు దానవేంద్ర ! 153

తే. గీ. కాకులును గుంపుగుంపులై కారవంబు
సెకతెగక సల్పుచుండిన వెల్లయెడల
ఆ విమానపు గొనల వాయసచయంబు
సంచరించుచు నిలిచెడి సతతమెంచ. 154

తే. గీ. గద్ద లింటింటిపైనను గములఁగూడి
నిలుచుచున్నవి తిరుగాడి వలయముగను
ఉభయసంధ్యల నక్క లశుభమె దెలుప
నఱచుచున్నవి పురిచుట్టు నసురనాథ ! 155

తే. గీ. కుక్కలును గ్రూరమృగములు గుంపులౌచు
బిడుగుమ్రోతగఁ బట్టణ వీథులందు
ద్వారములచెంత నఱచుచు ధ్వనినొనర్చి
తిరుగుచున్న వమంగళ స్థితిని దెలుప. 156

ఉ. కానగఁజాలమైతి మివి కాంతలుఁ బౌరులు నెల్లవారికిన్
గానఁగనయ్యె దుశ్శకున కాండము మంత్రులు నీభయంబుచేఁ
బూనరు వీనిఁదెల్పుటకుఁ బొందుగ విన్నది కన్నదంతయున్
నేనె వచింపఁ బూనితిని నీకనుజుండను గాన నన్నరో! 157

తే. గీ. మోహలోభవశుండవై పుడమిఱేఁడ !
పలుకుచుంటిని తప్పను బట్టవలదు
కీడు రాకుండ ముమ్ముందె చూడవలయు
సీత గొనిపోయి రాఘవు చేతఁబెట్టు. 158

కం. ఇదియే ప్రాయశ్చిత్తము
మది నెంచుము మంచిఁజెడుగు మాన్యా ! విను మీ
విదితంబగు కర్తవ్యం
బిది రామున కిమ్ము సీత నీవే భక్తిన్. 159

చం. అనుచు విభీషణుండు పలు కాడెను మంత్రుల మధ్య నన్నకున్
దనుజుల కేనికిన్ హితము దైత్యవరుండు త్రి[illegible]ధర్మ మా
యనుజుఁడు దెల్పఁగా వినఁడు నాలన పాలన సేయఁబోఁడు, త
మ్ముని నుడికంతఁ గోపమును బొంది వచించెను [illegible]ట్టుపట్టుమన్

## విభీషణహితతిరస్కారము

ఉ. సీత మదీయహస్తమునఁ జిక్కిన దానిని రాఘవుండ[illegible]
చేత గ్రహింపఁగల్గునొకో చెంద భయంబొక యింత[illegible]యే[illegible] నే
సీతను నొప్పగింప సురసేవితుఁడై దివిజాధి[illegible]ండును[illegible]
భూతలి రామునింగలిసి పోరి జయింపఁగలాడె నన్ననిన్. 161

తే. గీ. అని గభీరముగా మారు వినక యంత
సురల సైన్యవినాశన శూరవరుఁడు
చండవిక్రమబలుఁడు దశాననుండు
పలికి సెలవిడి తమ్ముని[illegible] బంపి వే[illegible]. 162

## రావణుని కొలువు

తే. గీ. సచివులును బ్రహస్తుఁడును విభీషణుని మాట
కాదనక వినియుండుటఁ గాంచి వీడు
వారుగూడ విభీషణు దారివారె
యనుచు దలపోసి చింతించు నాత్మయందు. 163

తే. గీ. సతము మైథిలీకామమోహితుఁడు మఱియు
సీత నిడుమను మాటయే చెవిని సోక
దురితకృతివల్ల దైత్యనాథుండు మిగుల
నాత్మఁ గృశియింప సాగుచు నంత కంత. 164

కం. వీరుల ధీరుల సచివుల
పౌరులఁ బిలిపించి తనకుఁ బట్టైయుండన్
గోరఁగ మఱునాడే కొలువు
దీర్చి పలుకాడఁదలఁచె తేకువతోడన్. 165

ఆ. వె. తప్పొ యొప్పొ చేసి తదుపరి చింతింప
నేల యనుచు నాసురేశుఁడంత
స్వీయకృతికి బలముఁ జేకూర్చుకొననెంచి
కొలువు దీర్ప మదినిఁ దలఁచి తలఁచి. 166

ఆ. వె. ఏని పిలుపు వినుచు దానవ పౌరులు
కొలువుఁ జేరినారు క్రొత్తదైన
మయవినిర్మితంబు మహితమందిరమున
వేనవేలుగూడి యేనిఁగనిరి. 167

తే. గీ. సకల సుందర నవరత్న సంయుతంబు
బహువిశాలంబు నేత్రపర్వంబునైన
మయ వినిర్మిత నూతన మందిరంబు
రావణుని సభాస్థలంబు రహిఁ జెలఁగు. 168

ద్వి. అమాలాతపత్రంబు నలరారుచుండ
విమల వింజామరుల్ వీవంగ భటులు. 169

ద్వి. జయ జయ రావణ జయము జయంబు
భయ విదూరణ దైత్య పాలక జయంబు. 170

ద్వి. జయ మరివీర భంజన వీర జయము
జయము లోకత్రయీ జయ జయంబు. 171

తే, గీ. అను నినాద ప్రతిధ్వాన మలరుచుండ
రత్నసింహాసనంబున రాక్షస పతి
షష్ట శత పిశాచంబులు సభను గాయ
సుందరంబగు నా సభ జొచ్చియుండె. 172

సీ. కనకాసనంబులఁ దనరారుచుండిరి
ప్రముఖులు కొంద ఱా రాజసభను
దనుజులు శ్రోత్రియుల్ దర్భాసనంబుల
నాసీనులై యుండి రపుడు సభను

భూమి సుఖాసనం బుగఁ గూరుచుండిరి
పౌరులు కొంద ఱా ప్రభుని సభను
ఆ సురాధిపు నాజ్ఞ నా యా యథోచితా
సనముల గొందఱు గనిరి సభను

తే. గీ. సచివముఖ్యులు సర్వజ్ఞ శాస్త్రవిదులు
కార్యనిర్ణయ దక్షులు కార్య నిర్వ
హణ విశారదులుఁ గల రా యాసుర సభ
రాక్షసేశు సమీప స్థలంబునందు. 173

తే. గీ. ఆ విభీషణుండు శుక ప్రహస్తులంత
నరుగుదెంచి ప్రవరఁ జెప్పి యర్హ రీతి
నసురపతియాన నాసీను లైరి సభను
సభ్యులెల్లరు గని వారి సంతసింప. 174

ఆ. వె. సభను బురిని జనుల సైనిక బృదంబు
రక్షసేయ ననిచి రాజు నాన
ఆ ప్రహస్తుఁడటుగ నాచరించితి నన
వినయ మొప్ప ముదము గనిరొ ఱేడు. 175

తే. గీ. అసురావళి మై లేప నాదులు సభఁ
బరిమళించుచు గడుఁగడు వ్యాప్తి గాఁగ
సభ్యులను గాంచి పలుకాడె సరస గతిని
ముందుగల కార్యభార మపూర్వ గతిని. 176

ఉ. పరును గట్టిగా బలుక రెవ్వ రసత్యము నాడఁబోవ ర
వ్వారలు దైత్యకోటులు సభాంతరమందు నయప్రధానులై
ధీరత సర్వసిద్ధులయి తేకువ నుండిరి వారిమధ్య నా
వీరుఁడు దైత్యనాథుఁడు దివిన్ సభలోఁగల నింద్రు వోలెడిన్.

కం. తన సభఁ బరికించుచు నా
దనుజేశుఁడు రావణుండు తడయకఁ దమిమై
మనసును విప్పుచు నొనరిం
చిన కృతిఁబలుకాడె సిద్ధి చేకూరు గతిన్. 178

తే. గీ. ధర్మ కామార్థముల నేది తగునో పొంద
నరసి, సుఖము దుఃఖమ్మును యా ప్రియంబుమై
నష్టకష్టహితాహిత దృష్టితోడఁ
దెలుపగలవారు మీరలు తెలియఁజెపుడు. 179

ఉ. చెప్పితిఁ గొంత మీకు మును సీతను దెచ్చుట కుంభకర్ణుతోఁ
జెప్పగలేదు నిద్ర విడి చెచ్చెర వాడరుదెంచె నేడెగా
నప్పుడతిన్ నిశాచరమహోవని దండకఁ బట్టి తెచ్చి నే
నిప్పురి నుంచిమారుగుఱి కెంతయుఁజిక్కు చుడస్సియుంటిగా.

ఉ. ఆ కమలాయతాక్షి కెనయౌ పడతిన్ మఱి యొందుదాని ము
ల్లోకములందు గాన మవలోకన మూను కొలంది యామెలో
కైకమనోహరాంగనగనే కనుపించెడి, మారు బాఱిచే
నాకుల పాటు చెందు హృదయంబునఁ జూతు భవిష్యదర్థమున్

ఉ. అందము చిందులాడు వదనామృత బింబము స్వర్ణమూర్తి చ
క్కందన మింత యింత యనఁగాఁ దగు వేమ యనిర్మితంబయా
సుందరిగాగదోచుఁగడుసూక్ష్మము మధ్యము బెన్ బిఱుందులా
నందముగూర్చు, వల్లదహో నన్నది యేమి విచిత్రభావమో.

తే. గీ. ఎట్టనైన సమతలములై నెఱుపుగోళ్ల
ఆ పదకమలముల లగ్నమాయె మనసు
సూక్ష్మతనుమధ్య సుశ్రోణి శోభితంబు
నయ్యు సరియౌనె తనువు పదాబ్జములకు. 183

తే. గీ. ఆహుతాగ్నికీలల వలె నర్కుని వలె
ప్రబల కాంతిని వెలుగు నా పద్మముఖిని
జూడఁజూడంగ మారుఁడు స్రుక్కఁజేయు
చుండె మన్మథ బాధ నేస్రుక్కుచుంటి. 184

తే. గీ. కోప సంత్రాస దుఃఖ సంతాపములను
తెల్ల బాఱగఁ దనువు వేధించు మారుఁ
డాత్మఁగలుషిత మొనరించి యంత కంతఁ
గలచుచున్నాడు నే పీడ గలనె యామె. 185

ఉ. అప్పుడఁటిన్ రఘూద్వహుని ఆలిని నాజనకాత్మజాత నే
నెప్పగిదిన్ వశీకృతము చేసి జయించెద మారుబాటి నే
చొప్పున రామలక్ష్మణులు శూరులెయైనను నబ్ధిఁదాటగా
నొప్పు వనీచరాళియు మహోదధి దాటఁగ జాలువారలే. 186

తే. గీ. గడు వొసంగితి వత్సరకాల మేను
నన్ను వరియింప గాని యా సన్నుతాంగి
భర్త రఘురాముఁడరుదెంచి పత్నిఁ దన్ను
వెంటఁ గొనిపోవు నను నాశ వీడదాయె. 187

ఉ. సంగరభూమిఁ గెల్చినను జచ్చిన జావఁగ వచ్చు గాని యా
యంగనఁగూడకున్న నిక నాల మొనర్చెడి దాక నిల్చునే
భంగము గాక జీవితము పట్టును మారుఁడు వీడఁబోడు నే
భంగిని గార్యసిద్ధి యగు భావన సేయగలారు మీరలే. 188

తే. గీ. భయద తిమితిమింగలయుత వారిరాశిఁ
దాటి రాఁగలరని యెంచుచే పాటి యగును
నొక్కరుఁడె వానరుఁడు చేసి యుండె నెంతొ
కార్యగతుల నెఱుంగుట కష్టము గద. 189

తే. గీ. ఏది మీరర్హమౌనని యెంచువారొ
దాని విశదీకరింపుడు దైత్యులార
మున్ను దేవాసురరణంబు నెన్న మీ స
హాయ్యమునజయించితి నరులనఁగ నెంత. 190

మ. అయినన్ యోజన సేసి తెల్పఁదగు మీ యాలోచనన్ సర్వదా
జయమే గల్గెడి రామలక్ష్మణులునున్ శాఖామృగాధీశుఁడున్
భయమున్ వీడుచు నబ్ధి కుత్తరదిశన్ వారాశి లంఘించి రా
రయ మొప్పందలపోయుచున్నటుగ వార్తందెల్పి రాచారులున్.

ఆ. వె. హనుమ వచ్చి పోయి ఆ రామునకుఁ జెప్పె
సీత నేను లంకఁ జేర్చి నటుగ
దాన వార లబ్ధి దాటి సంగర మూని
మనలఁ జంపి సీత గొనఁ దలంత్రు. 192

చం. దశరథ పుత్రు లా జలధి దాటక పూర్వమె వారిఁ జంపనౌ
యశము నశించుగాదె జనకాత్మజ వారల కప్పగించినన్
వశ మొనరింపరాదు రఘువర్యుల కీమె నటంచు మంత్రముస్
విశదము సేయఁగాఁగలుగు విక్రమవంతులు మీరు దానవుల్.

చం. వనచరజాతి తోడ్పడుట వార్నిధి దాటుట లంకఁ జేరుటా!
అనిఁగొని నన్ జయించుటహా! అందుల కేరు సమర్థు లీ భువిన్
మనమె జయించు వారలము మానవభోజులతోడ మానవుం
డొనరుపఁగల్గునే రణము నొక్కడ బూన నశించిపోవరే. 194

కుంభకర్ణుని హితము

కం. అని కామాంధుఁడు రావణుఁ
డనునంతట కుంభకర్ణుఁడా వేళమునన్
గనుచున్ సోదరుఁ బల్కెను
మునుముందుగ యోజనంబుఁ బూనవదేలా?. 195

ఉ. ముందుగఁ జెప్పవైతి భువిపుత్రికఁ దెచ్చు తలంపుఁదెచ్చి ఏ
మందును జెప్పవైతివిపు డాపద కాలము సంభవింప ను
న్నందున నేడు చెప్పెదు స్వయంకృత దోషము రాజు లెవ్వరి
చందమునం బ్రవర్తిలరు చక్కని యోజనఁ బూని సేయరే. 196

తే. గీ. జరిగియుండిన దానిని జర్చ సేయఁ
దలఁప గతజల సేతుబంధనము గాదె
ముందువెనకల యోజన మూనకుండ
సీత హరియించి తెచ్చుట చెడుగు చేత. 187

ఉ. రాముని భార్యఁ దెచ్చితివి రాముఁడు యుద్ధము సేయ వానర
స్తోమముఁగూడియుండె నిక దోర్బలవంతుని లక్షణంబుగా
కాముక! రాజ! చేయఁగల కార్యముఁ జేసిజయించు టొండె ఏ
మేమొ తలంపనేల సుఖియింపుము సీతనుగూడి స్వేచ్ఛమై.

తే. గీ. మాదు భాగ్యవశంబున మాన్యచరిత
ఇంత వటుకును జంపఁడా యినకులుండు
నిన్ను నీ కోర్కిఁ దీర్చెద నేనె వినుము
వైరిఁ బరిమార్తు నెవ్వఁడు వాడు గాని. 199

తే. గీ. రాము లక్ష్మణు సుగ్రీవరాజుఁ గపుల
పర్వతము వంటి తనుశక్తి బట్టి తినెద
బాణమును వీడి రెండవ బాణ మూను
నంత రాము రక్తముఁ ద్రావి యలరు వాఁడ. 200

తే. గీ. మంచి మద్యంబు ద్రావుము మనుము నీక
జయము నొనగూర్చనా? బరాజయము లేదు
పోయి జంపెద రాముని బుడమి బిడ్డ
యంత నీ వశవర్తియై యలర కున్నె. 201

మహాపార్శ్వుఁడు

కం. ఈ మాటలు విని రావణుఁ
డామోదముఁదెల్పఁ డాయె నంతయు గనుచున్
దా మోదము గూర్పఁదలఁచి
వ్యామోహము హెచ్చ మది మహాపార్శ్వుఁడనెన్. 202

ఆ. వె. ఆరు నెలలు నిద్రయందుండి వచ్చిన
కుంభకర్ణుని పలుకులు వినంగ
రావణుండు కోపభావమూనిన యటుగ
నాత్మదలఁచి యాతఁడన గడంగె. 203

ఉ. తేనియ ద్రావ నెంచి వనిదేనియ గూరిచి తెచ్చి త్రావగాఁ
బూనఁడొ వాఁడు మూఢుఁడగు భూసుతగూడగ గోర్కిమీరగా
గానన భూమినుండి కడుఁగష్టములంగని తెచ్చి యుండి యా
చానను గూడకుండ మనజాలుదువే సుఖయింపు మామెతో.

తే. గీ. ఈవె యీశ్వరుండవు నసురేశు నిన్నె
వండు ప్రశ్నింపఁగా గలవాడు శాత్ర
వుల తలలఁ ద్రొక్కి సీతను బొంది నిరత
సుఖ మనుభవింపు రాజ! విముఖత యేల?. 205

తే. గీ. ఆమె వలపూనకున్నను నసుర రాజ!
కుక్కుటము తోలె నాపెతో గోర్కిదీరఁ
బ్రమద మందగఁదగు బలవంతముగనె
భయముఁబడనేల రానిమ్ము వచ్చు దాని. 206

తే. గీ. కుంభకర్ణుండు నింద్రజిత్తు గూడియుండఁ
దాల్చి వజ్రాయుధంబు శాత్రవులఁ జంపఁ
గలుగు వార లింద్రునిగూడ బలిమి డీకొ
నంగలిగి జయింతురు కదనమ్మునందు. 207

తే. గీ. దురము సల్ప నశక్తులు దుర్బలులును
సామదానభేదోపాయసరణిఁ బలుకు
వారు దండనోపాయమే వీరుఁడైన
వాడు కార్యసిద్ధికి గొనువాడు సుమ్మి 208

ఆ. వె. అరులు వచ్చునంత నస్త్రశస్త్రంబుల
వారిఁబట్టి నీకు వశముఁ జేయఁ
జాలువారలుండ సందేహ మదియేల
అమలబలుఁడ రాజ! అసురనాథ!. 209

రావణుఁడు శాపముఁ దెల్పుట

ఉ. ఆతని మాటలన్ వినుచు నాసురనాథుఁడు మెచ్చిమెచ్చి మున్
ధాత యొసంగినట్టి భయదంబగు శాపముఁదెల్పినంతనే
భూతలి పీడి బ్రహ్మ గనఁబోయెడి మార్గమునందుగాంచి వి
ఖ్యాతను బుఁజకస్థలను బొందితి బల్మిని నప్సరాంగనన్. 210

తే. గీ. ఆమెను దిగంబరగఁ జేసి యమర వీథి
యందె భోగింప నంత నా యుందకత్తె
వాడి తామర తూడుగ బ్రహ్మఁ జేరి
సర్వ మెఱిగింప విధి నాకు శాప మిచ్చె. 211

తే. గీ. అంతనుండి బలాత్కార మటుగఁ బూని
అన్యకాంతను భోగింప నయ్యె నేని
యపుడె నా తల నూఱు వ్రయ్యలయి ద్రెళ్లి
భూమిఁ బడునంచు శాపంబుఁ బొందియుంటి. 212

తే. గీ. బలవిహీనుఁడనై కాదు వైరి భయము
చేతఁగాదు నింతవఱకు సీత ముట్ట
కుండనుండిన హేతువు భండనమున
మరణ మొందను నా తపోమహిమవలన. 213

తే. గీ. గుహను గల సుప్తమృగరాజుఁ గోరి కోరి
నిద్ర మేల్కొలుపెడిగతి నేఁడు రాఘ
వుండు మృత్యుదేవత నిద్రనుండి లేప
వచ్చుచుండె నన్నెఱుఁగడో వర యుతుండ. 214

తే. గీ. వాయుగమనంబు వేగంబు వార్నిధి వలె
గలవు నాకని యతఁడెఱుం గఁడొకొ యూర
కున్న నన్నె యిటుగ రెచ్చ గొట్టు నొక్క
బుద్ధిహీనుఁడె! యిటులేల బూనినాఁడొ! 215

మ. వడి నారిన్ బిగదీయుచున్విడుచు మహాబాణప్రకాండంబురా
ముఁడుషున్నెప్పుడునున్ రుచింగనఁడుగాపుంఖానుపుంఖంబులై
యెడదన్ గ్రుచ్చినవాఁడెవాఁడెఱుఁగుపోనాయీ ప్రతాపాగ్నిలో
మిడతల్ దండుగ చచ్చునాడయిన సంవేద్యంబగున్ వానికిన్.

చం. సుర భువి నాగలోకముల శూరులఁ జంపి జయించినాడ ఆ
సురులవిరోధి ఇంద్రుడును స్రుక్కి భయంబునఁబోరరాడుగా
వరుణు జయించితిన్ ధనదుఁ బట్టితి లంకను బొందినాడ వా
నరతతి రాముడు గ్గెలుచునా, యనియంచసురేశుఁడాడగన్.

## విభీషణుని కడపటి హితవు

ద్వి. విని కుంభకర్ణుని విని మహాపార్శ్వ
విని రావణుఁడనిన వీరవాక్యముల 218
సహియింపఁజాలక సద్ధర్మవిదుఁడు
మహిత విభీషణ మాన్యుండు పలికె. 219

సీ. వక్షస్థలంబను బడగతో నొప్పెడి
సీతాహి వరియింపఁ జెల్లు నొక్కొ
చిఱునగ వనియెడి కఱకు కోఱల నొప్పు
సీతాహి వరియింపఁ జెల్లు నొక్కొ
శిరమున దిండగు చేవ్రేళ్లె తలలైన
సీతాహి వరియింపఁ జెల్లు నొక్కొ

అయిదు తలల పాము నన్నరో దెచ్చితే
సీతాహి వరియింపఁ జెల్లు నొకొ్క

తే. గీ. దంతములు నఖములు నాయుధంబులైన
పర్వతాకార వానర ప్రతతి వచ్చి
లంకఁ జుట్టుముట్టక మున్నె రావణేశ
అప్పగింపుము సీతమ్మ నామె పతికి. 220

తే. గీ. వజ్రతుల్యంబులై గాలి వడిని వచ్చి
మననిశాచరశిరముల దునుమఁ గలుగు
బాణములు రాముచే వీడ బడక మున్నె
అప్పగింపుము సీతమ్మ నామె పతికి. 221

తే. గీ. పిడుగులను బోలు నా రాము విశిఖ తతుల
హా ప్రహస్త ! నీతలఁ గొట్టియుండ వయ్యె
నీ ప్రలాపంబులందున నెగడుచుండెఁ
గాంతు వనతి కాలాన నా కార్ముకముల. 222

తే. గీ. కుంభకర్ణుండుఁ గుంభ నికుంభులాది
ఇంద్రజిత్తు మహాపార్శ్వుఁడెవడు గాని
రామ వీరుని తూపులరాశి కెదుట
నిలిచి పోరాడఁగలవారె నిలువ లేరు. 223

శా. పాతాళంబున దాగినన్ దివికి వే బారన్ సురల్ మైత్రిమై
నీతోఁ దోడుగ నిల్చినన్ రవియు రానీ నీ సహాయార్థంబుగాఁ
బ్రీతిన్ మృత్యువె రక్ష నిచ్చినను నిన్ వీరుండు రాముండహో
సీతార్థంబుగ వెంబడించి దునుమున్ జింతింపు దైత్యేశ్వరా.

చం. అనుచు విభీషణుండు పలుకాడుచునుండగ బ్రహస్తుఁడడ్డమై
దనుజులు దేవతల్ మృగ వితానములున్ వధియింపఁజాలవీ
దనుజపతిన్ వరంబునఁ గతంబిక నేది భయంబు సెంద నీ
మనుజుఁడు రాముఁడా నృపకుమారకుఁడాయగుమారకుండనెన్.

ఉ. రావణు క్షేమమే యరసి రాజ్యసుఖస్థితి నే తలంచి లో
నావహమార్గమే వలచు నన్ను మదిన్మరలింప నెంచుచున్
ధీవరుఁడా విభీషణుఁడు తెల్లముగా ననఁబూనె నున్నకున్
దైవము నెంచి ధర్మపరతన్ విపథోక్తుల క్షేమ మీరగన్.

ఉ. ఓయి! ప్రహస్త! రావణమహోదరధీరులు కుంభకర్ణుడున్
బాయుచు ధర్మమార్గమభిభాషణ మూన బలంబు గల్గునే
చేయఁగ రాని కార్యమును జెప్పెదరేల వివేకహీనులై
యీయసురోత్తముల్ గలిసియేనియుఁ జంపఁగలారె రామునిన్.

వం. పదియును నొక్క వేయి భటవర్గమునున్ ఖరదూషణాదులన్
గదనమునందు నిల్చి వెను కంజను వేయకఁ జంపియుండె నా
విదితబలుండు రాముఁడరివీరభయంకరుఁడైన జేత జం
పెదరొకో! మీరు ఱేడు విన వేడుకగాఁ బలుకాడఁ జెల్లునే.

తే. గీ. వరవిరాధు కబంధుని వాలిఁగూడ
మడియఁజేసె రాముం డను మాట వినవొ
సుజనరంజక రామునిఁ జూచునంత
మోహితులు గారె సురలును నాహవమున. 229

ఉ. రావణ కుంభకర్ణులు పరాజితులౌట నిజంబు నిన్ను నీ
రావణకుంభకర్ణసుతులన్ బరిమార్చుట నిశ్చితంబు నా
దేవ నరాంతకాదులు నదేగతిఁ బొందెడినున్నవార లా
శ్రీవరుఁ బోరి నాజిని విజేతలు కాగల రెవ్వ రీ భువిన్. 230

తే. గీ. మిత్రులకు వోలె మెలఁగెడి శత్రుతతియె
మీర లందఱు దైత్యాపకారకృతిని
బూనియుండిరి రావణుఁ బొందుఁగోరి
యిచ్చకపు మాట లాడెద రేల మీరు? 231

ఆ. వె. విపుల తనువుతోడ వేయి తలల పాము
నియెడు రామవైరమె యితని దను]
జేకు బట్టియుండె నీ విషాహిఁదొలఁగఁ
జేయ మీ విధియగుఁ జేయు డటుగ. 232

తే. గీ. లీల సప్తవ్యసనముల లోలుఁ డగుచు
వెనక ముందుల యోజన వీడి దైత్య
తతి వినాశనకృతిఁ జేసి దాని విడువ
దలఁపు లేని జేనికి మంచి ఁదెలుప వలయు 233

తే. గీ. సర్వసుఖముల నొసఁగు రాక్షసవిభుండు
లక్ష్మణాబ్ధిని మునుగుచు రాముఁడనెడి
తీవ్రబడబాగ్నిముఖమునఁ ద్రెళ్లు, మీరు
సచివ మిత్రులు తప్పించు సరణిఁ గనుడు. 234

చం. వినుము మదీయ వాక్యముల పీటికి, రావణ! రాక్షసాళికిన్
మనకు శుభంకరమ్మయిన మంచిని రామున కప్పగించి యా
తని సతి శాంతిఁ బొందఁ దగు ధర్మము భద్రము గూడలభ్యమై
మనదగు దానవేశునకు మంత్రులు మేలగు రీవిఁదెల్పుడీ. 235

## ఇంద్రజిత్తు

తే. గీ. అను విభీషణు మాటల నాలకించి
చెప్పఁగాఁదగునె విభీత చిత్తుఁడవయి
పిటికి మాటలఁ జెప్పరే బీరము విడి
మన పులస్త్యవంశోద్భూతులనగదగునె. 236

ఆ. వె. అల పులస్త్యవంశమందున జన్మించి
యీయన పినతండ్రి యిటుగ నాడె
విడి పరాక్రమంబు వీడుచు ధైర్యంబు
శౌర్యబలవిహీనసరణిఁ బలికె 237

సుగంధి. ఒక్క నీచ రక్షసుండె యోడఁ జేయు వారలన్
ద్రుక్క జేయు రాము వాని సోదరుండు లక్ష్మణున్
ఇక్కడుండ నేను లంక కేమి ముప్పు వాటిలున్
రక్కసుల్ లయింపరంత రాజ చంపశక్యమే. 238

సీ. త్రిభువననాథుండు దేవేంద్రునిన్ భూమి
బడఁద్రోసి యుండినవాడ నేను
దేవగణంబెల్ల దిక్కుల బాఱంగ
భయమొందఁ జేసినవాడ నేను
అమితనిస్వనమూని యైరావతము రాగఁ
బడ నేలఁద్రోసినవాడ నేను
ఆ సురలఁదఱుమ నైరావతపు దంష్ట్ర
లూడబెఱకియున్నవాడ నేను

తే. గీ. గర్వముమ వీడి మనుదేవగణవిభుండు
తనరు దైత్యోత్తములుఁగూడ దర్పము విడి
వినఁగ నా పేరు గనవె విభీషణార్య
యీ నరేంద్రాత్మజులు లెక్కయే తలంప ? 239

తే. గీ. సకల శస్త్రాస్త్ర సంయుత సాహసుఁడగు
నింద్రజిత్తు బ్రతికియుండనేల భయమ
టంచు నింద్రజిత్తు పలుకునంత వేగఁ
బ్రేమ మీరఁగఁ బలుకాడె పిన్నతండ్రి. 240

ఉ. బాలుఁడ వీవు మంత్రపరిపక్వ విహీనుడవున్ స్వశక్తియుం
జాలదు గర్వితుండవును సాహసికుండవునై ప్రలాపముల్
ప్రేలెదవేల ? తండ్రియెడఁబ్రేముడి నాత్మవినాశనంబుగాఁ
గాలము దీరు వేళఁ బలుకాడు తెఱంగునఁబల్కుదే సుతా!241

మ. కనలేవైతివి బాలకుండవుగదా కంజాక్షుఁ డా రాముతో
నని సల్పన్ సరివత్తువే రిపుబలంబంతన్ గ్రహింపంగనౌ
జనకుండే యిలనుండ నెంచునెడలన్ జాలింపుమీ నీ నుడుల్
తనయుండా సఖరూపశాత్రవుఁడ మంత్రార్థంబునిట్లాడెదో.242

ఉ. రాముఁడు రావణేశుని బరాజితు జేసి సబాంధవంబుగన్
భూమిని వీడఁజేయుసుమ పుత్ర యెఱుంగు వివేకమూనుచున్
స్వామికి జెప్పగాఁదగు సుభాషితముల్ చెడు బుద్ధి వీడఁగాఁ
గాముకుఁడైన వాడు కడగండ్లను బాసెడి రీతి పుత్రకా ! 243

తే. గీ. బ్రహ్మ దండ ప్రకాశంబు జ్వాలయుతము
మృత్యుదేవత రీతియే మేదినీశ
రాము విశిఖంబులవి యెదురాడ వశమె
వినుము నా మాటఁ బుత్రకా వినగదయ్య. 244

ఉ. ఓయి నిశాచరేశ వినుమోయి మదీయహితంబు నీవు రా
మాయ నమో యటంచు ధన రత్న విభూషణ వస్త్రసంచయం
బాయన కిచ్చి సీతను సమర్పణ జేయుము, మైత్రిఁబొందుమీ
స్వీయసుఖంబు నాసురుల క్షేమము దాన లభించెడిన్ సుమా.

ఉ. వాలి జయింపలేదె నిజవాలమునన్ బిగఁజుట్టి పట్టి నిన్
లీలగ సప్తవార్నిధులఁ ద్రిప్పడె ముంచుచు నబ్ధులందు న
వ్వాలిని నేకబాణమున బ్రాణము దీసిన రామమూర్తితో
నేల రణంబు గోరెదవరే మరణించుట తథ్య మన్నరో! 246

తే. గీ. కార్తవీర్యార్జునుఁడు మహోఘనుఁడు బలుఁడు
వాడు నిన్ను జయించినవాడు వానిఁ
బరశురాముండు జంపె నప్పరశురాము
బాలరాముండె యోడించి వడసె జయము. 247

తే. గీ. నీవె బలవంతుడవనెడి భావము విడ
జ్ఞప్తికిని దెచ్చినాడ మున్ జరిగియున్న
కథల మఱియు నరునివల్ల గనవు చావ
టంచు వర మొందలేదుగా అన్న? కనుము. 248

ఆ. వె. అన్న హితము గోరి యాడిన మాటల
గౌరవింపక దశకంఠుఁడంత
మృత్యుపాశవశత మిగుల కోపంబూని
పరుష వాక్యములనె భ్రాతకపుడు. 249

రావణుడు విభీషణుని ద్యజించుట

ఆ. వె. విదిత వైరితోడ విషసర్ప రాజుతో
మైత్రి సలుపవచ్చు, మిత్రుని వలె
వరలు శత్రుపక్షపాతితో సహవాస
మొంద నెపుడు కీడె పొందనగును. 250

చం. ఎఱుగుదు నేను జ్ఞాతులను నీర్ష్యఁ జరింతురు జ్ఞాతి కష్టముం
బరమసుఖంబుగాఁ దలచు వారలు పండితులం బ్రధానులన్
వరగుణ శూరులన్ సిరుల వర్ధిలు జ్ఞాతుల జ్ఞాతులే సదా
నిరసనఁ జేయుచుండెదరు నీవు భీషణ ! జ్ఞాతివైరివే. 251

తే. గీ. జ్ఞాతివైరంబు కనరాని లోతు గలది
సతము స్నేహమె నటియించి సంచరించు
వారు ప్రచ్ఛన్న హృదిని నాపదలు గలుగ
నాతతాయిగ వర్తిలు జ్ఞాతి యెపుడు
నమ్మగారాదు జ్ఞాతుల నమ్మరాదు. 252

తే. గీ. విను సహోదర పద్మవనిని గలట్టి
యేనుగులు పాశములఁగొని వానిఁ బట్ట
వచ్చిన పురుషులంగని పలికియున్న
శ్లోకముల దెల్పువాడను నీకుగూడ. 253

తే. గీ. అగ్నివలన నేయితరాయుధాళి వలన
పాశములవల్ల గాని యపాయ మొండు
గలుగదు స్వకార్యపరుల చెంగట మెలంగు
నేనుగులవల్ల నే భయ మెపుడు గలుగు. 254

ఆ. వె. మనలఁ బట్టవచ్చు మానవుల కుపాయ
మెపుడుఁ దెల్పు జ్ఞాతి యేనుగులు కద !
జ్ఞాతి వైర మెంచ సహజంబు జీవుల
నమ్మరాదు జ్ఞాతినరుల భువిని 255

తే. గీ. జ్ఞాతి వైర భయంబు కష్టతరమె యగు
ననుట సుప్రసిద్ధమే గద ఆవులయెడ
సంపదయు స్త్రీలయందున చపలతయును
దమము ద్విజుల వైరము జ్ఞాతితతుల సతము
నైజ ముండుట జ్ఞాతుల నమ్మరాదు. 256

తే. గీ. సౌమ్యుఁడవు నయ్యు సోదరా ! జ్ఞాతివైర
ము నిను బాయునా నా సిరిఁ గనుచు లోక

పూజ్యత గనుచు వైరంబు బూని లోనఁ
జెప్పఁ దగనట్టి మాటల జెప్పినావు. 257

తే. గీ. అరయ పుష్కరపత్రంబునందు నిలుచు
సలిల బిందువు లొండొంటిఁ గలియు నొక్కొ!
దుష్ట సహవాస మెంతగా నిష్టపడిన
స్నేహ మొనఁగూడు నా గల్గు ఛిద్రమెపుడొ. 258

తే. గీ. తేనియలు ద్రావి విడుచునా తేనె టీగ
మధు వొసంగిన పూవునే మఱచిపోవు
వర సుఖంబులఁ బొంది నావలన నాకె
కీడొనర్పంగ దలకొనినాడ వీవు. 259

తే. గీ. దంతి స్నానంబు సలిపి యనంతరంబు
తనదు తొండమ్ముతో దుమ్ముఁ దనువు నెల్ల
బోసికొనురీతి దుష్టుల పొందుఁగూడ
నిష్ఫలంబగుట తుదకు నిశ్చయంబు. 260

తే. గీ. శరదృతువు మేఘమువలె వర్షంబు లేక
గర్జనలు మాత్రముండెడి గతిని దుష్టు
లభినయింతురు వారి స్నేహంబువలన
మంచి యొక యింతయును లభియించ దెపుడు. 261

ఉ. ఓయి విభీషణా! విను సహోదర! యీ పరుషంబులాడవే
కాయము బాయఁడే యెవఁడు గాని క్షమించితి వంశపాంసనా
పోయెట కేని నన్నువిడి పొమ్మిక పొమ్మిక నీకు నాకు నా
ప్యాయము దీరె నంచుఁ బలుకాడెను రావణుఁడాసభాస్థలిన్.

విభీషణుని కడపటి మాట

కం. అన్న తిరస్కారము విని
సన్నుత ధర్మార్థమూర్తి సచివులుతోడై
వెన్నును బట్టుచు రాగా
గ్రొన్నన దివికుద్గమించి కుపితుండగుచున్. 262

ఆ. వె. అంతరిక్షమందు నలరు విభీషణు
డంత నన్నుఁ గనుచు ననఁగడంగె
జ్యేష్ఠసోదరుఁడవు చెప్పినయది నేను
తండ్రిసముఁడవౌటఁదమిని వింటి. 264

ఉ. నీకు హితంబు లోఁదలఁచి నే వచియించితి నింతవట్టుగా
నీ కపకారమున్ సలుపు నెమ్మదిఁ బల్కిన వాఁడఁగాను నీ
పోకడఁగాంచి మృత్యుముఖముం జొరనుంటి వటంచుఁదెల్పఁగా
నేకులపాంశనుండనని నీవనినావు సహింప దానినిన్. 265

తే. గీ. కాలపాశంబు మెడఁజుట్టఁగా వినంగ
నెంచునొకొ యెవ్వఁడైనను మంచి దెలుప
నే వెడలుచుంటి నీవిక నెమ్మదిఁగని
సుఖకరంబుగనుండగాఁ జూచుకొనుము. 266

తే. గీ. నిన్ను లంకాపురంబును నీ యసురుల
నింక రక్షించుకొను మీవ జంకు లేక
రామబాణప్రవాహంబురా, సమస్త
మిసుక కట్టడము వలె లయించు గాదె. 267

తే. గీ. ఇచ్చకము లాడువారలు నిచ్చకమ్ము
వినెడివారు బహుజనులు పృథ్వినుండి
రప్రియముఁజెప్పఁగలవార లప్రియంబు
వినెడివారలు నిల లేరు వెదకి చూడ. 268

తే. గీ. మంటవలె వచ్చు రాముని మహిత బాణ
సంతతుల మగ్గు నినుఁగనజాల మిటుగ
వాకొనితి నన్నవగుట గోపంబు వలదు
నన్ను క్షమియింపు హితమెంచుచున్నవాఁడ. 269

ఉ. రాముడుఁ వాడితూపులపరంపర మంటల గ్రక్కుచుండి నిన్
హోమము సేయుచుండగనఁనోర్వమిలంక యుదైత్యకోటియున్
క్షేమముగా మనంగవలె జీకును బొందక యుండనంటి సీ
తామహితాత్మ నిమ్మనుచు ధర్మము శ్రేయములం దలంచుచున్.

తే. గీ. చావుదరిఁజేరువారలు చచ్చినట్లె
వారు వినలేరు కనలేరు విహితసత్య
ధర్మములఁ బోయి వచ్చెద దైత్యనాథ
మంగళమ్మగు నీకు సుమంగళమ్ము. 271

మ. అనుచున్ రావణు దుష్టునిన్ విడిచి ధర్మార్థంబుగా రామునిం
గనగా నెంచి విభీషణుండు సనెరాగా మంత్రులున్ దోడు రా
ముని సాన్నిధ్యము జేరవచ్చు నతనిన్ బూతాత్మునిన్
గనుచుం గుంపుగఁ జేరుచున్ గుసగుసల్ గావించిరా వానరుల్.

## ఆశ్వాసాంత పద్యములు

శా. నీరేజాక్షుని నీలమేఘతనుకాంతున్ మోహనున్ సుందరా
కారున్ భక్తజనావనున్ విమల భూకన్యామనోనాథునిన్
సారాచారవిచారధర్మపరునిన్ సన్మార్గులంబ్రోచు నా
శ్రీరామున్ సుజనాభిరాము వరదున్ సేవింతు నశ్రాంతమున్.

మ. పరభార్యాపహరున్ వనీచరపతిన్ వాలింభువింగల్పి సో
దరు సుగ్రీవుని రాజ్యనాథునిగ మోదంబొప్పగాఁజేసి వా
నరమైత్రింగొనియున్న రాఘవుని ఙ్మానాథాత్మజాభర్తనున్
శరణార్థిన్ సతతంబు బ్రోచు వ్రతు నశ్రాంతంబు సేవించెదన్.

మ. పరలోకైకసుఖప్రదున్ రిపుతతి వ్యాసంగవిచ్ఛేదునిన్
వర మౌనీంద్రశుభంకరున్ దురితజీవవ్రాతసంహారినిన్
స్థిరభక్తాళికి భక్తునిన్ సకలునిన్ సేవించుచుంబూజలన్
నిరతంబున్ స్తుతియించుచుంగొలుచుచున్ నీరాజనంబిచ్చెదన్.

## ప్రథమాశ్వాసము సంపూర్ణము

ఇది శ్రీ గోవిందరామాయణమందలి పట్టాభిరామ కావ్యమున (యుద్ధకాండమున) సంగ్రామ సన్నాహాశ్వాసము, సంపూర్ణము.

శ్రీ రామాయనమః

# శ్రీ గోవింద రామాయణము

## 2 వ అభయాశ్వాసము

కం. శ్రీ శరణాగత వత్సల
దాశరథీ! యెవ రెపు డెటఁ దరిఁ జేరంగా
ఆ శరణాగతులకు వే
యాశయ మీడేర్పవొక్కొ! ఆర్త శరణ్యా. 1

### విభీషణుని రాక

తే. గీ. శ్రీశుఁ దరిఁజేర నాసక్త చిత్తుఁడగుట
ననుకూల ప్రదేశంబు నన్న విడుట
నూత్న తేజోవిరాజ మానుఁడు విభీష
ణుండు శ్రీమంతుఁడై వచ్చి యుండె తృటిని. 2

ఆ. వె. తల్లి బాసి లేగ తహతహ బడుచుండి
వలుపు విడిన లేగ కలియు రీతి
నొక ముహూర్తమందె యూర్ధ్వగతి విభీ
షణుఁడు వచ్చె రాము స్థలమునకును. 3

ఉ. ఆలిని బిడ్డలన్ విడి గృహంబు స్వదేశము వీడి తండ్రినిన్
బోలు సహోదరుండు విడిపొమ్మన రామ పదాశ్రయంబె కాఁ
జాలును సర్వమంచు నిహ సౌఖ్యములంద్యజియించి సుస్థిర
శ్రీ లభియింప నబ్ధి తటి జేరె సలక్ష్మణు రాము గూడఁగా. 4

తే. గీ. గగనమార్గచరులఁ గోతిగమియు వారి
పతియుఁ జూచుచుఁ దలపోసె వారలిటకు
రాఘవుల వానరులఁ గొట్ట రాక కతము
వైరుల రహస్యము తెలుఁగ వచ్చు వారొ! 5

తే. గీ. అనుచుఁ దమలోన శంకించి హనుమ గాంచి
సాయుధులు మహాబలులు రాక్షసులు నల్వు
రను గలిసి వచ్చుచున్నాడు రాక్షసుండు
మనలఁ జంపఁదలంచియే యనఁగవచ్చు. 6

తే. గీ. అనెడి సుగ్రీవు మాటల నాలకించి
క్షణములోవారిఁబరిమార్ప గలమటంచు
శైలముల వృక్షములఁ బూని చంపవారి
ననుమతింపు మటంచని యనిరి కపులు. 7

కం. ఇటు లా వానరు లందఱుఁ
బటుతరకోపంబుఁ బూని పలుకుచు నున్నం
తట నే వచ్చి విభీషణుఁ
డటకున్ దివి నిలిచి కపుల నందఱిఁ గనుచున్. 8

ఉ. పండితుఁడా విభీషణుఁడు వానర శంకల నాలకించి తాఁ
గొండనె నిల్చి లోఁదలఁచెఁ గూరిమి రాఘవు గొల్చు బుద్ధి నా
యండ వసింపవచ్చినను నాతని భక్తులు శత్రు కోటిలో
నుండినవాడ నౌట నను నొల్లరుగా సహజంబు నద్దియే. 9

తే. గీ. వీరు నన్నెంచుచున్నారు వైరి గాగ
రాఘవులఁ జంపవచ్చిన రాక్షసునిగ
సహజమయ్యది తమ రాము సకల గతుల
రక్షణ మొసంగఁ జూచు విలక్షణ మది. 10

దండకము : శ్రీరాముఁ డెల్లప్పుడున్ రాముఁడేమైననున్ భక్త
సంఘంబు నన్నాదరింపందిరస్కారముంబూనుచో నాతఁడేనిం ద
ఱింజేర్చునే నన్ను నట్లాతనింగూడగా రాదు భక్తాళి
సేవించి యవ్వారి మూలంబునన్ రాము సేవింపగా నౌనుగా.

దానవ్ మ దీయార్థ మున్ముందుగా దెల్పగా యుక్తమంచెంచి
యాదైత్య రాజేశు దమ్ముండు శాఖామృగంబుల్ వి నన్
బల్కఁ గొంతెత్తుచున్. 12

శ్రీరామ సేవార్థమై రావణున్ దుష్కృతున్వీడితిన్
సోదరుండంగదా వానికిన్ దైత్యనాథుండు దుర్మార్గుడై
యాజనస్థానమందుండి సీతన్ హరించెంగదా లంక లో
రాక్షసస్త్రీల గాపుంచి బంధించెగా. 13

సీతామహాదేవినిం దెచ్చు మార్గంబునం బక్షిరాజంబు
పోరాడ గా భక్తిమై వానినిం జంపెఁగా. 14

అద్దాన మాజ్యేష్ఠు పాపంబునందేనునున్ భాగముం
బొందితిన్ వానితోఁగూడి నేలంకలోనుండుటన్. 15

పాపాగ్ని చల్లారగా నెంచుచున్ సోదరప్రేమతో వానికిం
జెప్పితిన్ నేను నమ్రుండనై ధర్మమున్ జూచుచున్ జానకిన్
రాము కర్పింపు మంచున్ హితంబాతఁ డాలించునే పెక్కు
మార్లిట్లు నేజెప్పినన్ లెక్కసేయండు చావున్ నమీపించు
మూర్ఖుండు తానౌషధంబుం దిరస్కారముం జేయఁడే. 16

ఎన్నెన్నియో మార్లు ధర్మంబుమై జానకిన్ రాము
కర్పించు మంచున్ హితంబాడఁ బేరోలగంబందు
దూషించి నన్, బొమ్ము పొమ్మంచుఁ బల్కాడెగా. 17

నేనంతటన్ వచ్చితిన్ లంకనేవీడి పుత్రాదులన్ భార్యనున్
సర్వమున్ వీడి తోబుట్టువున్ రోసి శ్రీరాముఁడే నా
శరణ్యుండుగా భక్తిమై దాసదాసుండగా నన్నులెవ్వారలన్
వేడఁ బోనే శరణ్యంబు దీనుండ గా. 18

తే. గీ. ఉత్తముని భక్తవరు జటాయువును జంపెఁ
బరమభాగవతులఁ జంపు పాపి యాతఁ
డతని పొత్తు సహింపక అతని వీడి
యరుగుదెంచితి రాముని శరణు వేడ. 19

తే. గీ. ఆత్మసంరక్షణము నెంచి యాద్యు నెంచి
ఆలిబిడ్డల సిరియు సౌఖ్యంబు విడిచి
లౌకికసుఖంబు విడి పరలోక మెంచి
రామశరణార్థి నైతి మఱేమి గాదు. 20

తే. గీ. సర్వలోకశరణ్యుని శరణు వేడ
నాసురేశుని తోబుట్టు వా విభీష
ణాఖ్యుఁ డిటకు వచ్చెను శరణార్థి యగుచు
రామ యని తెల్పగోరెద రాఘవునకు. 21

తే. గీ. సతత శరణార్థి రక్షణవ్రతుఁడు రామ
చంద్రుఁడు నను రక్షింపఁగా శంక గొనఁడు
భక్తులగు మిమ్ము నే భక్తభక్తుఁడ నయి
నెమ్మిఁ గోరెదఁ బురుషకారమ్ము సలుప. 22

తే. గీ. అనెడి మాటల రాముండు వినుచునుండె
గనుచునుండె విభీషణుఁ గగనమందు,
రాముగని విభీషణుఁడల రవిజున కనె
తన నెఱింగింప శరణార్థి ననుచు నమ్మ. 23

సుగ్రీవుఁడు - రాముఁడు

చం. అనఁగ విభీషణుండు విని యా కపిబృందము శంకితాత్ములై
దినకరపుత్రుఁగాంచిరి పదేపది యాతఁడు నిశ్చితాత్మ నా
తనిని విభీషణుం, దునుమ ధర్మము కర్జముగాఁ దలంచి రా
మున కెఱుగంగఁదెల్పఁదగు ముందుగ నంచెదలోఁ దలంచెడిన్.

కం. శరణాగత సంరక్షణ
పరతంత్రవ్రతుఁడు రాఘవదయామయుఁడే
యరి కభయ మొసంగక మునుపే
పరిమార్పఁగ రామునాజ్ఞఁ బడయగ వలయున్. 24

కం. రాముఁడు శరణాగతులకు
సోముండయి చల్లనయిన చూడ్కులఁ ద్రాణో
ద్ధాముఁడు రావణుడమ్ముం
డీ మెయిరా రాజనీతియే యగునంచున్. 26

కం. కనునో కనడో నేవే
జని తెల్పఁగనే నితండు చంపఁగ నర్హుం
డని శరణార్థినను నెపం
బున వచ్చిన వీని పొందుఁ బొందఁ గ నౌనే. 27

కం. అని లోలోఁ దలపోయుచుఁ
జని రాముని లక్ష్మణుఁగని స్వాంతముఁ దెల్పెన్
బనివడి శరణార్థిగ వ
చ్చినవాడె విభీషణుఁడని చెప్పుచు మఱియున్. 28

తే. గీ. ఓపరంతప రాఘవా! ఓయి వీర
మంత్రము నుపాయమును వీడి మనఁగ రాదు
గూఢచారుల తంత్రంబు గుర్తుబట్టి
మెలఁగఁదగు సమయంబిది మేలు గలుగ. 29

తే. గీ. రాక్షసులు కామరూపులు రక్ష వలదు
దైత్యులకుఁ గీడు మనమేలుఁదలచి రామ
యిపుడు కార్యమకార్యంబు నెంచి మెలఁగ
వలయు విశ్వసింపఁగరాదు వారి మనము. 30

తే. గీ. ఉండినట్లుండి మాయమౌ దండి మగలు
కపట వర్తన పండితుల్ గారె వారు
మనలఁ బరిమార్పింపగ నెంచు మాయ వలన
నమ్మగారాదు దైత్యుల నమ్మరాదు. 31

తే. గీ. ఈవిభీషణుఁ డా రాక్షసేశ్వరునకు
గూఢచారియై నమ్మించి గుట్టు దీసి
మిత్రభేదంబు మనయందు మెలఁగఁజేయు
రాజనీతిజ్ఞుఁడై వచ్చె రాజపుత్ర! 32

తే. గీ. అటవి మనతోడ నున్న సైన్యంబు మిత్ర
సైన్యమును వేతనార్థుల సైన్యబలము
మనము గ్రహియింపనగు గాని మన విరోధి
బలముమాత్రము గ్రహియింపఁదలఁపరాదు. 33

సీ. శత్రుపక్షమువాడు శరణన్న మాత్రాన
విశ్వసింపఁగ నౌనె వీని మనము
మన లోతుపాతుల గనుచు రామాదుల
నదనుమై చంపు ప్రయత్నమేమొ!
ఆపదకాలాన నన్నను విడు కృత
ఘ్నుని నమ్మ ఆపద గూర్పఁడొక్కొ
శరణార్థి యగువాడు సాయుధపాణియై
బలుల నల్వురఁగూడి వచ్చుటేల ? 34

తే. గీ. చంపఁదగు వీని సచివుల సంయుతముగ
నమ్మగారాదు దైత్యుల నమ్మఁ జాల
మనుచు సంశయాత్ముఁడు రవితనయుఁడంతఁ
గపులఁగూడుచు రామునిగనుచుఁ బలికె 35

సుగ్రీవుని మంత్రులు తమ తమ హితంబుఁ దెల్పుట

కం. అను సుగ్రీవుని మాటల
విని రాముండటఁగల కపివీరుల కనియెన్
విని నారలు సుగ్రీవుని
వినవెంతును మీ మతంబు విశదముసేయన్. 36

ఆ. వె. మేలుగోరువారు మిత్రులెల్లరు మీరు
వినఁదలంతు మీర లనెడి హితము
దినకరాత్మజుండు తెలిపెఁ దెల్లము గాగఁ
దనదు దృఢమనంబు దైత్యునెడల. 37

ద్వి. ఆ మాట లాలించి యా కపు లనిరి
రామ! సర్వజ్ఞుఁడా మేము తెల్పుటయ. 38

ఉ. రాముని మిత్రు లీ వనచరంబు లటంచని గౌరవప్రదం
బై మహినొప్పు మా హితము వాకొనఁగోరుచునుంటినీవహో
ఓ! మహితాత్మ ధార్మికుఁడ ఓ! పృథువిక్రమ ఓయిశూర నీ
కేమి కొఱంత సర్వము త్రయీ భువనంబుల నీవెఱుంగవే. 39

తే. గీ. ఓయి ! సత్యపరాక్రమ ఓ ఘనుండ
ఓ స్మృతియుతుండ హితులపై నునిచితీవు
భారమును సర్వకార్యనిర్వహణదక్ష
పారతంత్ర్యముఁజూపుదే పరమ పురుష! 40

కం. ఐనను నీ యాజ్ఞకుఁ గపు
లనువర్తను లై తమ యభిమతంబుల వే
వినిపింతురుగా క్రమమున
ననిరా వానరగణంబు లాదర మొప్పన్. 41

అంగదుఁడు

ద్వి. పినతండ్రి కపులెల్ల రనిన మాటలను
విని యంగదుండాడె వినయంబుతోడ. 42

ఉ. నమ్మగరాదు శాత్రవజనంబుల నమ్ముట పాడిగాదు ద్రో
హమ్మొనరించువార లగునాప్తులుగాఁ జరియించుచుండి, కా
లమ్మొకరీతిగాదు గద రామ విభీషణుఁబట్ల నమ్మకం
బిమ్మెయినుంచరాదయిన నేమి? పరీక్ష నొనర్పఁగాఁదగున్.

మ. గుణదోషంబుల నెంచి యెంచదగు సంకోచంబు వీడన్ విభీ
షణు, దోషంబులె హెచ్చు దోచునెడ నిస్సందేహమే వీడ స
ద్గుణముల్ బెచ్చగునేని వానిఁగొన సంకోచింపఁగా రాదుగా
నణుమాత్రంబు నటంచునంగదుఁడు పల్కాడెన్ వినమ్రుండుగా

శరభుఁడు

తే. గీ. పొందు నొనరించి గుణదోషముల గణింప
వలయుఁ దగు పరీక్షయె లేక వలదు పొందు
చారునొండు బంపుచు విభీషణుని కడకు
నెంచి గుణముల వాని గ్రహింపవలయు. 45

తే. గీ. ఇతఁడు రావణుకడనుండి యిటకు వచ్చె
వచ్చు హేతువు తగలేదు వైరి వీడు
సంశయమె దోచు నీ విభీషణుని యెడల
ననుచు జాంబవంతుడు పలు కాడె నపుడు. 46

ద్వి. అతఁడకాలంబున నన్యదేశమునఁ
బ్రీతిమైకాలిడ వెట్టివాడొక్కొ. 47

మైందుఁడు

తే. గీ. గూఢచారిని బంపి నిగూఢయుక్తి
నాతని ప్రవృత్తి నెఱుఁగంగనగును దుష్టుఁ
డో యదుష్టుఁడో కనుఁగొననొప్పుననుచు
మైందుఁడనె నంత రాఘవు మహితుఁగాంచి 48

హనుమ

ఉ. అంత సమస్తశాస్త్రవిదుఁడాహనుమంతుఁడు మంత్రిసత్తముం
డెంతయు నల్పమౌ నుడుల నేర్పడఁగా మహనీయభావమున్
స్వాంతమువిప్పిచెప్పెమృదువాక్కునరాఘవ! అబ్బృహస్పతిన్
మించువు సూక్తులందు నిను మించెడివారెవ రీజగత్త్రయిన్. 49

తే. గీ. తర్కశాస్త్రాబ్ధి మెఱిగిన దారికాదు
వాదమున మించఁదలఁచు భావంబు కాదు
బుద్ధి పుట్టిన మాత్ర చెప్పుటయు కాదు
రాము ప్రేమయు రాఘవుగోము నెంచి
చెప్పఁదగిన యథార్థంబుఁ జెప్పవాడ. 50

ఆ. వె. పొత్తు లేక గుణముఁ బొడగన వీలౌనె
గుణము దెలియకుండఁగూడ నగునె
అంగదు మత మటుగ నన్యోన్యము విరోధ
మగుటఁ జేయరానిదయ్యె రామ! 51

చం. ఇటనె విభీషణుండుగల డిప్పుడు గాంచుచు నెల్లవారి, నె
చ్చటకికఁ జారుఁ బంపుట విచారము సేయ గుణంబు సాగునే
యటు శరభుండు చెప్పు విషయంబిక నిష్ఫల మయ్యెడింగదా
యిట కిపు డన్యదేశమున కేల యకాలమునందు వచ్చె నీ
కుటిలుఁడటంచుఁబల్కె మనకోతుల పెద్దగు జాంబవంతుఁడున్
బటుతర ధైర్యశాలి నిజభావమునన్ మలినంబులేమి ని
చ్చట కరుదెంచె నంచనుట సంశయమేమియులేదు నిన్ను గాం
చుటకు సకాలమియ్యదియె చోటును నిద్దియకాదె రాఘవా ?

ఉ. అన్నను దుష్టునిన్ విడిచి యార్యుని నీ దరిఁ జేరవచ్చెఁ దా
నెన్నుచు దోషసద్గుణము లిర్వురయందు విభీషణుండు, ము
న్నెన్నఁడు రాని కాలగతి యిప్పుడె వచ్చుటఁ జేసి వచ్చె నీ
వున్న సముద్రతీరమున కొప్పుగ దోషము లేదు రాకలో. 53

తే. గీ. సీత నపహరించిన దుష్ట చిత్తు, మఱల
నామె రామున కిడు మన్న మాట వినక
బొమ్మనిన వాని విడనాడి పురుషు నిన్నుఁ
జేరవచ్చె నీ సద్గుణ వార మెంచి. 54

తే. గీ. మఱియు ఖరదూషణాదుల మడియఁ జేసి
నట్టి నీ పరాక్రమ మెంచి యతఁడు వచ్చె
అన్నను వధించి తమ్ము రాజ్యాధిపతిగఁ
జేసినయది యెఱిఁగి నినుఁ జేరవచ్చె. 55

తే. గీ. ఇంక మైందుఁడాడిన హిత మెంచవలయు
నెఱుక లేనివాఁడట కేగి నెఱుగవలె వి
భీషణుని మతమును మాట వెలితి మాట
ఎఱుకలేకయె ప్రశ్నింప నెటుగఁ జెప్పు. 56

తే. గీ. మంచిబుద్ధిమంతుడుగూడ మరుగు పఱచు
తనదు హృదయంబును, దటాలున నన నతఁడు
మారుఁబల్కునె ? తలచుచో మనము వాని
సంశయించినటుగ వక్రసరణిఁబట్టు. 57

తే. గీ. మాటలాడు విభీషు మాట వినిన
గనిన ముఖము ప్రసన్నుఁడే యనఁగవచ్చు
ముఖము ప్రతిబింబ మగునిజబుద్ధి కరయ
దుష్టమతి లేనివానిగఁ దోచునితఁడు. 58

తే. గీ. కార్యవేత్తల నుత్తమ కర్మపరుఁడ
దేశకాలంబుల నెఱింగి తెలివిగలిగి
చేయుకార్యము లన్నియు సిద్ధిఁగనును
నీకెఱుకయే యతని శుద్ధనియతబుద్ధి. 59

ఉ. రావణుఁ జంపుదీవనుచు రాక్షసముఖ్యుఁడెఱుంగు, సు
గ్రీవుని రాజుచేయుటయు గీశపతిందునుమాడి, దీని ము
న్నీవానరించి యున్న గతి నీతఁడు రాజ్యరమాభిలాషియై
ప్రోవఁగ నిన్నుఁ గోరెకిని భూమిని పీడఁగనన్న దుష్టుడె.

ద్వి. తోచినంతవఱకు దోషి గాడనుచు
నా చొప్పుఁజెప్పితి నా రామ రామ! 61

రాముని నిశ్చయము శరణాగతతత్త్వము

కం. అని సుగ్రీవుని మంత్రులు
వినిపింపఁగఁ దమ మతంబు విశదముగా రా
మునకు సహేతుకముగ వా
నిని విని మారాడె నతఁడు నిశ్చిత బుద్ధిన్. 62

ఉ. రాముఁడు వాయుసూనుని తలంపులకుంగడుహృష్టుఁడౌచు దా
నేమి తలంచెనో యటుగనే హనుమంతుఁడు బల్కుటం గపి
స్వామిని లక్ష్మణుం గనుచుఁ వానర బృందముఁ జూచిచూచినే
నేమననా కపీశ్వరున కిప్పు డటంచుఁ దలంచి పల్కెడిన్. 63

తే. గీ. ఓయి కపిరాజ! నీదు మహోక్తి వింటి
వింటి నీ సచివుల నుడి వింటి హనుమ
నతఁడు శరణార్థి నా రక్షణార్థుఁడయ్యె
సతత శరణార్థి రక్షణ వ్రతుఁడ నగుట. 64

కం. శ్రీరామశ్శరణమ్మని
రా రాక్షసుఁడేయయినను రావనుఁడంపన్
జేరినవాఁడే యయినను
వైరికిఁ దమ్ముండైయైన వర్జితుఁడగునా? 65

ఉ. అన్నను వీడి వచ్చెఁ గద ఆపద కాలమునం గృతఘ్నుఁడై
యెన్నఁగ నన్యులన్ విడువఁడే యనఁజెల్లదు ఘోరపాపియై
యున్న సహోదరున్విడుచుటొప్పగు నుత్తమధర్మమెంచి తా
దిన్నగ వచ్చె లౌకికము తీరుఁ ద్యజించి కృతఘ్నుఁడెట్లగున్. 66

ఉ. ఉత్తమసూత్మధర్మమని యొప్పెడిదాని గ్రహించివచ్చె గా
నిత్తఁటి జ్ఞాతివైరమునె యెంచుచు రాజులు కష్టకాల మా
యత్తముగాఁగఁ జంపెదరుగా తమ జ్ఞాతుల శక్తివంతులన్
జిత్తము దుష్టమార్గమునె చెందిన రాజులఁ జెప్పనేలకో? 67

తే. గీ. జ్ఞాతివైరంబు సహజంబు జ్ఞాతులయెడ
యోగ్యులగు రాజవరులు నయోగ్యులగుచు
జ్ఞాతులఁ బరిహరింపరే ఆతతాయి
దైత్యనాథుండు జ్ఞాతినిఁ దరిమి వేసె. 68

తే. గీ. అన్న శంకింపఁదమ్మని యభిమతంబు
నతని విడిచి విభీషణుఁ డరుగుదెంచె
నంతియే కాని వేఱేమి యనఁగరాదు
కాని రిపుబలముఁగొనుట కానిపనియె. 69

తే. గీ. ఐన రాక్షసరాజ్యంబు నపహరింపఁ
దలఁచు వారముగాము నద్దాన నితఁడు
మనకుఁ దోడ్పడి రాజ్యంబుఁ గొనఁదలంచి
వచ్చె విడవడు మనల నెబ్భంగినైన. 70

ఆ. వె. హితముఁజెప్ప నన్నయే యిసీ యని త్రోసి
పుచ్చ భయముఁజెంది వచ్చె నీతఁ
డతని కంఠధ్వనియె యదియ చాటు
నితఁడు గ్రహియింపఁదగువాఁడె యెంచిచూడ. 71

తే. గీ. భరతుఁబోలు సహోదరునరయఁగలమె
కొడుకునెడఖాసి ప్రాణంబు విడుచుతండ్రి
గలుగునావంటితనయుండు గలఁడె భువిని
సఖుఁడు నీవంటివాడు భూస్థలిగలండె. 72

ఉ. దుష్టుఁడెగాని దుష్టమతితో నరుదెంచినవాడె గాని యే
కష్టము నీవిభీషణుఁడు గల్గఁగఁజేయ గలాడు శౌర్య మా
విష్టముగాఁజరించినను వీనిని జంపుట లెక్కయొక్కొ యీ
దుష్టుల నెల్ల దైత్యులను ద్రుంచెద నెంచిన వ్రేలిగోరునన్. 73

తే. గీ. రాక్షస పిశాచ యక్షాది రాజి నెల్లఁ
దలఁపు పుట్టిన మాత్రనే నిలను గూల్తు
వ్రేలికొనగోటఁ గీడేమి వీడు సేయఁ
జాలు గ్రహియింతు నీ విభీషణుని నేను. 74

మ. తన యాలింబరిమార్చి యాకటికి సంతంద్రృప్తి లేనట్టి వ్యా
ధుని రక్షించెఁగదా కపోతమతఁడెంతో తుష్టినిం జెందగాఁ
దన మాంసంబిడుచున్ దహింపబడి యాతండాకపోతంబునుఁ
గని వేడన్ శరణంబుఁ బక్కి సను బోకంగూడఁ బోఁజాలనే.

తే. గీ. సుప్రసిద్ధంబె యీకథ శూరవరుఁడ
వినవె? అడవిఁ జరించెడి విహగము వలె
నైన శరణార్థి రక్షణఁ బూనవలదె
సతము శరణార్థ రక్షణవ్రతుఁడ నయ్యు. 76

తే. గీ. వినుము తెల్పెదఁ గండుండు ముని వరుండు
మున్ను దెల్పెను శరణంబుఁ గొన్న వాని
రక్షణ మొనర్చు గీతాలు రవిసుతుండ
మౌని సూక్తుల జవదాట లేనివాఁడ. 77

కందుగీతంబులు.

తే. గీ. అంజలి ఘటించి నీవాడ ననుచు వచ్చి
రక్ష గోరెడి దీను సంరక్షణంబుఁ
బూన కాతని వధియింపఁబూనఁదగునె
యాతఁడరియైనఁ గరుణ గుణార్థ మెంచి. 78

కం. శరణాగతి యరియైనను
శరణార్థిగ వేషమూను శాత్రవుఁడైనన్
శరణంబను నంతనె వే
శరణంబిడు టొండె ధర్మ శాస్త్రము సుమ్మీ. 79

కం. ఆతఁడు దృప్తుఁడె కానీ
ఆతఁడు భీరుండె కాని అయ్యది యేలా?
ఆతని రక్షింపందగు
నాతనికొఱ కిచ్చి ప్రాణమైనను బలిగా. 80

తే. గీ. అరయ భయమునగాని మోహంబువలనఁ
గాని కామంబునను గాని వాని విడువఁ
దగదు, కలిగెడి నరకంబు దానివలన
లోకనిందింతుఁడగును ముల్లోకములను. 81

తే. గీ. సకల సంచిత పుణ్యంబు సమసి యపుడె
శరణ మర్థించువానితో జనును గాదె
విడువ శరణార్థి రక్షణ వీడు, నాదు
సతత శరణార్థి రక్షణ వ్రతము గూడ. 82

తే. గీ. ఒక్కమారైన నీవాడ దిక్కునీవె
యనెడి వానిని రక్షింతు నభయ మిచ్చి
సర్వభూతాళి నభయాన సంచరింప
వాని శరణార్థి రక్షించువ్రతము నాది. 82

తే. గీ. ఎవడను సకృత్తుగానైన నెంచి యాత్మ
నేను నీవాడనని వానికే నభయమొ
సంగెద భయంబు లేక నీసర్వసృష్టి
సతము శరణార్థి రక్షణ వ్రతుఁడ నేను. 83

ఉ. వానరనాథ యిచ్చటకు వచ్చినవాఁడు విభీషణుండె! యం
చూనగరాదు సంశయమునొక్కెడ రావణుఁడేగుదెంచినన్
బూనుచు మారువేషమును బొందఁగ రాదు భయంబు నిచ్చితిన్
వీనికి నేను రక్షనిక వెంటనె తోడ్కొనిరా విభీషణున్. 84

ద్వి. మనమున నన్నెంచి మననంబు సేసి
తనువుతో నను జేరి దాసోహ మనుచు. 85

ద్వి. పలుకుల శరణని పలుకాడుచుండి
నిలిచెనా సన్నిధి నిర్భయుండగుచు. 86

ద్వి. అమలుఁడీతఁడు సంశయంబిక నేల
సుముఖుండ నభయంబు సమదృష్టి నిత్తు. 87

ద్వి. తలఁపు వాక్కు క్రియయుఁ దనువు నొకగతి
మెలగుచుండె నతని పిలిచి తెమ్ము. 88

తే. గీ. బహుళ శాస్త్రార్థ విజ్ఞాన పరిణతియును
రాజనీతిజ్ఞతయు గల రాజు వీవ
కాదనఁగఁజాల నీ మాట కాని వినుము
పరమ ధర్మంబునే బూనిపఱగవలయు. 89

## విభీషణుఁడు వచ్చుట

కం. అని రాఘవుఁడాడఁగ నా
వనచరపతి విస్మయుఁడయి పలికెన్ రామా
కన నాశ్చర్యంబగు నీ
మనుగడ శరణార్థిరక్ష మానని వ్రతమున్. 90

కం. నీకే తగు నిటు చెప్పఁగ
లోకైకవిభుండ ధర్మలోలుండ త్రయీ
లోకంబుల ధర్మజ్ఞా
నాకుం దెలియంగ నయ్యె నాహృది మాఱెన్. 91

ఆ. వె. చంపఁదగినవాడు శరణార్థి వేషాన
గొంపముంచ రాముఁగూడ వచ్చె
ననెడి ధృఢమనంబున నిను గాంచి
మాఱినాడ నీదు మాట వింట. 92

ఆ. వె. ఆ విభీషణార్యుఁ డలరారగలవాఁడు
హితుఁడయి మనతోడ నేక మగుచు
నింతనుండి యనుచు నేగి సుగ్రీవుండు
పిలిచె నతని, తోడ ప్రేమ మీఱ. 93

## విభీషణ శరణాగతి

ఉ. రివ్వున కొండనుండి తలక్రిందుగ రామ పదాబ్జమందునన్
జివ్వున వ్రాలె మూర్ధమునఁ జేసి నతిన్ సచివప్రయుక్తుఁడై
యవ్వనజాయతాక్షుని పదాబ్జములంటి విభీషణుండనెన్
గెవ్వన రాఘవా శరణుఁ నిన్నభయంబిడగోరు దాసుఁడన్.
ఉ. ఏను విభీషణుండ దనుజేశుని తమ్ముఁడ రావణుండు పో
పో నను వీడి యంచు సభముందవమానము సేసె నంతతో
నేనినుఁ జేర వచ్చితిని నీవె శరణ్యుఁ డవంచు నెంచి నన్
బూనఁగదయ్య ఓ సకలభూతశరణ్యుఁడ రామ! రాఘవా. 95
ఉ. వచ్చితి వీడిలంక విడి బంధువులన్ ధనముంద్యజించి ఓ
సచ్చరితా మదీయమగు సర్వము నీకె సమర్పణంబుగాఁ
గ్రచ్చఱ రాజ్యజీవితసుఖంబులు రామ భవద్గతంబులే
అచ్చపు భక్తిమై శరణమంటిని గై కొనవే కృపాపరా!. 96
చం. దరహసితాననుండయి సుధామధురోక్తుల సుప్రసన్నుఁడై
శరణను నా విభీషణు నిశాచరరాజసహోదరుం గృపా
కరమగు నార్ద్రదృక్తతతులఁ గాంచుచుఁ బల్కెఁ గటాక్షవీక్షణల్.
ఆ. వె. సచివయుక్తుఁడగుచు సాష్టాంగవినతిమై
ప్రేమ శరణనను విభీషణుఁ గని
రాముఁడు వినగ నసుర బలాబలంబులు
తెలుపఁగోరె నతనిఁ దెల్లముగను. 98

## రావణబలము విభీషణుఁడు దెల్పుట

ఉ. రాముని కా విభీషణుఁడు రాక్షసరాజ బలాబలంబులున్
స్తోమము శక్తి యుక్తులును దోడ వచించె యథార్థమెల్ల ర
క్షోమహిరాజు కింకరుల సోకుల యోధులఁ శక్తిఁదెల్పె దా
నేమియుఁదాచకుండ విననెల్లరు వానరయూథముఖ్యులున్.

ఉ. తాత వరప్రసాదమున దైత్యుల ఱేడు సురాసురాళియున్
భూతములన్ని యేకమయి పోరినఁగూడ నవధ్యుఁడౌటచే
భీతి వహింపఁడెన్నడును పీడడు జీవము వారి వల్ల నీ
రీతిగఁజావు రక్షసుల ఱేనికి లేదుగదా రఘూద్వహా. 100

తే. గీ. రావణుని భ్రాత కుంభకర్ణాఖ్యుఁడరయ
పిరవరుఁడాజియందు దేవేంద్రసముఁడు
మహితతేజుండు నాకన్న; మాననీయుఁ
డా ప్రహస్తుండు సర్వసైన్యాధిపతియు. 101

తే. గీ. ఆతఁడే మును కైలాసమందు మాణి
భద్రుని గుబేరుసైన్యాధిపతిని బోరి
యాజి నోడించి విజయంబు నందియుండె
ఇంక గలఁడింద్రజిత్తు సురేశు సుతుఁడు. 102

తే. గీ. అతఁడు నిర్భేద్యకవచుఁడై యనికివచ్చు
నుడుము చర్మంపుకవచంబుఁదొడుగు వేళ్ల
నగ్నిహోత్రునిగొల్చువాఁడతఁడు తన్మ
హిమ నదృశ్యుఁడై యరుల జయింపఁగలఁడు. 103

తే. గీ. మఱి మహాపార్శ్వుఁడన నకంపనుఁడనంగ
నల మహోదరులనెడి వారధికబలులు
గలరు దిక్పాలులకు సాటి నలరు వారు
శౌర్యవంతులు బలులును సాహసికులు. 104

తే. గీ. కామరూపధరులు గలవారు పదివేల
కోట్లు లంకయందు క్రూరమతులు
వీరి నండగఁగొని విజయంబు సాధించె
రావణుండు సురల రణమునందు. 105

చం. అనఁగ విభీషణుండు, విని యార్తజనావన రాఘవుండు వ
ల్కెను హృది సర్వమెంచి యవలీలగ రావణుఁ డేడ కేగినం
గనుచు జగత్త్రయిన్ దునుమ గాఁగలవాడ సబాంధవంబుగా
ననిని వధింపకుండ నసురాధిపు బోవఁ నయోధ్య కేనహో.

చం. వినుమిదె నా ప్రతిజ్ఞను విభీషణ! పీడను రావణాసురున్
దునిమెద లోకకంటకుని ధూర్తుని సైన్యసబాంధవంబు గా
ననిని నయోధ్య కేవెడల నాజిని జంపక వాని నొట్టిదే
యనుజులపైన సత్యమునె యాడితి సత్యపరాక్రముండనై.

తే. గీ. అతలకుతలముల పితామహాదిలోక
ముల నతండెందు దాగినఁ బోయి పట్టి
కొట్టి తుదముట్ట జేసి నా క్రూరకర్ము
రాజుగాఁ జేతు నిన్నునే లంక కంత. 108

చం. అనవిని హర్షచిత్తుఁడయి ఆ రఘురాము బదాబ్జముందునన్
వినతి నొనర్చిమూర్ధమునవెంటనె పల్కె విభీషణుండు వే
దనుజులఁ జంపిలంకపురిఁ ధ్వంసము సేయుట పాల్గొనందలం
పును వెలిబుచ్చెయుద్ధమునుబూనఁగుతూహలుఁడౌటఁదెల్పుచున్

చం, అనెడి విభీషణుంగనుచు నా రఘువర్యుఁడు సుప్రసన్నుఁడై
యనుజుని లక్ష్మణుంబిలిచి యబ్ధిజలంబుల నా విభీషణున్
దనుజుల ఱేనిగా సలుపు తత్క్షణమే యనె యన్న యాన నా
తనిని సుమిత్రపుత్రుఁడు యథావిధి పట్టము గట్టె లంకకున్.

తే. గీ. త్వరితగతిఁ బ్రసన్నుండుగా వరలు రాముఁ
గనుచు గపులు హర్షంబున గంతు లిడుచు
నా విభీషణుఁ దమ వాడటంచు నెంచి
కిలకిలా రావములఁ గడుఁ గెరలినారు. 111

తే. గీ. తనదు సర్వస్వమును వీడి దైవ భక్తిఁ
దాఁ ప్రపత్తిని రాముని దరికిఁ జేరి
స్వీయరాజ్యాభిషిక్తుఁడై చెలగె నా వి
భీషణుఁడు రాఘవుని యాన విధిఁదలంచి. 112

తే. గీ. అర్కసూనుండు హనుమంతుఁ డంత సంప్ర
దించిరి కడలి దాటెడి తెన్నుఁగన వి
భీషణునితోడ నాతండు భీషణాబ్ధి
సేతువును గట్ట సూచించెఁ జేర లంక. 113

తే. గీ. సాగరోపాసనము రామచంద్రుఁడూన
సగరవంశజుఁడగువాని సాగరుండు
ప్రీతిమై గాంచి తోడ్పడు సేతువంతఁ
గట్ట మన పనియగు దాటఁగలము కడలి. 114

కం. అతఁడు దెల్పిన రీతిని
సీతాపతి కంత వారు సెప్పగ నతఁడా
రీతి నొనర్ప గఁ దలఁచియుఁ
బ్రీతిని నవ్వారిఁ గోరె విధి నిర్ణయమున్. 115

తే. గీ. రాఘవా నీకు దెల్పు వారమొకో మేము
సర్వకార్యవిచక్షణ చక్రవర్తి
నీ హితంబెగా సర్వదా మా హితంబ
యనుచు వారని వెంటనే యబ్ధియందు. 116

తే. గీ. సేతువును గట్టకుండఁగఁ జేరగలమె
లంక నాలస్య మూనఁగా రాదు కడలి
వేడఁదగు సేతువును గట్టి వేగిరముగ
నెల్లవారలమును లంక కేగవలయు. 117

తే. గీ. ఆ విభీషణు మాట ముత్యాల మూట
యదియఁ జేయఁగాదగుఁ పని యనగ వారు
రాఘవుండంత డబ్ధి తీరంబు చెంత
దర్భశయనంబుఁబూనె హుతాశనుండు. 118

తే. గీ. వేదిపై వెల్గు కైవడి వెల్గుచుండె
సాగరుని వేడఁ దోడ్పడ జలధి దాట
సర్వలోకంబులును రామచంద్రుఁ గనుచు
వేచియున్నవి ఫలితంబు వేడ్కఁజూడ. 119

తే. గీ. చారుండాసురనాథు డంతఁబనుపన్ శార్దూలనాముండు వే
పారావారము దాటి వచ్చి కనియెన్ వారాశి తీరస్థలిన్
బోరన్ సిద్ధముగాగ నుండిన కపి వ్యూహంబునుందోడనే
ఆ రక్షోపతిఁ జేరి దెల్పె కపిసైన్యాధిక్యమున్ భీతుఁడై. 120

తే. గీ. రాజ రామలక్ష్మణులిక లంక రాఁగ
సిద్ధముగ నున్నవారలు చెడుగు వచ్చు
కపులు పదియామడల మేరఁ గలరు కడలి
వోలె నెట్టుఁజూచినను వారె కానిపించు. 121

తే. గీ. చూచినాడ నొకింత యే చూడనంత
చారులను నేర్పరులఁ బంపు వారికడకు
శీఘ్రముగ యథార్థంబును జెప్పువారి
జాగు సేయఁగరాదు రాక్షసవిభుండ. 122

ద్వి. సామదాన విభేద సరణియే తగును
రామునితో నీవు రణమూనఁ దగదు. 123

ద్వి. అనుమాట లాలించి యా రావణుండు
వెనువెంట శుకుఁ జేరఁ బిల్చి పల్కెడిని. 124

## సుగ్రీవునకు రావణ సందేశము

ఉ. నీవిక బోయిరమ్ము శుక నేర్పునఁ దెల్పుము నాదుమాట సు
గ్రీవునితోడ శ్రావ్యమగు రీతిని "వానరనాథ వైరమున్
నీవు వహింపనేల? తగునే ననుదాకఁగ రాఁదలంపు ము
న్నే విధమైన శాత్రవుల మెప్పుడు కాము పరస్పరంబుగన్. 125

తే. గీ. సత్కులీనుండవీవు నిష్కారణముగ
వైరమూనఁగఁ దగునె నీవాడనేను
బ్రహ్మపౌత్రుల మాతని వంశజులము
నిర్వురము బంధువులమైతి మెంచు మీవ. 126

ఉ. ఈవహ బాంధవుండవగు ఋక్షరజస్తనయుండవౌటచే
నీవును నేను సోదరుల మెంచగ వాలియు నాకు మిత్రుఁడే
బ్రహ్మవిభువంశజాతుఁడవు చాల బలాఢ్యుఁడ వయ్యు నీవహో
యేవిధిఁ బూనినావు బలహీనుని స్నేహము వానరాధిపా?

ఉ. ఏల విరోధముంగనెద వీగతి రావణుతోడ లాభన
ష్టాలోక యింతయుం గనఁగఁ జాలవు రామునిపొత్తు వీడుచో
జాలును జేసియున్నయది సత్వరమే విడి రాజపుత్రునిన్
గాలిక వెన్కఁబెట్టుము స్వకార్యములం గమనింప సోదరా! 128

తే. గీ. తెచ్చియుంటిని రాముని దేవి ననుచు
బాధ నీకేల? దాని సంబంధమేమి?
నరుఁడు రాముండు నీవో వానరుఁడ వరయ
మఱలి కిష్కింధ కేగుము మంచిగాఁగ. 129

తే. గీ. దైత్యపురిఁజేర వశమె గంధర్వతతియు
దేవతలుగూడ రాలేరె నీవు కపులు
నరులు రాగలవారలే నా పురంబు
స్నేహమునఁ జెప్పు నామాటఁ జెవినిబెట్టు. 127

తే. గీ. నరుల స్నేహంబు వీడి నీ పురికిఁబొమ్ము
కోరి వైరంబు గొనితెచ్చి కొనెద వేల?
మన మిర్వురము మైత్రితో మనఁదలంతు
స్నేహమున జెప్పు నామాట చెవినిబెట్టు. 128

కం. అని యీ మాటల సుగ్రీ
వునితోఁ బలుకాడి రమ్ము పొమ్మిక శుకుఁడా
వనచరపతికిన్ నాకును
ఘనమైత్రి కుదురుట యొండె కర్తవ్యమగున్.'' 129

శుకసందేశము

చం. అనెడి నృపాజ్ఞ గొంచు శుకుఁడంబరవీథి ఖగంబువోలె వే
జని రవిసూను గాంచుచు నిశాచరనాథుని పల్కులన్నియున్
వినయముతోడఁ జెప్పె విను వీథిని నిల్చి యథాక్రమంబుగా
విని కినుకం గపుల్ శుకుని వేగమె పట్టుచు గొట్టి రాతనిన్.

కం. దిట్టుచుఁగొట్టుచు గ్రోళ్ళను
బిట్టుగ గ్రుచ్చుచుఁబిడికిట వేయుచు శుకునిన్
గట్టిగఁ బట్టుచు వానరు
లిట్టట్టన నేల పెట్టి రెంతయొ బాధన్. 131

కం. కలవరపడుచున్ శుకుఁడా
కులపాటున రాముఁ గాంచి కూడునె రామా
పాలకుమాట యథాగతిఁ
బాలించెడి దూతఁ జంప వానరతతికిన్. 132

ద్వి. అను నార్తి నాలించి యార్తరక్షకుఁడు
వనచరులకుఁ జెప్పె వాని వీడంగ

ద్వి. విఱిగిన పక్షాల విసువీథిఁ జేరి
మఱలుచు సుగ్రీవు మాటాడఁగోరె 134

ఉ. ఏమని చెప్పఁగాఁ దగుఁ గపీశ్వర నీదగు మాటగాగ నా
స్వామికి లోకరావణనిశాచరనాథునకున్ వచించుచో
నామెయిఁ దెల్పువాడను మహాబలవంతుఁడ వానరేశ్వరా
ఓమహనీయ యంచు శుకుఁడొప్పుగఁ బల్కఁగ భానుజుండనెన్.

## సుగ్రీవుని సమాధానము

ఉ. రామ హితుండు నాహితుఁడు రామవిరోధి విరోధి నాకు నీ
వా మహితాత్మ శాత్రవుఁడవౌట హితుండవు గావు నాకు సు
త్రాముని సూతి నీ హితుఁడు దాన హితుండవు గావు నాకు వే
ఱేమియు మైత్రి లేదు మన యిర్వుర మధ్యను రాక్షసాధిపా.

మ. అనుకంపంబు వహింపఁగాఁదగవు నీవా వాలినింబోలు చం
పను నర్హుండవు నిన్ను నీ సుతులనున్ బాంధవ్యులం జంపువాఁ
డను శీఘ్రంబుగ సైన్యసంయుతుఁడనై లంకాపురిం జేరి లం
కను భస్మంబొనరింతు నెవ్వరును నాకడ్డంబు రాలేరుగా. 137

శా. నీకుందోడుగ దేవతావిభుఁడు రానీ సూర్యలోకంబునన్
నాకంబందున దాగి యుండినను నంతర్ధానమైపోయినన్
నీకుం దప్పదు చావు వీడదు సుమీ నిన్నందునం బట్టి, యా
లోకైకవిభుండు చంపు నిను ముల్లోకంబులం దెచ్చుచేన్.

తే. గీ. రామబాణంబు గురినుండి రావణుండ
మూడు లోకాల రక్షించువాఁడు లేడు
కాసుకో శీఘ్రగతి వచ్చుఁ గాలు రీతి
మృత్యువిక మ్రింగుగా నిన్ను సత్య మిద్ది.

చం. జంపితి నే జటాయువును జానకి దెచ్చితి నంచు
చంపిన వాడు వృద్ధుడల జానకి నొంటరిఁగా
దెంపు వహించి దొంగవలె తెచ్చితి వంతియ
జంపఁగలట్టి విక్రముఁని సత్వ మెరుంగగఁ జాల

ద్వి. అనుచు సుగ్రీవుఁ డాతనితోడఁ దెల్ప
విని కని శుకునంత వాలిసూనుండు.

ఉ. ఈతఁడు దూతగాడు దనుజేశ్వరు చారుని
దూత యటంచు వీడుట యథోచితకార్యము
కేతముతోడ వచ్చి కపి సైన్యబలం బెఱుగంగ
యాతని జేనికిం దెలుప నాకసమందున నిల్చి

ఆ. వె. రాదు వెడలనీయరాదు లంక కితని
పట్టి యుంచఁదగిన వాడ నంగ
నర్కసూను వాజ్ఞ నాతని బట్టిరి
కపులు వెడలి తోడ గగన మందు.

కం. పట్టుచు గొట్టుచు హింసం
బెట్టగఁ గపులంత నతఁడు బిట్టుగ నార్తిం
బట్టఁగఁ జాలక దూతను
గొట్ట నగునె నీకె యఘము గూడదె రామా

తే. గీ. పుట్టియుండిన దాదిగఁ బొందియున్న
నా యఘంబు చెందెడి నిను నన్ను దూత
నిటుగ హింసించి చంపిన యినకులేంద్ర
అనెడి శుకుమ్ము నాలించె వార్తావనుండు.

చం. ధనువునఁ దీక్ష్ణబాణములు తాండవ మాడఁగ గొట్టువాడ నం
తన జలమెల్ల పీడి చని ధాత్రిపయింబ్రవహింపఁ జేయు వాఁ
డను మనసైన్యమెల్లయును లంకకు కాల్నడకన్‌జనంగనా
వననిధి నాథుఁడున్ విడువఁ బారము దాట డటన్న కీర్తినిన్.

తే. గీ. క్రోధవిస్ఫారితాక్షుఁడై క్రుద్ధుఁడగుచు
ధనువుఁ జేఁబూని కాలాగ్ని యనఁగ బర్వి
యుగ్రవిశిఖంబులను వీడె నుదధిపైన
నబ్ధికల్లోలమై కొండ నంట నెగయ. 154

తే. గీ. కడలి యువ్వెత్తుగా నుబ్బి కనఁగ నయ్యెఁ
జచ్చి తేలెడి జలచర జంతు తతుల
కనిరి పాతాళమున నున్న దనుజ చయము
ప్రాణభీతిని లోకంబు భయదమయ్యె. 155

శా. వాతోద్ధూతములౌ తరంగచయముల్ బాణత్రికాండంబుచేఁ
బాతాళంబును దాక సంక్షుభితమౌ పాథోధిలో జంతువుల్
సీతానాథుఁడు శౌర్యమున్ విడువకే శీఘ్రంబుగా వేయ నిం
కాతీవ్రాశుగ పంక్తి జీవతతి శోభాక్రాంతమై క్రుగ్గగన్. 156

తే. గీ. లక్ష్మణుఁడు దాని గనిపట్టి రాము చేయిఁ
బట్టి వలదింక వీడుట బాణపంక్తి
ననుచు బ్రతిమాలె నైనను వినక రాఘ
వుండు బ్రహ్మాస్త్రమును వీడ నుండి పలికె. 157

కం. ఇంకను గనబడడే నా
బింకము గనుచుండిగూడ వీడను నీరం
బింకఁగ నిసుకయె మిగులగ
సంకటమున బడఁగ నల్ల సాగరుఁడింతన్. 158

కం. చావో బ్రదుకో తేల్చెద
నీ వననిధి దాటి లంక కేగగవలె తే
దావిడిచెద బాణము లిట
నీవికఁ గనుచుండఁగఁదగు నీరధి పోకన్. 159

కం. అని లక్ష్మణు నోదార్చుచుఁ
దన బ్రహ్మాస్త్రంబు దీసి ధనువున సంధిం
చెను లోకంబులు భీతిల
నినకులతిలకుండు వీడ నెంచుచునుండన్. 160

చం. గడగడ భూమి యెల్లవణకన్ గిరులన్ని చలింపసాగ సూ
ర్యుఁడు విడ తేజముం బవలె రోధసులన్నియునిండ జీకటిన్
జడచరముల్ విభీతిఁగొన సర్వజగంబును మాయునట్లు తో
చెడి తఱినాటుఁజూ పెఁదుది సింధువె యామడ వెన్కకేగుచున్.

తే. గీ. యుద్ధరంగాన నోటమి నొప్పుకొనుచు
వైరి వెన్కకుఁబోయెడి విధము గాఁగ
సాగరుఁడు వెన్కకేగుట సంగరంబు
పగిదిఁ గనుచు బ్రహ్మాస్త్రంబు వదలనిలిపె. 162

సీ. అహిరాజనిలయమా యబ్ధిక్షోభిల్లంగఁ
బైఁబర్వి తోడరాఁ బన్నగతతి
దనుజుల సహవాసమున మనుచుండుట
వెనువెంటఁబడి రాగ దనుజతతులు
రత్నాకరుండౌట రత్నమయుండయి
బహురత్నముల దీప్తి వరల ప్రభలు
అల నదీసతుల కాన్కలు గైరికాదిధా
తువులిడు రంగులు దొలుక హొయలు

తే. గీ. ఛెంగుమని నాక మంటు తరంగతతుల
లోగి సాక్షాత్కరించె నా సాగరుండు
రాఘవుని గాంచి చేమోడ్చి రామచంద్ర
యనుచు వినయానఁ బలుకాడి మనవి సేసె. 163

తే. గీ. శరణు శరణాగతత్రాణ శరణుశరణు
శరణుపాహిమాంపాహి దశరథపుత్ర
శరణు నిఖిలలోకేశ్వర శాశ్వతుండ
శరణు సృష్టిస్థితిలయ విచక్షణుండ. 165

చం. సగరుఁడుమూలమౌట గద సాగర నామముఁ బొందినాడ ఆ
సగరుని వంశజుండవయి జన్మము నెత్తిన విష్ణుమూర్తి వీ
వగుటను నే కృతజ్ఞుఁడను భక్తుఁడ దాసుఁడ కోపమూనగా
దగునె త్వదీయకార్యము విధాయక మేగద పూన రాఘవా!

తే. గీ. పంచభూతాత్మకంబగు ప్రకృతి, సృష్టి
పంచభూతవిధుల నిర్ణయించితీవె
విధివిహితధర్మమది యెట్లు వీడఁదగును
ప్రళయమందునఁ దప్పనో రామమూర్తి ! 166

సాగరుఁడు శరణు వేడుట

తే. గీ. పంచభూతంబులును విడి వడఁగఁ దగునె
నైజగుణము వీడుచు లోతు నన్ను దాట
వీలు గలిగింప నెట్లగు వీరరామ
కాని రామకార్యము నూను గడలి కూడ. 167

ఉ. సేతువు గట్టఁజూచు నెడ సింధువుగూడ సహాయ్యమౌను నీ
కోతులు రాళ్ళు రప్పలును గూలఁగ వేయఁగ సాగరంబునన్
గాతును వాని నేను దలగల్ వడిఁదాకుచు వాని నిట్టటుల్
లోతుగ ముంచకుండవనిలో నిటు చూపెద నా కృతజ్ఞతన్.

తే. గీ. నళుఁడు నీవాడు కడుఁగడు నేర్పరి సుసు
విశ్వకర్మసుతుఁడగుట వేగిరముగ
సేతువును గట్టఁ బితవలె సిద్ధుఁడతఁడు
సేతువును నీటిపై తేలఁ జేతు నేను. 169

సముద్రుఁడు శరణుఁజొచ్చుట

తే. గీ. కోపమును వీడు రాఘవా కువలయాక్ష
ఇంక నుపసంహరింపు నన్నింకఁ జేయు
నీదు బ్రహ్మాస్త్రబాణంబు నీకె నేను
దాసుఁడను గృతజ్ఞుఁడ నమ్ము దశరథసుత. 170

మ. అనునంతం గృపఁగాంచి సాగరుని ఓ యబ్ధీశ నిన్‌గాంచితిన్
గనెద న్నీదు సహాయ్య మైనను నమోఘుంబీ శరంబౌట దీ
నిని సంధించిన దానినిన్ విడిచి దేనింగూల్పఁగాఁ జెల్లు నా
కను రాముంగని సాగరుండని యె బాణార్థంబుసూచించున్.

తే. గీ. కలదు దుర్మార్గులుండిన స్థలమొకండు
దుష్టసంహారమూర్తి నీ తూపు వీడు
మాస్థలంబుపై ద్రుమకుల్య మనఁగ నొప్పు
దాన యాభీరులు దునుమ తగినవారు. 172

ద్వి. అనునంత రాఘవుండస్త్రాశుగంబు
పనిచె ద్రుమకుల్యమును గొట్టఁ దోడ. 173

ద్వి. ద్రుమకుల్యమందున్న దుష్టజనంబు
సమసిరి రాము నిశాతబాణమున. 174

ద్వి. పాతాళగంగ వే ప్రభవించెనందు
సీతేశు బాణసంఘాతంబువలన. 175

ద్వి. జలధి నీరము ద్రావి చరియించువాడ
ఫలసమృద్ధియు స్వచ్ఛజలము లభించె. 176

ద్వి. అది మరుకాంతార మననాటనుండి
విదితమై క్షీరాబ్ధి ప్రభవించి యొప్పె. 177

చం. జలధి హితంబు సెంచి నిజశాతశరంబునఁ జంపి దుష్టులన్
సలిలసమృద్ధిఁగూర్చి ఫలసస్యసమేతముగా వరంబిడెన్
లలిత తనూవిలాసరఘురాముఁడు సాగరుఁడంత వేచనెన్
బలికె నళుండు తోడఁ దన ప్రజ్ఞను సేతువు గట్ట నేర్పునన్.

## సేతునిర్మాణము

తే. గీ. సేతువును గట్ట నుండిన సిద్ధు నళుని
సేతు నిర్మాణ మొనరింపఁ జెప్పి యితర
వానరుల దానికై తగు పరికరములఁ
గూర్చ రాముండు ప్రేముడి కూడఁ గోరె. 179

ఉ. వానరు లెల్లరుం జనిరి పర్వతముల్ బహువృక్షసంతతుల్
వేనకు వేలు దెచ్చుచు గుభేలు గుభేలున వేయుచుండగాఁ
బూనిక సేతువున్ నళుఁడు పొందుగఁ గట్టుచునుండె వారిధిన్
దానఁగలట్టి జంతుతతి దద్దరిలన్ గెరటంబు లుబ్బగన్. 180

ఉ. కొండల కొండలెన్నొ పెరకున్ వడిమూపున నుంచుకొంచు ను
ద్దండగతిన్ గుభేలున ముదంబున సాగరమందు ఆంజనే
యుండు పడన్ విసరు నూర్ధ్వముఖంబున నవ్వి నీటిపై
నుండుచు తేలుచుండెఁ గడునొప్పుగ సాగరుకూర్మి పెంపునన్.

తే. గీ. రామదర్శన సంప్రాప్తి రహిని మించి
శాంతి వహియించి తోడ్పడు సాగరుండు
ఆ ప్రపత్తి సిద్ధుఁడు తనయబ్ధి నెల్ల
నలులఁగూడఁ ద్యజించె రామార్థమపుడు. 182

తే. గీ. వెడలుపు పదియోజనములు నిడుపు నూఱు
యోజనములు సేతు వబ్ధిని నొప్పుగాగఁ
గట్టె నైదునాళ్ళకు విశ్వకర్మ సుతుఁడు
మిట్ట పల్లము లేకుండఁ గట్టిఁగాగ 183

ద్వి. వననిధి సేతువు పాపటవోలె
వినువీథి స్వాతివీథినిబోలి యుండె 284

ద్వి. కోటానుకోటులు కోతులెల్లరును
దీటుగఁ జేరిరి తీరంబు చెంత. 185

ద్వి. కిలకిలారావముల్ కెరలుచు సేయు
వలి గొను మోదాన వనచరులుండ్రి. 186

తే. గీ. మంత్రి యుతుఁడు విభీషణమాన్యుఁ డపుడు
దక్షిణాశను గదఁబూని దీక్ష నిలిచెఁ
గాపు గాయుచు సైన్యనికాయ మెల్ల
శాత్రవులు వచ్చుచో వారిఁ జంప నెంచి. 187

చం. ఇనసుతుఁడంత రాముఁ గని యీవును నీ సహజన్ము డెంచగా
వననిధి కట్టపై నడిచి వచ్చుట భావ్యము గాదు వాయుసూ
నుని భుజపీఠి నీవును వనీచరనాథుడు వాలిబిడ్డ మూ
పున నల లక్ష్మణుండును సముద్రము దాటగ నొప్పు నంచనెన్.

తే. గీ. గగనమార్గానఁ గొనిపోవ గలరు మిమ్ము
నీమహామకరాలయ మెల్ల దాటి
యనెడి సుగ్రీవు మాటల వినుచు రాఘ
వుఁడు ధనుర్ధరుండయి లక్ష్మణుఁడును సూర్య 190
పుత్రుఁలును వెంటరా సేనముందు నడిచె
వానరుల సైన్య మప్పుడు పార్శ్వములను
వెనుక భాగంబులందున వెడలినారు
చోటు చాలక గొందఱు దాటరైరి. 191

ఉ. వానరసేన దాటుట నపారపు నౌ మకరాలయంబునం
బూనిన సేతుమార్గమునఁ బోయి రఘూద్వహు వెంటనంటి లం
కానగరప్రదేశవని కాలిడె మూలఫలోదకాదులం
గానగనైన నాకడలి కావలి తీరము సమ్ముదంబునన్. 192

ఉ. దేవతులున్ మునీశ్వరులు దివ్యులు విస్మయు లౌచు నెల్లరున్
దేవవిరోధిఁ దాకగ నదీపతి దాటిన వారి నెంచుచున్
జావిక నిశ్చయంబల నిశాచరనాథున కంచు నెంచి మో
దావహులైరి రాఘవమహాత్ముని కిచ్చిరి దీవనల్ వెసన్. 193

మా. జయము జయము రామా శాశ్వతానందధామా!
జయము జయము వీరా శత్రుసంహారధీరా!
జయము జయము నిత్యా సత్యసంధా మహాత్మా!
జయము జయము జిష్ణూ సర్వలోకైకనాథా! 194

ద్వి. అని సురలు మునులు నాశీర్వదించి
రని బూనముండిన నా రాముఁగనుచు. 195

### రాముఁడు _ లక్ష్మణునకు శకునములఁ జూపుట

ద్వి. అంతట రాఘవుం డాలింగనమున
సంతసమును దెల్పె సౌమిత్రి కపుడు. 196

ద్వి. కనుచు శుభాశుభ కారణమ్ములను
నని జనక్షయ మగు నంచు లోనెంచి. 197

చం. ఫలజలముల్ సమృద్ధి గలవాడ గదా విడియంగ నిందెసేఁ
నల విభజించియుండదగు నై జగతిన్ రణమందున్సైనికుల్
విలయము సెందువా రుభయవీరుల పక్షములోని వారలా
విలయము దెల్పు సూచన లివే కనిపించెడి భీతిహేతువై. 198

## అశుభ లక్షణములు

తే. గీ. కలుషితంబయ్యె వాయువు కదలెఁ బుడమి
కంపితంబులు పర్వతాగ్రములుగూడ
విఱిగి పడుచుండె తరుతతి పృథ్విపైన
రక్తబిందుమిశ్రమము వర్షంబు గనుము. 199

తే. గీ. రక్తచందనగతి సంధ్య రాగ మూనె
రవియు నిప్పులఁ గురిపించి రగులుచుండె
కాంతిహీనుండు శశియు దుఃఖంబు గలుగఁ
బక్షిమృగతతి దీన నిస్వనము నూనె. 200

తే. గీ. హ్రస్వరూక్షంబు పరివేష మలరె రవిని
నల్లని కళంకమదె రవి నడుమఁ బుట్టె
చుక్కల గమి తేజు విడిచి స్రుక్కుచుండె
కాకులును డేగలును మఱి గద్దలెంచ. 201

తే. గీ. చిన్న పక్షులచే చచ్చుచున్నవి గద
వానరులు రక్కసులు భూమిఁ బడఁ గలారు
శైలశూలఖడ్గాదులఁ జచ్చు బలము
రక్తమాంసాదులఁ బృథివి సక్తమగుచు. 202

తే. గీ. భీకరవికారదృశ్యంబె పృథివి జూపు
చేయగలదేమి లక్ష్మణా! చెచ్చెర నిక
లంక ముట్టడింపంగనౌ జంకు లేక
నని ధనుర్ధరుండయి రాముఁ డంత సాగె. 203

తే. గీ. లంకకభిముఖుఁడై యేగు రాము వెంట
సింహనాదంబు వైరుల చెవుల సోక
నా విభీషణ సుగ్రీవు లాది యోధు
లందఱుఁ జనిరి తోడ సైన్యంబు తరల. 204

ఆ. వె. కొండ కొనను గొప్ప గోపురంబుల నొప్పు
దైత్యు లంక డాసి తలచి సీత
గుండె చెదరు నంతఁ గూడదీయుచు దాని
గుట్టు గాఁగఁ దమ్మునిఁగూడి పలుకు. 205

తే. గీ. అద్రి శిఖరంబునంగల నాసురేశు
పట్టణముఁ గాంచి రాఘవపార్థివుండు
పరిసరప్రాంతసుమఫల వనము నెంచి
చూపసాగెను లక్ష్మణుఁ జూచి ప్రేమ. 206

కం. అంతన్ వినవచ్చెను లం
కాంతరమున సింహనాద మతిభీషణమై
సుంతయు వెరువని వానరు
లంతకు మించి నినదంబు నప్పుడు సలుపన్. 207

ఉ. రావణసింహనాదములు దైత్యులు వానరులుంబ్రతిధ్వనిం
బోరుమనంగ సల్ప తటి వ్యూహముఁగా నిజసైన్యసంతతిం
దీరిచి రాఘవుండు నలు దిక్కుల యోధుల నిల్పి ముందునన్
ద్వారము చెంతఁదానిలిచెఁ దమ్మునిఁగూడి రణోన్ముఖుండుగా.

తే. గీ. అంగదుఁడు నీలుఁగూడి సైన్యంబుతోడ
సేన వక్షస్థలంబును బూనియుండె
దక్షిణపథంబు ఋషభుఁడు తనబలంబు
తోడ సంరక్షణ మొనర్పఁ గూడినాడు. 209

తే. గీ. గంధమాధనుఁడా సవ్యకక్షఁగాయ
రాఘవుఁడు శిరంబుననుండె లక్ష్మణయుతి
ముఖ్యభల్లూకవీరులు [1]ముప్వురిపుడు
కుక్షిభాగంబు రక్షింపఁ గూడిరంత. 210

1. భల్లూక వీరులు ముప్వురు:- జాంబవంతుడు, సుషేణుఁడు, వేగదర్శి.

తే. గీ. వానరులఱేఁడు వీరుండు సైనికతతి
పృచ్ఛభాగంబు రక్షింపఁ వెలయుచుండె
ఘోర రామాజ్ఞ గారుడ వ్యూహగతిని
వీరరక్షితమై సేన వెలసియుండె. 211

ద్వి. అటుగ సేనను దీర్చి యాశుకు వీడ
దిటవుగఁ జెప్పె నాదిత్యపుత్రునకు. 212

శుకుఁడు మరలుట

ఆ. వె. విడువఁబడిన శుకుఁడు వేవేగఁ జని తన
ఱేనిఁ జేరి భయముఁ బూనినాడు
ఱెక్కలుడుగఁ జూచి ఱేడు హసింపంగ
మారు వలికె మంచి మాట నొకటి. 213

ఉ. వననిధి కుత్తరాశఁగల వానరనాథునికిం ద్వదుక్తులన్
వినయముతో వచించితిని వించు వనీచరులంతఁగోపముం
గని నను మింటఁబట్టి కడుఁ గట్టిగఁ గొట్టి వధింపఁబూన నా
వనజదళాయతాక్షుఁడు కృపన్ విడిపించుట నిన్నుఁ జేరితిన్.

తే. గీ. బ్రతికి బయటఁబడుచు వచ్చితి దైత్యేశ
వానరులు నైజముగఁ గోప వశులు సుమ్మి
వారితో మాటలాడఁగ వలనుపడునె
పొంద బ్రత్యుత్తరము వీలు పొసగదచట. 215

తే. గీ. ఖరవిరాధకబంధులఁ గహనమందుఁ
జంపియుండిన రాముండు జానకి గల
లంకకరుదెంచినాడు సలక్ష్మణుఁడయి
వానరేశుని జతగూడి వనధి దాటి. 216

మ. కనుమీ రావణ కోతి మూక యదె లంకాద్వారముం జేరె వా
రినిధిన్ సేతువు గట్టి దాటి యసురోర్వీనాథునిన్ లెక్క సే
యని రీతిన్ మనవాడయందడుగు వేయంబూనియున్నారు వా
రిని బోకార్చుట లేక సీతనిడుటో రెంటేది యేన్ జేయుమీ.

చం. అన విని రావణుండు కుపితాననుఁడై శుకుఁజూచి నన్
జనకజ నప్పగింపు మను సాహస మెప్డు వహించినావు నే
నని మొనగాడ నంచెఱుఁగవా! యొసగన్ సుమ సీత దేవతల్
దనుజులుగూడి యుద్ధమునఁ దాకినఁ దాకినఁగాక నన్న హా!

సీ. పుష్పితారామభూములఁ దుమ్మెదలు మూగు
విధమున రాము నావిశిఖతతులు
కొఱవికట్టియ యేనుగును గ్రుంగఁ దీసెడి
విధమున రాము నావిశిఖతతులు
ఉడుకాంతిరశ్మి లడిగించు రవికాంతి
విధమున రాము నావిశిఖతతులు
పన్నగవిషమునఁ బ్రాణులు గతియించు
విధమున రాము నా విశిఖతతులు

తే. గీ. మూగుచేనాడొ యేనాడు మూగి క్రుంగ
దీసి తేజంబు సడలంగఁ జేసి విగత
జీవిగనొనరింపగలవో నా విశిష్ట
బాణముల రాఘవుఁడు రుచిఁ బడయగలఁడొ. 219

తే. గీ. కనియెఱుంగడు నా పరాక్రమము వాఁడు
కాలు ద్రువ్వెడి సద్దానఁ గదనమూన
నే ధనుర్వీణవాయించు నేర్పరి నని
రాముఁడెఱుగఁడు కాబోలు రణము నెంచు. 220

ఉ. నారిని లాగి శాత్రవజనంబుల మధ్యకుఁ జొచ్చి పెన్ధ్వనిన్
గూరిచి మూడురీతులఁ బ్రకోపము సేయఁగ వింటి వీణపై
వైరులు భీతచిత్తులయి పాఱరె రాముఁడు గీముఁడేడ నన్
బోరున గెల్వగాఁగలుగు పూరుషుఁడెవ్వఁడుఁ బుట్టలేదుగా.

కం. అనుచున్ శుకునకుఁ జెప్పుచు
విని సంద్రముఁదాఁటె రామవిభుఁడని తోడన్
దన మంత్రులు శుకసారణు
లనుగని పలుకాడఁ గడఁగె రావణుఁడంతన్. 222

ఉ. సేతువుగట్టి రాఘవుఁడు సింధుపుదాఁటె నటంచు వింటి నీ
రీతిగ సేతుబంధ మవలీలగఁ జేయుట గొప్ప వింతయే
సేతువు నెట్లు గట్టినది సింధువు దాటిన వైరి సైన్యపుం
జేతలు రీతులుం దెలియఁ జేయుడు మీరట కేగి రండికన్. 223

తే. గీ, రామలక్ష్మణ సుగ్రీవరాజులఁ గని
వారిమంత్రుల నెఱుఁగుచు వారి బలము
లరసి వారల యస్త్రశస్త్రాదుల, రణ
విధము గమనించి రాఁదగు వెడలిరండు. 124

ఉ. రాముని సొంపు లక్ష్మణపరాక్రమ మర్కజు తెంపు వానర
స్తోమబలంబు వాయుజుని చొప్పు నెఱుంగఁగ వేగబోండు వే
క్షేమము గాగ రండు కపిఁసేనల తీరుఁగనుంగొనందగున్
సామముతోడ నేనెఱిఁగి సంగరమూనగ నౌను వైరితోన్.225

శుకసారణుల పోక

కం. వానరరూపముఁదాల్చిరి
వానరసైన్యంబుఁజొచ్చి వానర బలమున్
గానఁగ శుకసారణులా
జేని హితము సేయఁబూనిరి ధృతిన్ వేగన్. 226

తే. గీ. కడలి కిరు ప్రక్కలను గలఁకపుల సేన
గుహలఁ జెట్లను గొండల గుట్టలందు
వెల్లి విరిసిన కపిసేన నెల్లఁగనిరి
కడలికెనయైన గపిసేన గాంచి వారు. 227

తే. గీ. కపుల రూపాన సేనలోఁ గలియఁదిరుగు
వీరి శుకసారణులను విభీషణుండు
గుఱుతుఁ బట్టుచు గుట్టును గూల్చివైచి
అమితతేజుండు రాముని కప్పగించె. 228

ఉ. వీరలు రావణాసురుని ప్రీతికరంబగు మంత్రులిద్దఱున్
చారులరీతి వచ్చి మనసైన్యపు గుట్టునెఱుంగనుండి సం
చారముఁబూనినారు మనసైన్యమునందుఁ గపిస్వరూపులై
వీర రఘూత్తమా! యని విభీషణుఁడాడుచు నొప్పగింపగన్.

తే. గీ. ప్రాణభీతిని గజగజ వణకు వారి
హస్తముల మోడ్చియుండిన యసురులఁగని
వీరలు నిరాయుధులగుటఁ జారు లగుట
ధర్మ మెంచుచుఁ జంపుట తగదు మనకు. 230

చం. అనుచుఁ బరంతపుండు బలు కాడుచు వీడుచు వారి బాగుగాఁ
గనుడు మదీయసైన్యబలగంబు విభీషణ చూపుమెల్లయున్
గని కుశలంబుగా మఱలి గాంచినదంతయుఁ దెల్పి నానుడిన్
దనుజుల ఱేనితోడుత యథావిధిఁ బల్కుఁడు చారరీతిగన్. 231

తే. గీ. కనఁగ మిగిలిన దేదేని కలదయేని
బాగుగాఁ జూడుడంతయు వచ్చియున్న
కార్య మెల్లయు నెరవేర్చి కడకుఁ జనుడు
చంపఁబూనము మిమ్మిటఁ జారులార! 232

ఉ. ఏబల మెంచి సీత హరియించితివో వని నొంటిఁజేసి ము
న్నాబలమిప్డుచూపఁదగు నాలము నందెదిరించి నన్ను సే
నాబలగంబు రేపటి దినంబురయంబున ముట్టడించి లం
కాబహుదుర్గనిర్మితము గాటిగఁ జేతును భస్మమై చనన్. 233

కం. అనుజులు సుతులును బాంధవు
లును రాక్షససేన యెల్ల డుల్లగఁ జేయన్
మనగాఁ దగ వీ విలలో
ననికిన్ సిద్ధముగ నుండుమనుడీ యతనిన్. 234

తే. గీ. ధర్మవత్సలుఁడైన నా దాశరథిని
జయ జయ నినాదములఁ గీర్తి సలిపి శుకుఁడు
సారణుఁడు లంక కేగి రాక్షసమహేశు
కెఱుక పరచిరి జరిగినదెల్ల వారు. 235

## శుకశారణుల హితవు

ద్వి. వానరరూపముల్ పూనుచు మేము
కాన వానర రీతిఁ గపిసేన నడుమ. 236

ద్వి. వెరపేమియునులేకఁ దిరుగాడు చుండ
నరసి విభీషణుఁ డారాముఁ జేర్చె. 237

ద్వి. ఆధర్మవత్సలుఁ డాకృపామయుఁడు
వేధర్మమారసి విడిచె మమ్ములను. 238

ఉ. రాముఁడు లక్ష్మణుండు దిన రాజసుతుండు విభీషణుండునున్
భీమబలంబువారు కడు వీరులు నొక్కెడనుండె సైనిక
స్తోమము లెక్కలేనిగతిఁ జుక్కలరీతిగ మీరి తోడురా
నీ మహి రేపుప్రొద్దుటనె నేర్పున వత్తురు ముట్టడింపఁగన్.

ఉ. శూరులు నస్త్రవేత్తలు విశుద్ధచరిత్రులు నల్వురొక్కెడం
జేరిరి వీరిలో నొకడె చేడ్పడఁ జేయఁగలాడు లంక న
వ్వారల వానరోత్తములఁ బల్కఁగనేల మహాబలాన్వితుల్
వీరులు చాలమంది గలరేసురనాథుఁడుగూడ నోడడే. 240

ఉ. రాముని రూపసంపదయు రామునియాయుధముల్ గనంగనా
రాముఁడొకండెమాత్ర మన లంక నశింపఁగఁ జేయనోపు నం
చేము దలంచుచుంటి మనుజేశ్వర! సేతువుగట్టినారు లం
కామహిచుట్టునుంగలదుగా కపిసేన యనంతరీతిగన్. 241

ఉ. వారలతో విరోధ మది వద్దు రణంబును వద్దు సఖ్యతం
గోరుము రామచంద్రునకుఁ గోమలి సీత నొసంగు మింక నీ
వారును నీవు సౌఖ్యముగ వర్ధిల నెంచిన గోపతాపమున్
దూరము సేసి రాఘవునితో నొనరింపుము పొందు రావణా.

## రావణుఁడు వానరవీరులఁజూచుట

ఉ. సారణ!వింటి నీదు హితసారము నేగ్రహియింపఁగల్గితిన్
వారలచేతఁజిక్కి పడిబాధల భీరుఁడవై వచింతువే
ధారుణిపుత్రి సీత నిడ దాశరథింగని చాలుచాలు నె
వ్వారలు నన్ జయింపఁగల వారలు యుద్ధమునందు సారణా.

ఉ. ఐనం జూడఁదలంతు వానరుల నాయావీరులంజూపుదే
లేనీ పోని భయంబుఁ జెందెదవె మంత్రీ రామునింజంపెదన్
గానీ వానిని జేరి సీత నిడ నాకర్తవ్యమా యుద్ధమే
దానింజచ్చినఁజచ్చెదన్ విడువ సీతన్ జీవమున్నంతలో. 244

తే. గీ. కడలి సేతువు గట్టుట కపుల రాక
గణన మొనరింపదగు మహత్కార్య మొంచ
కాని వారినెల్లర క్షణఁకాల మందె
చంపఁగలవాడ భయమేల సారణ యని. 245

ఆ. వె. పెక్కు తాళ్ళ యెత్తు పెంపెక్కియుండిన
తనదు మేడ నెక్కి దైత్యవిభుఁడు
గాంచి కడలి మించి కనిపించు కపిసేన
నెంచి తెల్పు మనియె యెవ్వరెవరొ. 246

తే. గీ. వారిలో నగ్రసైన్యాధిపతి యెవండు
రవిసుతుహితుఁడెవ్వాడొ నారాముఁడెవరి
మాట లాచరింపఁదలంచుఁదేటగాగ
సారణా దెల్పుమనియె రాక్షసవిభుండు. 247

ఉ. ఎవ్వని సింహనాదమునఁకే పురియంత వడంకుచుండెనో
ఎవ్వఁడు సైన్యయూధముల కేర్పడ ముందుగనిల్చియుండెనో
ఎవ్వఁడు లంకనేగను నహీనబలాన్విత వీరమూర్తియై
అవ్వనచారుఁ డేకపిబలాధిపుఁడారయ నీలుఁడాతఁడే. 248

తే. గీ. పర్వతశిఖరాకారుఁడై పద్మకేస
రంబువర్ణంబువాడునై లంకఁగనుచుఁ
జేతులెత్తుచునిలబడు చిన్నవాడె
అంగదుఁడు యువరాజు వా డమితబలుఁడు. 249

తే. గీ. ఇతఁడె వాలితనూభవుఁడితఁడెవాలి
యంతవాడు రణస్థలి యసురనాథ
నిన్ను దాకఁగఁ దహతహనున్నవాడు
రామకార్యార్థి సహజపరాక్రముండు. 250

తే. గీ. ఇద్ధచరితుండు హనుమంతు బుద్ధిమంతు
లంకలో సీతఁ గాంచిన రామభక్తు
నీవెఱుంగుదు వాతని నిలిచియుండె
నతఁడె రామపదద్వయి నమితభక్తి. 251

తే. గీ. ఇతని వెనువెంట నలుఁడాతఁడే సముద్ర
మందు సేతువుఁ గట్టిన యమితబలుఁడు
లంక నెల్లయు నీతఁడే జంకు లేక
కాట్రిఁగాఁ జేయఁగల విశ్వకర్మసుతుఁడు. 252

తే. గీ. ఇతఁడు పదినూఱుకోటుల యెనిమిదైన
లక్షల బలము గలవాడు లంక నెల్ల
దా నొకండె బూడిద సేయఁ దలఁచువాఁడు
పూని బలమెంచి విజయంబె పొందువాఁడు. 253

తే. గీ. శ్వేతుఁడీతఁడు సుగ్రీవుఁ జేరినాడు
సేన విభజింపఁదలకొని శీఘ్రగతిని
బోవుచున్నాడు సేనకుఁ బ్రోద్బలమిడి
వాఁడె నలుఁడు మహాబలవంతుఁడతఁడు. 254

తే. గీ. కుముదుఁడనఁగ నొప్పెడివాడు గోమతికడ
వేయి లక్షల బలమున వెలయువాఁడు
కొమరుగా నున్నగిరిని సంకోచమనెడి
వాడ వసియించి పాలించు వానరులను. 255

తే. గీ. వేయిలక్షలబలమున వెలయువాఁడు
వాఁడె దంభుండు నూటముప్పదిగ లక్ష
లబలము వెనువెంటఁగొనుచు లంకవైపు
నిశ్చలంబగు దృష్టిని నిగుడఁ జేసె. 256

తే. గీ. లంకను దహింపనెంచు వాఁడతఁడు గనుము
అతఁడు వసియించు వింధ్య సహ్యాద్రిగిరుల
నా సుదర్శనకృష్ణాద్రులందు కపుల
పాలనము సేయు శూరుండు ప్రబలబలుఁడు
కపిలవర్ణుఁడు నారంభుఁ గనుము వాఁడె. 257

తే. గీ. వాఁడు సాల్వేయ పర్వతవానర పతి
సింహనాదంబు సేయుచుఁ జెలఁగు వాఁడె
శరభుఁడనువాఁడు మరణంబు సరకు గొనక
అనిని వెన్నీయనట్టి మహాబలుండు. 258

తే. గీ. పనసుఁడీతఁడు వినతుఁడు వాఁడు గవయు
డతఁడు వీరలందఱు లక్షలాది కపుల
తోడ వచ్చుచుండిరి మనతోడ నసికి
వీరు కామరూపులుఁ గడువీరు లరయ. 259

స. యుద్ధసన్నద్ధులైయున్న యూథపులను
దెలుపువాడను గడుఁగడు తెగువ వారి
వార లొకరికంటె నొరులు బలురు రాజ
రామకార్యార్థులై లంక రాఁగలారు. 260

తే. గీ. ఆహూఁడు భయంకరకర్ముఁడరయఁగనుము
వానరేశుని కింకరవర్గ మెల్ల
చెట్లు చేమలఁ గొని వారు చేరినారు
లంక నారోహణ మొనర్ప జంకులేక. 261

తే. గీ. అతఁడు ధూమ్రుఁడు భల్లూక పతిని గనుము
కడలి వలె యనంతంబుగా గానిపించు
నా యెలుగుగొడ్లు లంకను డాయనుండె
నిఖియు భీతికరంబు లేయెందుగాని. 262

తే. గీ. పర్వతాకార ధూమ్రుని భ్రాతఁ గనుము
అన్నకంటె పరాక్రమ మతిశయింపఁ
బోరఁ గలవాడు భల్లూకవీరుఁడతఁడు
చెప్పగానేల భల్లూక సేన బలము. 263

ఉ. ఆతఁడెజాంబవంతుఁడుమహాత్ముఁడు యూథపుముఖ్యుఁడున్ గడున్
నీతివిశారదుండు గణనీయుఁడు యుద్ధములందు సుమ్మి ము
న్నీతఁడె దేవతాపతికి నెంతయొ తోడ్పడి దేవదానవ
వ్రాతమహారణంబున వరంబులఁ బొందినవాఁడు రావణా!.

తే. గీ. రాక్షసులఁ బిశాచంబుల రగడ వారు
మృత్యువన భీతిలేని యమేయబలులు
గిరిశిఖర మెక్కి బండలఁ గేల విసరి
యని నొనర్తురు వీని సైన్యంబు రాజ! 265

తే. గీ. అతఁడు దంభుఁడు రణమున నతఁడె మున్ను
సురపతికి దోడు పడినట్టి శూరవరుఁడు
అడుగు యోజన దూరంబు నిడగలాఁడు
వాఁడె సన్నాధనుఁడనెడి వాఁడు రాజ! 266

తే. గీ. వానరుల పితామహుఁడు నవ్వానికన్న
పెద్ద మృగ మొండు లేదిల దేవేంద్రుఁగూడ
యుద్ధమున జయించిన వాఁడు యోజనంబు
దూర మెత్తుగనుండెడి వీరవరుఁడు. 267

తే. గీ. అనలు సుతుఁడు గంధర్వకన్యకు జనించె
దేవదానవ రణమున దేవతలకుఁ
దోఁడుగాగ జన్మించిన వాఁడు మంచు
కొండను వసియించెడి విక్రముండుసుమ్ము. 268

తే. గీ. ఆతనింగను క్రోధనుఁడనెడి వాని
ఆత్మసంస్తుతి నెఱుఁగని యతుల వీరు
వేయి కోటుల వానరఁ వీర సేన
వెంటరా వచ్చెడిని లంక మంటఁ గలుప. 269

తే. గీ. హనుమతండ్రి యీ కేసరి యతఁడె చూడు.
పర్వతంబుల గజములఁబట్టి కొట్టి
గజతతులఁబట్టి కొండలు కదలఁగొట్టి
గజవినాశన మొనరించెఁ గట్టివాఁడు. 270

తే. గీ. వేయి లక్షల వానర వీరవరుల
నాయకుఁ డతండు దేవేంద్రుఁడో యనంగ
గంగఁగలశీరబీజంబు కడ వసించు
మహిత బలమూర్తి రణరంగధూన్యుఁడు సుమి. 271

తే. గీ. ఎట్టనై దుమ్ము రేగిన యీాదళంబు
గనుము తన్మధ్యమందు మేఘంబు వోలె
నుండిన ప్రమాది యతఁడు వీఁడు వాని
సైన్యతతులు తత్తరపడు సమర మూన. 272

కం. గోలాంగూలంబులఁగను
వేలాదిగ లక్షలాది విజయంబూనన్
గోలాహల మూనుచుఁ దమ
పాలకుని గవాక్షు చుట్టు వరలెడి వారిన్. 273

సీ. కపిల ముఖంబుల కపి వర్గముల వారు
ధవళ ముఖంబులఁదనరు వారు
పింగళ వర్ణాన బెనుముఖంబుల వార
లెఱ్ఱని మోముల నెగయు వారు
కఠిన నఖంబులు గలవారు కఱకు లౌ
కోఱల శస్త్రాల గొమరు వారు
శార్దూల సింహాల సరిపడు వారలు
తీక్ష్ణసర్పంబుల తీరు వారు

తే. గీ. పర్వతాకారులగు కపి వర్గ మరయ
వరలు నలువది వేలుగా స్వర్ణ గిరుల
యందుఁ గడుపరాక్రములు వా రమితబలులు
లంక మర్దింప వచ్చిరి రావణేశ! 274

తే. గీ. వారి నాథుండు శతవలి భాను పూజ
సతము విజయార్థియై భక్తి సలుపుచుండు
నీతని పరాక్రమంబున కెవరు సాటి
త్యాగమొనరించుఁ దనువు రామార్థ మెంచి. 275

తే. గీ. గజ గవాక్ష నీల నలులు గవయుఁ డెన్న
నొక్కొకరు పది కోటుల యుద్ధ భటులఁ
గూడివచ్చిరి వింధ్యాద్రి వీడి లెక్క
కలవి గాని కపులు వచ్చి రల్ల వారె. 276

ద్వి. వీరలందఱుఁ గడు వీరులే సుమ్మి
శూరులై లంకను జూర్ణంబు సేయ. 277
ద్వి. విడిసియుండిరి కను వీరవరుండ
తడయక నీపనిఁ దలపోయు మింక. 278
ద్వి. సారణుఁడంతతోఁ జాలింప శుకుఁడు
తా రయమునఁ జెప్పెఁ దక్కిన దాని. 279
చం. విని కనుచున్న నీకపులు వీరులు మత్త మహాగజంబుఁబో
లిన మెయివారు దుర్జయబలీయులుఁ బోరున దైత్యదేవతా
శిని సరితూగువారలు చలింపనివార లనంతసంఖ్యగా
నని సలుపంగ వచ్చిరి సుమా మనలంకను జుట్టుముట్టుచున్.
తే. గీ. వారె మైంద ద్వివిదులనఁ బడెడివారు
సుందరులు మహారూపులు చూచునంతఁ
గామరూపంబులను దాల్చఁగలుగు వారు
దేవగంధర్వశిశువులును తేజయుతులు. 281
తే. గీ. వీరలమృతముఁ ద్రావిన వార లగుట
మృత్యు వనుమాటలేని యమేయబలులు
వీరి సరిగాఁగఁబోరెడి వీరుఁడెవఁడు
లేడు యుద్ధరంగాన ఱేడఁ వినుము. 282
తే. గీ. సుముఖ దుర్ముఖు లనఁబడు ప్రముఖ వరులు
వారు పదికోట్ల బలముతో వచ్చినారు
కొండలనుబోలు మృత్యువు కొడుకు లరయ
తండ్రి సరివచ్చు వారు యుద్ధంబునందు. 283
ద్వి. వారిప్రక్కన గల వాఁడె హనుమ
శూరుఁడాతని మున్నె చూచియున్నావు. 284

రాముఁడు

చం. హనుమ సమీపమందుగల యాతఁడె రాఘవరామమూర్తి నా
తనిఁగను శ్యామసుందరుని ధర్మము వీడనివాని ధర్మమా
తని విడకుండు వాని మహదస్త్రవిదున్ మహితాస్త్రశస్త్రసం
యుతుని నల దివ్యపూరుషుని దోయజనేత్రు విశాలవక్షునిన్.

తే. గీ. అతఁడిక్ష్వాకువంశజుఁడైన వాఁడు
ఆర్తరక్షణప్రదుఁ డభయప్రదాత
మన్నుమిన్నుల శాత్రవ మార్గణములఁ
ద్రుంచఁగల జట్టి యనుపమ దోర్బలుండు. 286

ఉ. ఎవ్వని పత్ని నీవు హరియించితివో అల వాఁడె వాఁడు వా
డెన్నయముండు కోపమున నింద్రునిఁబోలు పరాక్రముండునున్
సన్నుత వేదవేద్యుఁడు విశాంపతి సూనుఁడు సత్యసంధుఁడ
భ్యున్నతిఁ గన్న వాఁడు సమరోద్ధతుఁడున్ గను రాక్షసేశ్వరా!

## లక్ష్మణుఁడు

ఉ. రాముని దక్షిణంబున సులక్షణులక్ష్మణుఁ జూడు మాతఁడే
హేమవిభాతనూప్రథితుఁ డెట్టిని కన్నులను నల్ల వెంద్రుకల్
సోముని తీరు మోముగల సుందరుఁడున్ వివిధాస్త్రసంచయో
ద్దాముఁడు రామభక్తుఁడును దాశరథీశుని సోదరుండునున్.

ఉ. ఆతఁడు నీతిశాస్త్రవిదుఁ డాతఁడె యుద్ధవిశారదుండు ప్రే
మాతిశయంబునన్ మెలఁగు నన్నకుఁ బ్రాణము సాటివాఁడువి
ఖ్యాతుఁడు దుర్జయుండు సకలాసురనాశ మొనర్పఁజాలు వాఁ
డాతఁడుబుద్ధిమంతుఁడుజయాత్ముఁడుగోపియురామదాసుడున్.

## సుగ్రీవుఁడు

తే. గీ. వీరలిద్దరి దరినున్న వీరుఁడతఁడె
అర్కసూనుండు సుగ్రీవుఁ డనెడి వాఁడు
వానరేశుండు కిష్కింధవాసి సతము
రామహితకాంక్షి భక్తుండు రామునకును. 290

తే. గీ. కమలములు నూఱు వెలుగొందఁ గనక మాల
వక్షమునఁనున్న యాతఁడే వానర పతి
మహిత రాజ్యంబు గాంచన మాల సతిని
వాలిఁ బరిమార్చి యిడె రామ భద్రుఁడెలమి. 291

## విభీషణుఁడు

తే. గీ. సచివులగు నల్వురనుగూడి సవ్యపార్శ్వ
మందు రాముని దరిఁజేరి మసలు వాఁడు
మన విభీషణుఁడే సుమ వినుము లంక
రాజుగాఁ జేసె నభిషిక్తు రాముఁడతని. 292

తే. గీ. అంతు దరి లేని సంద్రంబు లనగఁ దోఁచు
వానరుల సైన్యముంగూడి వానర పతి
వెంటరా మంత్రి యుతుఁడు విభీషణుండు
వచ్చుచున్నాఁడు నీతోడ బవర మూన. 293

తే. గీ. ఇంక కానున్న దేమియో యెంచు మీవ
వారి నిజయింపయత్నింప వలదె మనము
వానర బలంబు మిక్కుటమైన దధిప!
తెలియవచ్చిన దెల్లయుఁ దెలిపినాను. 294

కం. కని వానర సైన్యంబును
విని చారుల నుడుల దైత్య వీరుఁడు భీతిం
గని లోనడచుచుః జారుల
కనియెంబరుషంపు మాట లతికఠినముగాన్. 295

## శుక శారణులను విసర్జించుట

ఉ. మీరలు మంత్రులై యరు లమేయబలాన్వితు లంచుఁ బల్కు మీ
నేరము నెంచి మిమ్మిపుడె నిల్వుగఁ జీల్చినఁజీల్చవచ్చు నా
వైరులు మిమ్ముఁబట్టి వ్యథఁబాల్పడఁజేయుట భీతచిత్తులై
నారలు కాని మీరు మును నా కొనరించిన మేలు నెంచుచున్

తే. గీ. వీడుచున్నాడ శిక్షను వేయకుండ
మిమ్ముఁ బోలిన మంత్రుల నమ్మియుండఁ
దగదు నను వీడి చని తలఁ దాచుకొనుడు
పొండనుచు వారలను రావణుండు పంపె. 297

ఆ. వె. అంత చెంతనున్న నా మహోదరుఁగని
రాజనీతి విదుల రాజభక్తి
పరులఁజారులఁ బిలువంగ నంపు మనఁగ
జారు లరుగు దెంచినారు తోడ. 298

ద్వి. జయ జయ నాదంబు సలుపుచు వారు
దయఁ దెల్పుమని యంత దైత్యేశు కనిరి. 299

ఉ. వారలఁగాంచి రావణుఁడు పల్కెను నిశ్చలరాజభక్తి నా
వైరిని రాముఁనింగనుచు వానిఁ బరీక్ష నొనర్చిరందు వే
చారులు మీరు వానివ్యవసాయమదెట్టిదొ వానిమంత్రు లె
వ్వారలొ నిద్రవీడుచునె వాఁడొనరించుపనుల్ గనంగనౌ. 300

తే. గీ. వైరివిధము సర్వమెఱుగు చారులున్న
రాజె గాజయించెడి రణరంగమందు
గూఢచారుల గతిఁబోయి గుట్టుదీసి
రండు పొండనె రావణ రాజు వారి. 301

## శార్దూలాదులు మఱలివచ్చుట

ద్వి. వెడలిరి రాజాజ్ఞ వేగులవాంద్రు
తడయక శార్దూలుఁ దమవెంటఁగొనుచు. 302

ద్వి. మారు వేషముఁ బూని చారులు చనిరి
వారు సువేలాద్రిఁ దీరుగానున్న. 303

తే. గీ. రామ లక్ష్మణ సుగ్రీవ రాజ వరుల
నా విభీషణునిఁ గనుచు నందుఁదిరుగ
వెంటనే వారి గాంచి విభీషణుండు
వానరుల కప్పగింపంగ వానర తతి. 304

తే. గీ. వారిఁ గొట్టుచు శార్దూలుఁ బట్టి చంపఁ
దలఁచుచున్నంత రాఘవధార్మికుండు
వారి విడిపించి పొమ్మనఁ జారు లంత
బ్రతికి బయలు పడి వెడలి రాజుఁగనిరి. 305

ఉ. రాముఁడులక్ష్మణుండు కపి రాజు విభీషణుఁడాది వారలన్
మేమెుకయింతగాంచుచు నమేయబలంబునఁ జొచ్చునంత మ
మ్మామహనీయ వానరుల కప్పై విభీషణుఁ డప్పగించె రా
జా మము వారు చంపదలచం గని రాముఁడు తోడవీడుటన్.

ఆ. వె. రక్తసిక్తతనువుల నినుఁ జేరితిమయ్య
నన్ను గొట్టి తిట్టి నా శరీర
మెల్లఁ జితుక మోద నిల్లు జేరితిమిటు
కరము మోడ్చి శరణు గాంచి తుదకు. 307

ద్వి. శరణార్థి రక్షణ పరుఁడు రాముండు
త్వరితంబుగా లంక కరుదెంచువాఁడు. 308

ద్వి. విడిసియున్నాఁడు సువేలాద్రి దరిని
వడివడి సేనతో వచ్చెడివాఁడు. 309

ద్వి. ప్రాకారముల దాటి రామ విభుండు
వే కాలాంతకుని మాడ్కి విచ్చేయఁగలఁడు. 310

ద్వి. సీతమ్మ నిచ్చుటో చేయుటో రణము
చేతమందెంచుమీ శీఘ్రంబు గాఁగ. 311

ద్వి. సేనాతతాయినని విభీషణుండు
వానరులకుఁ దెల్ప వారు గొట్టిరి నన్నె. 312

ద్వి. అనుచు శార్దూలుండు మనవి సేయంగ
దనుజేశ్వరుఁడు వించు దలనుబంకించి. 313

ఉ. లోకము లన్నియుం గలిసి రూఢిగ నాపయి నెత్తివచ్చినన్
నాకము భూమియుంగలిసినన్ సురదానవు లెల్లఁ బోరినన్
నేకమలాయతాక్షి నిడ నిశ్చయ మియ్యది పోరు సల్పెదన్
రాకిక మాను నే యదియ రాఁగలయట్టిదొ యద్దె వచ్చెడిన్.

## రావణుఁడు వనచరయోధుల నెఱుంగ గోరుట

ఉ. నీవికఁ దెల్పఁగాఁదగువనీచరులందెవఁడెట్టిశూరుఁడో
యే వనచారు డేని సుతుఁ డెవ్వని పౌత్రుడొ యెంచగాదగున్
నీ వచనంబుఁబట్టి బలనిర్ణయముందగఁ జేయ నెంతు ఘో
రావహ మూన నెంచ నరులందఱశక్తి నెఱుంగఁగాదగున్. 315

ద్వి. అన విని శార్దూలుఁ డంత రాజునకు
వినిపించె వనచర విషయంబు లెల్ల. 316

తే. గీ. ఋతరజజుండు సుగ్రీవుఁ డెంచ బలుఁడు
దుర్జయుఁడు వాడు సుమ, గద్గదుని సుతుండు
జాంబవంతుండు వృద్ధుండు సాహసుండు
ధూమ్రుఁడునుగూడ నా గద్గదుని సుతుండె. 317

తే. గీ. ఎవ్వఁడఱాదిదైత్యుల నెల్లఁజంపె
నా హనుమ తండ్రి కేసరి యనెడి వాఁడు
గురుని సుతుఁడు సుషేణుఁడు వరుణసుతుఁడు
సౌమ్యుఁడు దదిముఖుం డల చంద్రసుతుఁడు. 318

తే. గీ. మృత్యువునె వానరాకార మెత్తఁజేసె
బ్రహ్మ యననొప్పు ముప్వురు వరలు సుముఖ
దుర్ముఖులు వేగదర్శియు దుష్టమతులు
నీలుఁడనువాడు కపిసేన నేలు వాఁడు. 319

తే. గీ. అనిలు సూనుండు, నింద్రుని మనమఁడాత
డంగదుడు మైంద ద్వివిదులనంగఁ నొప్పు
నశ్వనీదేవతల సూను లరయ నింకఁ
బ్రలయ కాలాగ్ని తుల్యులౌ వారు గలరు. 320

తే. గీ. గజుఁడు గంధమాధనుఁడును గవయుఁడును గ
వాక్షుఁడును శరభుఁడు వీరలైదుగురును
యముని సూనులు తమతండ్రి సములు వీరు
క్షేత్రజుఁడు కేసరికి వాయుపుత్రుఁడరయ. 321

తే. గీ. దేవతల కిట్లు పుట్టిన ధీరవరులు
గలరు పదికోట్లు వీరి పేరుల నెఱుంగ
నలవికాదు వీరందఱు నతుల బలులు
యుద్ధమును గోరు వారె ప్రసిద్ధ కపులు. 322

చం. ఎవఁడు వధించెనో ఖరుని నెవ్వఁడు దూషణునిన్ వధించెనో
ఎవఁడిలఁగూల్చెనో త్రిశిరు నెవ్వఁడు జంపె విరాధునిం గబం
ధువరపరాక్రముండతనితో సరి వచ్చెడి వారు లే రిలన్
బవరమునం దొకండె మన వారల నెల్లరఁ జంపె దండకన్.

ఉ. ఆతఁడు సద్గుణాకరుఁడు నాతని వర్ణన సేయ శక్యమే
ఆతని తమ్ముడున్ ఘనుఁడు నాతని బాణముఁదాక నింద్రుడేన్
భూతలిఁ జేరు చచ్చి గజమున్ సరిపోలు బలంబు వాఁడు వి
ఖ్యాతకులంబునన్ దశరథాత్మజులై జనియించి రిర్వురున్. 324

కం. జ్యోతిర్ముఖుఁడును శ్వేతుఁడు
సూతులు రవికెంచ వరుణ సుతుడొండు కలం
డాతఁడల హేమకూటుఁడు
పూత నలుఁడు విశ్వకర్మ పుత్రుఁడు జుమ్మీ 325

తే. గీ. వసువు పుత్రుండు దుర్ధరవరుఁడు బలుఁడు
నీవిభీషణునే లంక నేతగాగ
రాముఁడభిషిక్తుఁ జేసెఁ బోరాడవాఁడు
రాఘవునివెంట వచ్చెడి రాజవినుము. 326

ద్వి. వినినది కనినది వినిపించి నాను
కనుమీవ కాగల కార్యంబు తెలవు. 327

ద్వి. అనునంత శార్దూలుఁ డా రావణుండు
మనమున భయమొంది మంత్రులఁ బిలిచె. 328

సీతకు రాముని మాయశిరంబుఁజూపుట

ద్వి. మంత్రులతోఁగూడి మంతనంబుండి
తంత్రంబుతో సీత దరిఁజేర నెంచి. 329

ద్వి. దురితు మాయావి విద్యుజిహ్వుఁ బిలిచి
పరికించి మాటాడె సరిగ తంత్రంబు. 330

కం. శిరమును రాముని విల్లుని
శిరమును సృజియించి తెమ్ము సీతకుఁజూపన్
శరమున శిరమును గ్రుచ్చుచు
మరణించెను నీదు భర్త మహిజా యనఁగన్. 331

ద్వి. వాఁడియ్యకొనునంత వానికొసంగె
జేడు భూషణ మొండు ప్రీతిమై యపుడు. 332

చం. సరగున వాఁడు రాముఁ దల సన్నిభమౌశిరమున్ సృజించి యా
శిరమును గ్రుచ్చి బాణమునఁ జే ధను వూనుచు వెంటనంట నా
సురవిభుఁడేగి సీతను అశోకవనింగని మోసగింప నా
తురమునఁ జూపి రాముతలఁదూపున రాముఁడు చచ్చెనంచనెన్.

ద్వి. ఖరుని జంపినవాడు ఖండింపఁబడియె
శిరమదే గనుమీవ సీతరో యింక. 334

ద్వి. విగతజీవుఁడు రాముఁ బ్రేమింప నేల
వగపేల సుఖియింపు భార్యవై నాకు. 335

ఉ. నేనికఁ గోర నెంచ నను నీవె గ్రహింపఁదలంతు వీవికన్
బూనుము సర్వసౌఖ్యములఁ బొందు మదీశ్వరివై సపర్యలన్
నా నలినాక్షు లెల్లరు ననారతమున్ నిను గొల్చు వారలో
జానకి మంగళార్ద్రి వ్యధ చాలిక దుర్దినముల్ గతించెగా. 336

చం. వననిధి దాటి చెంత శ్రమ వాయగ వానర సేన మధ్య సు
ప్తిని గను రాము వాని కపి వీరుల నర్కజు నంగదాదులన్
దునిమిరి దైత్యసైనికులుతోయధి దాటుచుఁ గొందఱాకపుల్
వెనుకకుఁ బాఱ లక్ష్మణుఁడు వేచనె వారలఁగూడి నేడకో. 337

కం. ఈ పురి గాల్చిన హనుమయు
నేపగు కపిబృందమెల్ల నేగిరి దివికిన్
ప్రాపిక నీ కెవరుండిరి
నీపయి మక్కువ గలట్టి నేనే యుంటిన్. 338

ద్వి. ఆ ప్రహస్తుఁడుఁ జంపె నరుల ఖడ్గాన
నీ ప్రియు మెడ గొట్టి నేఁగనఁ దెచ్చె. 339
ద్వి. ఆ విభీషణుఁడంత నాకాశవీథిఁ
బోవఁజూడఁగఁ బట్టె పోనివ్వ రతని. 340
కం. గుట్టల గొండల గుహలను
బట్టిరి కొందఱు భయపడి వానరులంతన్
దిట్టరులై నడిరేయిని
గొట్టరి నా సేన పాఱఁ గోతుల మూకల్. 341
కం. కనుమీ నీవెనిమిటి తల
కనుమీ వాని విలుఁ దూపుఁ గాంచకఁ జింతన్
మనుమీ నాభార్యగ నిం
కను బింకంబదేల కమలదళాక్షీ. 342

## సీత విలాపము

కం. కైకా నీకత మున గద
నా కిటు వైధవ్యమరయ వంశవినాశం
బే కద భరతాదులు విని
నాకంబునకేగరొక్కొ నాగతి యేమో? 343
కం. అనుచున్ రాముని తల మూ
ర్కొనుచున్ వైధవ్య మొఁటుగఁ గూడె సదాచా
రనుగద ముందుగ నీవే
గనితే మరణంబురామ కారణ మేమీ? 344
ఉ. నేనొక యింతయేని యఘమేకన భర్తల కిట్టిచావు స్త్రీ
కానఁగనైన పాపగతి కారణమందురు నేపవిత్రనే
ఓ నళినాయతాక్ష రణయోధుడ నన్నిటఁగావవచ్చి నీ
వే ననుఁజూడకే తనువు వీడితివే కత మేమి రాఘవా? 345
తే. గీ. బాములనుబాసి నినుగూడి భాగ్య మబ్బె
నని తలంచితి నల్పాయు వయ్యె నీకు
జ్యోతిషికుఁడాడె చిరజీవ మొందెదనుచు
నద్దియు నసత్య మాయె నే మయ్యె నాథ! 346

తే. గీ. బుద్ధి భ్రమియించె వారికి నెద్దియైనఁ
గాల మనివార్యమౌ గతి కారణంబొ
లేగఁ బాసిన ధేనువు రీతిఁ గాగ
నత్త కౌసల్య యెంత శోకార్తిఁ బడునొ! 347

తే. గీ. నీతిశాస్త్రజ్ఞుఁడవె, కడు నేర్పరివిని
ఏ యుపాయంబు నేనియుఁ జేయఁగలవె
యీ విధంబున నేమఱితీవు నాథ?
హతుఁడవైతివె! రాఘవా! హతుఁడ వీవ! 348

ఆ. వె. కాళరాత్రి నిన్నుఁగాఁ జేసెఁ గాబోలు
విధవ బ్రతుకు నాకు విహిత మగుట
నెఱిగి యెఱుగక మది నే యఘ మెంచితొ
దిక్కు లేని దాన దీన నైతి. 349

ఉ. చిన్నతనంబునందె నినుఁ జేరిన నే సహచారిణింగదా
నిన్నె యనువ్రతంగద వనిన్ నినుఁ గూడగ వచ్చియుంటిగా
కన్నొక యింత విప్పినను గాంచ వదేమి యనాథనాథ ఓ
సన్నుత రామచంద్ర యొక సద్వచనంబును బల్కవేలకో. 350

చం. సతతముఁ బూల పూజ గొని సాధుజనావన దీక్షనుండి. భూ
తతతుల రక్షసేయఁగల ధర్మము నేడిటు రూపు మాసి భూ
పతనము సెందె నెట్లు రఘువర్య మహాత్ముఁడపూరుషోత్తమా?
కత మది యేమి నీదు ఘనకార్ముక మీగతిఁ జెంద రాఘవా! 351

ద్వి. చేయిఁ జేతిని బెట్టి చేయవే ప్రతిన
ఈ యభాగ్యను వీడ నెప్డు నేననుచు. 352

ద్వి. ఆ వివాహంబునం దటులాడి యిటుగ
నీ విపత్తున ముంచి యేగితే నీవు. 353

చం. ఖరుఁడతి భీకరాకృతుఁడుఁ గార్ముక వీరుని వాని సేన నొ
కరుఁడవె చంపినావు కద కాలము మారిన దొక్కొ! యొక్క ము
ష్కరుడిటు నిద్రనున్న నినుఁ జంపఁగ నేమఋపాటుఁజెందితే
పరపురముం బయింపఁగలవాడవు వీరుఁడవయ్యు రాఘవా!

చం. పరిణయ మాడి యుంట ననుఁ బట్టి విపత్తిటు నీకు వచ్చె భూ
వర వని రాఁదలంప నను వద్దని చెప్పిన నీదు మాట నే
నరయక వచ్చియుంటి నిటు లాపద మూడఁగఁ జేసియుంటిగా
వరగుణ నీ శిరంబు విలు బాణముఁ జూడఁగ నయ్యె రాఘవా!

తే. గీ. పూర్వజన్మఁ గన్యాదానముఁ జెడగొట్టి
యుంటినేమొ ప్రతిఫలంబు నొందితి నిటు
పరమధార్మికమూర్తికి భార్య నయ్యు
బాములకుఁ బాలు పడితి నభాగ్య రీతి. 356

ద్వి. భార్యనై మృత్యువై పరగితి నేను
భార్యఁ గాకున్న నేబాములే లేవు. 357

ఆ. వె. పరమ పదమునందు వరలెడి యిక్ష్వాకు
వంశవీరులగనఁ బఱగినావె
తండ్రి తాతల నటఁ దమితోఁడఁ జేరితే
భార్య నన్ను వీడి భవ్య చరిత. 358

తే. గీ. ముప్వురేగిరి వనినాడు ముప్వు రందు
నీవ యొక్కడవే వచ్చి నావ దేల?
యనుచు కౌసల్య ప్రశ్నింప నామె కేమి
లక్ష్మణా చెప్ప నెంతువు రాముఁగూర్చి. 359

ఉ. ధీరుఁడు రాముఁ డాజలధి తీరమునన్ నిదురించుచుండ నా
వీరు శిరంబు ద్రుంపఁబడె వీడఁగఁ బాణమునంచుదెల్పెదో
ధారుణి పుత్రి లంక రిపుదైత్యుని బందిగ నున్న దందువో
ఆరయ నత్త శాంతిఁగనునా మరణింపదె గుండె బ్రద్దలై. 360

ఉ. రావణ! రాఘువాన్వయము రామ కతంబున నాశ మాయె గా
నా విభుఁ జేర్చి నన్నుఁ దహానంబొన రింపుము ధర్మపత్నిగా
నీ విభవంబు నిన్నుఁ గననేరదు సీత యొకింత యేని, యీ
జీవితముం దృజింతుఁ బతిఁ జేరెద నాకమునంద యేనియేన్.

## రావణుఁడు వెడలుట

కం. అని విలపించెడి సీతను
గనుచుండఁగ రావణుండు గబగబ భటుఁడా
యనఁ బిలిచెను మంత్రులు వెం
టనె రమ్మనుచుండి రని హాత్తుగ వెడలన్. 362

తే. గీ. రావణుండేగు నంతట రాము తలయు
తూపు విల్లును మాయమై తోచెనంత
మంత్రిసహితుండునై వాఁడు మంతనంబు
సలిపి రామకార్యంబు నిశ్చయ మొనర్చె. 363

తే. గీ. సైన్యనాథులఁ బిలిపించి సైన్య మెల్ల
రాఁ బిలువ నంపనిడె నాజ్ఞ రాగ వారు
భేరి దృఢముగా వాయించి పిలువఁ గోరె
కారణ మెఱుంగకయె వారు కదలిరాగ. 364

ద్వి. అటు సల్పినారు సైన్యాధిపు లపుడు
పటపట భేరులు వాయింపఁబడియె. 365
భేరీనినాదంబు వెడలె దిక్కులకు
ఆ రావణుని సైన్య మంతయు వచ్చె. 366

## సరమ యూరడింపు

కం. ఆ సురపతి మున్నంపిన
ఆసరమా సతి విభీషణార్యుని యిల్లా
లా సమయంబున సీతను
వాసిగ నోదార్చె సఖిగ వారని ప్రేమన్. 367

ద్వి. అట కాపలాయున్న ఆసరమంతఁ
దటుకున విచ్చేసి ధాత్రిజ కనియె. 368

తే. గీ. అమ్మ! సీతమ్మ! నమ్మ రాదమ్మ నీకు
దైత్యనాథుఁడు సెప్పినదాని నీవు
రాఘవుఁడు లోకనాథుండు బ్రతికియుండె
సలుపవచ్చెను రణము రాక్షసులపైన. 369

మ. అవనీనాథుఁడు లోకరక్షకుని చావా నమ్మగానౌనె సం
భవమా సేతువుగట్టి యుద్ధమునకై భద్రంబుగా రాఘవుం
డరుదెంచెన్ విను మమ్మ యయ్యవియె సీతా! భేరినాదంబు లీ
పురియందెల్లెడ నీకురాఘవుని చావుందెల్పె మోసంబుగా. 370

మ. విదితాత్ముండునురాఘవుండును ధనుర్విద్యామహావేద్యుఁడున్
దుది లేనట్టి పరాక్రముండునగు నాదుష్టారిసంహారియా
నిదురంజెందుటయా! నిశాచరులు వానింజంపుటా! మోస మి
య్యది దైత్యేశుని మాట నమ్మవల దమ్మా సత్య మేనాడితిన్.

తే. గీ. నీదు సద్గుణచయమున నీకుఁ బ్రియను
జెలియ హితురాలనైతిని జెట్టు చాటు
దాగి దైత్యేశుఁడాడిన తలఁపు వింటి
మూర్ఛఁదేరుము సీత రాముండు వచ్చె. 372

ఉ. రాముఁడు యుద్ధవీరుఁడదె లంక సమీపముఁజేరె సైనిక
స్తోమముఁ గూర్చు రావణుఁడు తొందరఁగా. రణభేరిమ్రోతలన్
భూమిజ అయ్యవే ధ్వను లపూర్వముగా వినవచ్చుచుండె నా
కాముకుఁడేగె నిన్విడిచి కారణ మియ్యదె మంతనంబుకై. 373

తే. గీ. రణ మొనర్చెడి గతిఁదెల్పు రథచయమ్ము
గజము లశ్వములును గబగబఁ జనుచు
ధ్వను లవే విను రావణ పతనమింకఁ
దప్పునే లంక నాశంబు దప్పు నొక్కొ! 374

తే. గీ. రావణుని జంపి సీతమ్మ రామ విభుడు
నిన్నుఁ గొనిపోవు శుభమగు సన్నుతాంగి
పాము కుబుసంబు విడిచెడిభంగి నీకు
బాములికఁ బోయి మంగళంబగును గాదె. 375

కం. అంతర్ధానంబయ్యెన్
వింతగ రాఘవ శిరంబుఁ విల్లున్ శరమున్
కాంతా! మాయాకల్పిత
మంతయు నని యిదియె తెల్పు సరయుము నీవే. 376

కం. అని యోదార్చెడి సరమను
గని ధాత్రిజ గొంత శాంతిఁ గాంచుచు దైత్యే
శుని మాయను గని సరమను
గొనియాడె సఖిని శుభంబు గోరెడి దానిన్. 377

ద్వి. శోకార్తి వీడిన సుశ్లోక్యఁ గనుచు
రాకేందువదన సరమ పలుకాడె. 378

ద్వి. ఆకాశమునఁ బోయి యా రాము కడకు
నీకాంత సుఖమని నేఁజెప్పఁ దలఁతు, 379

ద్వి. గరుఁడుని రీతి నాకాశమందేను
జరియింపఁగల దాన సాధ్విరో నమ్ము 380

ద్వి. అనెడి సరమఁ గాంచి యామెను మెచ్చి
చననొప్పు దానవే సంశయంబేల. 381

ద్వి. కాని నాయెడఁ బ్రేమఁగలదాని వైన
పూనగాఁదగు కార్యముం జెప్పుదాన. 382

ఉ. మాయలమారి రావణుఁడు మాటికి మాటికి భీతి గొల్ప నేఁ
డాయుచు శాంతి మూర్ఛిలుచు బాధకు లోనగుచుంటి నేడు నీ
వాయమమూర్తిచిత్తమెటువర్తిలుచున్నదొ సంగ్రహించి రా
యీయమ కోరుచుండెఁ జను మీవ కృతజ్ఞతఁ బూనుదానగా.

కం. అని కన్నీళ్ళఁబలుకు సీ
తను గని మోమును దడుముచుఁ దప్పక యిపుడే
చనుదాన నెఱుంగుచు నా
తని మది మఱలి వివరించు దానను దానిన్. 384

## సరమ వెడలివచ్చుట

చం. అని సరమంత నేగి యసురాధిపుఁగాంచుచు మంత్రియుక్తమౌ
తనమున వాని నిశ్చయము తావిని వెంటనె సీతఁ జేరి యా
సనమిడ నామెఁగౌగిలిడి సారసనేత్రకుఁ జెప్పసాగెఁదా
గనినది విన్నదెల్లయును గంటకుఁ డాసురనేత సన్నిధిన్. 385

తే. గీ. రాముఁరణమున నోడించు రాజనీతి
మంత్రులనుగూడి యోజించు మంతనమున
రావణునితల్లి కైకసి రాజమంత్రి
వృద్ధుఁడగు వాడు యోగ్యుఁడవిద్ధుఁడటకు
వచ్చి హితముగా ననిరి రావణున కపుడు. 386

తే. గీ. సీతఁగొని నీవె రాముని జేతఁ బెట్టు
నాశనముఁ బొందకుము రావణా యటంచు
జ్ఞప్తిఁగను ఖరుఁడాది రాక్షసుల నెల్ల
మున్ను దునుమాడియుండె రాముండె యనుచు. 387

చం. కడలిని దాటి వచ్చి రఘుకాంత వనాంతరమందు నుండ నా
బిడఁగని యుద్ధమందసుర వీరుల నాహనుమంతుఁడొక్కఁడే
మడియఁగఁజేసె నా హనుమ మాడ్కి నెవండిలఁ జేయఁజాలు నీ
విడుమిక సీత రాముకని యెంతయొ తల్లి యవిద్ధుఁడాడినన్.

తే. గీ, విడువనొల్లడు నిను సీత వీడఁగలఁడు
రణమునందు మృతుండయి రాముచేత
రావణుడు మంత్రియుతుని మంత్రార్థ మదియె
చావు దరిఁజేరుచుండె నిశాచరేశు. 389

తే. గీ. ధనము విడనాడునే లుబ్ధ ధనికుఁడెపుడు
రావణుని జంపి నినుఁగొను రాముఁడింక
మీరలిర్వు రయోధ్యకు మరలఁగలరు
సీత పద్మాక్షి నామాట స్థిరము సుమ్మి. 390

తే. గీ. పూజసల్పుము నాదిత్యుఁ బుణ్యచరిత
లోకబాంధవుఁ డాతఁడు నీకు మేలు
సేయు మంగళ రూపిణీ సీత సతము
రవిని బూజింప శుభమగు రహి నొసంగు. 391

ద్వి. అనుచు సరమ పల్కు నంత వినఁబడె
ఘనశబ్దమూ లంక కదలుచున్నటుగ, 392

ద్వి. చెలరేగె వానర సింహనాదంబు
బిలబిల రాక్షసుల్ బెదరి పాఱంగ. 393

ద్వి. లంకనాశనమౌను రాజు దోషాన
ఇంకఁ జత్తుమనుచు వా రెంచినారు. 394

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. వైరి సహోదరుండయిన వానినె నీవు గ్రహించినావుగా
చారులు వచ్చి నీదు బల శక్తి నెఱుంగఁ ద్వదీయ సేన సం
చార మొనర్చి పట్టుబడఁ జంపక వారల వీడినావుగా
అరయఁ జేయిమోడ్పునఁ గృపాకరమూర్తివి గావె రాఘవా!

ఉ. వైరులఁ బ్రేమఁ జూచెడి స్వభావము నీయది భక్త కోటికిన్
ధీరుఁడ వౌచుఁ బ్రోవ వెనుదీయవుగా శరణార్థి రక్షణో
దారమహావ్రతంబు గురిఁ దప్పవుగా నెటు లేది వచ్చినన్.
గోరిన గోరకున్నఁ గృపకున్ వెనుకాడనివాడ రాఘవా! 396

ఉ. నీవు కృపాపరుండవయి నెమ్మి ననున్ గ్రహియింపఁ గోరెదన్
బ్రోవఁగ నెంతు నిన్నె కరముల్ జత సేయుచు నీవొకండవే
కావఁగలాడవంచు విడి గర్వము సర్వము సర్వదా హృదిన్
నీవ వసించి నాయఘవనీలతఁ ద్రుంచుము రామ! రాఘవా!

ద్వి. మనసు వాక్కును గర్మమును నీకె రామ!
తనివితో నర్పించు దాసుండు వీఁడు.

శరణాగతాశ్వాసము సంపూర్ణము.

ఇది శ్రీ గోవిందరామాయణమున, పట్టాభిరామ కావ్యమున
ద్వితీయ శరణాగతాశ్వాసము సంపూర్ణము.

శ్రీ రామాయనమః

# శ్రీ గోవింద రామాయణము

## సంగ్రామాశ్వాసము

కం. కాలము కర్మము నొకటై
లీలగ వర్తిల్లు జన్మరీతి నెఱుంగం
జాలమి దేహ లహంకృతి
పాలౌదురు కర్మ మూను పట్టున రామా! 1

### మాల్యవంతుని హితోపదేశము

కం. కోపము చాలింపుము నీ
పాపంబే హెచ్చె పుణ్య ఫలము నశించెన్
గాపుర ముందునె పుణ్యము
పాపంబొనరించువానివాడ సతంబున్. 2

కం. తపమున వరముల గొని పా
పపుపను లొనరించినావు వరుసగ బుణ్యం
బిపుడేమియు లే దరయుము
సఫలంబగు కర్మఁ జేయఁజాలవు వినుమీ. 3

కం. వానర భల్లూకంబులు
మానవులును నీకు గారె మారకు లరయన్
దానవులును దేవతలును
బూనరు నిను జంపవరముఁ బొందుట నటుగన్. 4

సీ. పిడుగుల రక్తంబుఁ బెనుగాలితోఁగూడి
ఘోరమేఘావళి గురియుచుండె

అశ్వ మత్తేభ చయము రోదనమ్ముసేనఁ
గన్నీళ్ళఁదొడదొడఁ గార్చుచుండె
ధ్వజపటలంబు వివర్ణంబుగాగ మ
లినయుతంబయి ప్రభ లేకయుండె
గోమాయు గృధ్ర సంకులమయి వాని య
అపుల భీతిలుచుండి లంకయుండె

తే. గీ. నల్లనౌ స్త్రీలు గృహముల నెల్లదూరి
వస్తుతతిఁ దోచు కలవచ్చెఁ వారు నోరు
విప్పి హసియించుచుండిన విధమె దెల్పు
స్వప్నములె గాంచుచుండిరి పౌరతతులు. 5

తే. గీ. ఆవులకు గాడిదలు పుట్టె నగుచునుండె
ముంగిసలు పందికొక్కులు మోద మూని
కలిసి తిరుగాడుచున్నవి పులులతోఁడ
గూడుచున్నవి పిల్లులు గుములు గూడి. 6

తే. గీ. ఊరబందులు కుక్కలు నొకటిఁగాగ
దిరుగుచున్నవి దైత్యులు నరులు కిన్న
రు లోక రీతి నున్నారు వారలఁ గనంగ
రక్త పాండుర వర్ణ సంయుక్త పాద
యుగళి దైత్యావాసంబుల నెగురుచుండి
దైత్యవినాశనమే కపోతతతిఁ దెల్పు
విధివిధానమె సూచించు విధము గాగ
కనుము రావణ నీ లంకఁగనుము వాని. 7

ద్వి. శారికాళియు వీడి సరసగీతంబు
క్రూర నినాదమే కూయుచునుండె. 8

తే. గీ. పశులు మృగంబులును బరస్పరము కలహ
మూని యొండొంటిపై కేగి పోరు సలుపు
చుండి ఆదిత్యు వంకకుఁ జూచుచుండి
రోదన మొనర్చుచున్నవి భూధవేంద్ర. 9

ద్వి. ముండిత శిరమునఁ బురుష రూపాన
దండంబు ధరియించి దైత్యుల యిండ్ల. 10

తే. గీ. భీకర కరాళముల గృష్ణ పింగళుండు
గాగఁ బవలు రేలును దిరుగాడు చుండె
మృత్యుదేవత యిదె యిట్టి వెన్నొ లంక
యందు దుష్టసూచన లుదయంబు నొంది
నవసుర విభుడ ఉత్పాత మరయు మీవ. 11

ఉ. రావణ రాజనీతికన లక్షణముల్ పరికింపు మిప్పుడేన్
నీవరితోడ సంధికగునీతి గ్రహింపుము వైరి శక్తినిన్
లావు గ్రహించుచుం గనబలంబు యథార్థగతిం దలంచుచున్
ధీవరుఁడైన రాజు వెనుదీయఁడు సంధి నొనర్ప నెన్నడున్ 12

తే. గీ. రాజనీతివిశారద రాఘవుండు
బలసమేతుండు నీకంటె వానితోఁడ
వైరహేతువు సీత నవ్వనిత నింక
రాఘవున కిచ్చుటే తగు రావణ విను. 13

తే. గీ. దేవతలు మౌనులును రామ భూవిభునకె
విజయ మెంచుచునున్నారు విడువ కెపుడు
తపము గావించుచున్నారు ధర్మ మెంచి
రాఘవునితోడ కయ్యంబు రావణ విడు. 14

తే. గీ. ధర్మపక్షము సురలు నధర్మపక్ష
మసురులును గాగ సృష్టించె నాది బ్రహ్మ
ధర్మము కృత యుగాన నధర్మము కలి
యుగమునందు జయించుచు నుండు రాజ! 15

తే. గీ. దిగ్విజయ మొంద లోకాన దిరిగి తిరిగి
ధర్మమును బాసి యుంటి వధర్మ మూని
అద్ది క్రమవృద్ధిఁ జెందెఁ గర్మానుసరణిఁ
దాన ధర్మపరుఁడు రాముఁ డూనుజయము. 16

ఉ. వైరి బలంబు నెంచి నిక బాహు బలంబునఁ దూచిచూచియే
పోరును వైరికంటె బలముంగలవాఁడగు నేని; రాముఁడా
ఘోరమణుండె గెల్చునని పోరుఁ దలంపక సంధిఁజేయు మీ
వైరికి లొంగు శక్తి గలవాఁడవు నీవు గ్రహింపు సత్యమున్. 17

ఉ. చారులు రామరాజ బలశక్తుల నన్నిటి నుగ్గడింపగా
వారలఁదిట్టి పంపితివి వైరి హితంబునె గోరి రంచు నీ
వారలు నీ హింతబె గను వారలు మంత్రులు నట్లె సెప్ప న
వ్వారల నీసడించితివి వద్దిక రాముని తోడ వైరమున్. 18

ఉ. రాముని కిచ్చి సీత నిక రావణ సంధి యొనర్పఁగాఁ దగున్
రామునితోడఁ బోర రణరంగము నే వరియింతువేల సు
త్రాముఁడుగూడ రాఘవునిఁదాకి జయింపడు సంధి సేయుమీ
రాముని గీమునిం దలప రాదనరాదు నరుండె వాఁడహో! 19

తే. గీ. రాక్షస బలంబు పొగచూరె రాజధర్మ
దక్షత మునుల యగ్నిహోత్రంబునుండి
వెలువడెడి ధూమమున, రామ విజయ మెంచు
ఋషుల కృషి ఫలించెడి సత్య మెంచు మీవ. 20

తే. గీ. అనుచుఁదన తల్లి పినతండ్రి తనకుఁ దాత
మాల్యవంతుండు బలశాలి మహిత గుణుఁడు
సచివహిత మెంచి కోపించి సంధి నొల్ల
నట్టి రావణునకుఁ దెల్పె నతుల రీతి 21

## మాల్యవంతుని హితము నిరాకరించుట

తే. గీ. మాల్యవంతుండు హిత మెంచి మంచిమాట
ననిన వెనువెంటఁ గ్రుద్ధుఁడై యసురవిభుఁడు
మండిపడి తలఁబంకించి మాల్యవంతు
గనుచుఁదన ప్రజ్ఞఁదనకు దాఁగణనఁజేసె. 22

ఉ. ఏమనితాత పల్కెదవ రే గణియింపవు నాదు ప్రజ్ఞ నా
రాముఁడె గెల్చు రాక్షస విరాముఁడు వాఁడనిపల్కఁబూనెదో?
సామమ సంధియా యతని జానకి నాతని కిచ్చివేయుటా
ఈమెయి రాజు కట్టెదుట నేరును బల్కఁగ సాహసింపరే. 23

చం. పగతురపట్ల స్నేహమున బల్కితి వీవహితంబునే హితం
బుగ నను మోసపుచ్చుతలపున్ బరుషంబును గాని నేవినన్
వగ వనచారియౌచు విడువంబడి వాఁడల తండ్రిచే వనీ
మృగముల వెంటరా నతఁడె మేలని పల్కఁగ హేతువేమొకో.

తే. గీ. ఆతఁ డేకాకి కృపణుఁడు నరయ నరుఁడు
నేనొ రాక్షసనాథుండనైన వాఁడ
సురల కెల్లరకును భీతికరుఁడ నేను
విక్రముఁడ నన్ను హీను గావించితేల? 25

ఉ. వైరులు ప్రోత్సహించిరొకొ పల్క గనిట్లు? సజాతియందునన్
వీరుని పట్ల నీర్ష్య యొకొ వేరు కతంబది యేమి? శాత్రవున్
ధీరుఁడు వీరుడంచు గడుఁ దెల్పఁగ శాత్రవ పక్షపాతమా
కారణమేమి? నీవె పలుకందగునే యిటు శాస్త్రకోవిదా! 26

ఉ. తెచ్చితినేను నాపురికిఁ దేకువతోడనె పద్మహీనయౌ
లచ్చిని శ్రీ యనందగిన రామను గాననభూమినుండి నే
డిచ్చెదనొక్కొ రాఘవున కేభయమందుచుఁ దాత నీవునన్
మెచ్చిన మెచ్చుకున్నను నమేయబలుండ బరాక్రముండనున్.

ఉ. చూడఁగలాడవింక రిపుసూదను రావణు రాము లక్ష్మణున్
దోడగు వానరాధిపుని దుర్బల వానర సైన్యమెల్ల నుం
గూడ వధింతు నెవ్వఁడని గుందగఁ జేయునొ దేవతాతతిన్
వాడొకొ ఘోర భీతి గనువాడొకొ రాఘవుతోడఁ దాతరో!

ఉ. రాముఁడె నన్ను మించిన బలంబున నాతఁడు ద్రుంచుఁగాక ఘో
రామికి జంకి లజ్జను శిరంబును వాల్చుచు రాముఁ జేరి నే
భూమిజ నప్పగింప మది పూనదుగా నెటులైననున్ సరే
రామునితోడఁ బోరుట సరాసరిగాఁ దగు ధీరవృత్తికిన్. 29

తే. గీ. ఇదియ దోషంబుగా నెంతు వేని తాత
పుట్టుకతో స్వభావంబుగాఁ బుట్టు బుద్ధి
పుట్టె పుడకలతోడనే పోవగలదు
ఇయ్యది దురతిక్రమ మెవం డెటుగ విడుచు. 30

ఉ. ఇంతకు రాముఁజూచి భయ మేల వహింపఁగనయ్యె ర
వ్వంత సముద్రమందున గుహాలున సేతువు గట్టెనంచు; గా
ర్యాంతముఁ జూడగా వలెసుమా జలధిందరియించి వాఁడు లం
కాంతరమందుఁ జొచ్చి బ్రదుకంగలవాడె ప్రమాణమియ్యదే.

చం. తన దృఢనిశ్చయం బిటుగ దైత్యవిభుండన మాల్యవంతుఁ డం
తనకడులజ్జఁ బొంది తన ధర్మహితంబు నతండు ద్రోసినన్
మనుమని దీవనల్ సలిపి మారనకుండ గృహంబుఁ జేరె వే
దనుజులఱేడు మంత్రులును తంత్రముఁబన్నిరి లంకరక్షకై. 32

లంక రక్షణ

తే. గీ. తూర్పుదెసఁగాయఁగాఁ బ్రహస్తు కిడె నాజ్ఞ
పశ్చిమము మహామాయుండు బలయుతుండు
నింద్రజిత్తును నుత్తర మెపుడు తానె
రావణుండె ఆ శుకుని సారణులగూడి.

కాయుటకు నిర్ణయించి దక్షిణదిశను మ
హోదరుఁడు మహాపార్శ్వుఁడు నుండునటుగ
ఆ విరూపాక్షుండు పురి మధ్యమమునందు
రక్షణ నొసంగ విధియించె రావణుండు. 33

ద్వి. సచివులతోఁ బురి సంరక్షణవిధి
నుచితరీతిగఁ జేసి యుప్పొంగి యంత. 34

ద్వి. తన సమర్థత నెంచి తాసంతసించి
చనె నిజాంతఃపురమ్మున కంత నతఁడు.

ఉ. రావణుఁడీగతిన్ సమర రంగము నిర్ణయమూనియుండె సీ
తావిభుఁడంత లంకఁగని దాని జయించెడి వ్యూహ మెంచ సు
గ్రీవుని రావణానుజునిఁ గీశవరేణ్యుల సంప్రదింపఁగా
రావణ సోదరుండు రఘురామున కంతటఁ దెల్పె నెల్లయున్.

## విభీషణుఁడు లంక రహస్యముఁ దెల్పుట

తే. గీ. ప్రఘసశరభానలులును సంపాతియును
నాదు మంత్రులు లంకకు నల్వు రరిగి
శత్రు సైన్య విధానంబు సర్వ మఱసి
పక్షి రూపంబులను దాల్చి వచ్చినారు. 37

ఆ. వె. తూర్పు గుమ్మము కడ దోర్బలుండగు ప్రహ
స్తుండు నిజబలంబుతోడ నుండె
అల మహోదరుఁడు మహాపార్శ్వ లుండిరి
దక్షిణమును గాయ దక్షులగుచు. 38

తే. గీ. పట్టసాసిధనువులను బట్టు దైత్య
భటులతో నింద్రజిత్తుండె పడమర దెస
లక్షలాది వీరులు భటులయుతుఁడౌచుఁ
దానె యుత్తరమునగాయు దైత్యరాజు. 39

తే. గీ. శూలఖడ్గధనుర్ధర శూరభటుల
తో విరూపాక్షుఁడు నడుమఁ జేవమీర
నుండె వీరలగని వచ్చియున్నవారు
నాదుమంత్రులు రాఘవ మేదినీశ! 40

తే. గీ. లక్షలాదిగ గలవారు రాజసములు
ముని కుబేరు నోడించిరి పోరునందు
మదగజంబు లశ్వంబులు రథము లెన్నొ
తిరిగి కాయుచున్నవి లంక తెంపు రేక. 41

తే. గీ. ఈ త్రికూటంబుకడపటి దీ సువేల
శిఖరము నడిమిశిఖరానఁ జెలఁగు లంక
అందు వేయి రాడులమేడ నాశరపతి
యసుర రక్షితమైయుండు ననవరతము. 42

కం. నేనిదియంతయుఁ జెప్పితిఁ
బూనికతో దైత్యనాథుఁ బోకార్చుటకై
మానసమున భీతిలఁగా
దీని నుడువలేదు సుమ్మి ధీవరవీరా! 43

తే. గీ, దేవతలనైన గెల్చెడి ధీరవరుఁడ
ఉచితరీతి వ్యూహంబుల నొప్పు కపుల
సైన్యమును దీర్చి దైత్యుల సంహరింపు
మహిత చతురంగ సైన్య సమాహితుండ. 44

కం. అని తన నల్వురు మంత్రులు
వినిపించిన దెల్లఁ దెలిపి వివరింపన్ వా
రినె పలుకాడం గోరుచు
మనవి యొనర్పంగఁ జేసె మనుజేశునకున్. 45

తే. గీ. అను విభీషణు నుడి రాముఁ డాలకించి
వైరి సంహరణార్థమై వీరకపుల
లంక నాల్గుగుమ్మములందు రాక్షసేశు
నియమితులఁ బోరు వారల నిర్ణయించె. 46

సీ. తూర్పు వాకిలిఁ జేరి ప్రహస్తుని
నీలుండు నిజశక్తి నిహతుఁ జేయు
దక్షిణమున మహోదరమహాపార్శ్వుల
ననిఁబూని జంపెడి యంగదుండు
పశ్చిమ ద్వారాన వాయుపుత్రుఁడు నస
మానబలుఁడు హనుమయ్య పోరు
ఉత్తర దిశ నేనె యుండి పోకార్చెద
లోకభీకర దైత్యలోకవిభుని

తే. గీ. సురతతికి మౌనులకునుశిష్టులకు వ్యథక
రుండు లోకకంటకుఁడయి లోకమెల్ల
వరబలంబున గర్వించి తిరుగు క్షుద్రు
నేనె వధియింతు సౌమిత్రి నిలువ దరిని.

తే. గీ. బలసమేతుండు సుగ్రీవవరుఁడు జాంబ
వంతుఁడు విభీషణుఁడు మధ్యభాగమందు
నిలిచెదరుగాక కపులిప్డు మెలఁగు రీతి
మానవాకారములతోడ మసలరాదు. 48

ద్వి. మనవారిఁ బగవారిఁ గనుచు గుర్తింప
నని నిజరూపాల మనుడు వానరులు. 49

తే. గీ. మానవాకారములె పూని వానర పతి
హనుమ నీలుఁడును విభీషణాంగదులును
లక్ష్మణుఁడు నేను మేమేద్వురమును వైరిఁ
బోరువార మనుచు రాఘవుండు వలికె. 50

తే. గీ. అనుచుఁ బలుకాడి రాఘవుఁడా సువేల
పర్వతప్రాంతమెల్లయు వరల కపులు
లంకపైఁ దాడి సాగించి రాక్షసేశు
దునుమ నుత్సాహవంతుఁడై గనుచు నద్రి. 51

తే. గీ. అంద మానంద మొసగుచుఁ జిందులాడు
నా సువేలాద్రిపై కెక్కె నతని వెంటఁ
దోఁడు లక్ష్మణుఁడు రవిసుతుఁడు విభీష
ణుండు హనుమ నీలుఁడు నంగదుండు జాంబ
వంతుఁడాదిగఁ గపివీరవరులు రాగ

కొండఁ గోదండ రాముండు కొనకుఁ జేరి
సుందరోద్యాన వీథుల సొబగు నిండి
కొండ నంటుచు వ్రేలాడుచుండిన గతిఁ
గనెఁ ద్రికూటాద్రియందు లంకాపురంబు. 52

శా. లంకంజూచుచుఁ గోపచిత్తుఁడగుచున్ రాముండు పల్కాడె నే
కొంకున్ జంకును లేక నన్యసతినింగొంపోయె దుష్టాత్ముఁడీ
లంకానాథుఁడు వీని పాపమున నీలంకన్ సమూలంబుఁగాఁ
బొంకంబుం జెడ నెల్లదైత్యనికరంబుంజంపఁగా వచ్చెఁగా. 53

తే. గీ. అతఁడు మృత్యువశంగతుడై నవాఁడు
వాడొకండె చేసిన పాపవశత వంశ
మంత నశియింపఁనుండెగా నెంత చేటు
గలిగె నంచు విభీషణుఁగనుచుఁ బలికె. 54

తే. గీ. అంతలోకబాంధవుఁడేగె నస్తమించి
శేవెలుంగును గాంచుచు రేయి యంత
నా సువేలాద్రిసానుచయంబు లందె
విశ్రమించిరి రాముండు వీర కపులు. 51

తే. గీ. లోకనాథుండు రాముని లోకబాంధ
వుండు విడనాడఁ జాలమిఁ బొడిచె ననఁగ
సహజనిజదీప్తి వెలుగొంద సాగునంత
రాఘవాదులు వేడ్కతో లంకఁ గనిరి. 52

ఉ. గోపురతోరణంబులఁ ద్రికూట నగాగ్రమునందు వెల్గు లం
కాపురిసౌధరాజములఁ గానన సీమల రావణుండు తా
కాపురముండు సౌధమును గాంచెను రాముఁడు రావణానుజుం
డాపురియందునంగల రహస్యములన్ వినిపించిచూపుచున్. 53

ఉ. ఆ సుమనోమనోహర మహావనరాజిని సౌధపంక్తులన్
భాసురగోపురావళుల భద్రగజంబుల సైన్యవ్యూహముల్
వాసి సమృద్ధినీరుగల పట్టులు భీకరరూపవంతులౌ
అసురవారముంగనె మహాత్ముఁడు వానరయోధయుక్తుఁడై.

సీ. ఇరుఁకెలంకులయందు నింపగు సుందరుల్
వింజామరల్ వీవ వెలయు వాని
విజయ సూచకమగు వెల్లనౌ ఛత్రంబుఁ
దాల్చుచు ఠీవిగాఁ దనరు వాని
రక్తచందనమున రక్త భూషణముల
చే నలంకృతుఁడయి చెలఁగు వాని
నల్లని మేఘమనంగ నొప్పెడి మేన
ఎఱ్ఱ జరిపంచ యెగయు వాని

తే. గీ. ఐరావణ సురేశు నిశవిషాణమ్ముపలన
కణతు లొప్పు విశాల వక్షంబు వాని
గోపురంబునఁగల వాని ఘోర రూపు
వాని గనిరి రాముఁడు రవిసూనుఁ డపుడు. 55

## సుగ్రీవరావణుల ద్వంద్వయుద్ధము

మ. కనుచుం గోపపరీతచిత్తుఁడయి వీకన్ దక్షిణంబందు దూ
కెను దైత్యేశుని గోపురంబునకు సుగ్రీవుండు నిర్భీతి రా
వణుపై దృష్టి నిగుడ్చి కొంతవడి గోపంబాపఁగాలేక ప
ల్కెను దీవ్రంబుగ ముందువెన్కల మదిన్ లేశంబు యోజింపకే.

ఉ. రావణ! లోకనాథుఁడగు రాముహితుండను రామదాసుఁడన్
భూవరు రాముతేజమును బొందుట నిన్నిక వీడనంచు సు
గ్రీవుఁడు తోడఁబై కెగసి ఱేని కిరీటమునేలఁ ద్రోసి వే
రావణరాజు కట్టెదుటద్రావాలె తటాలున నిశ్చితాత్ముఁడై. 57

చం. తనమకుటంబుఁ ద్రోసి భువిఁధైర్యముతోఁడన ముందెనిల్చు వా
నినిఁగని సుందరంబగుచు నీదగు కంఠము నా పరోక్షమం
దునగలవాడవై తివిక దున్మెద దానిని నా సమక్షమం
దున మితిమీరినావనుచుఁ ద్రోసెను రావణుఁడంత భానుజున్.

తే. గీ. చేతితో రావణుఁడు త్రోయఁ గోతుల పతి
భూతలంబునఁబడి లేచి పొక్కి మరల
దైత్యనాథునిఁ బడవైచె ధరణిపైన
ద్వంద్వయుద్ధంబుఁ బూని రవ్వార లపుడు. 59

కం. ఇరువురు నొండొరుఁ గడు భీ
కరముగఁ బోరాడి రంతఁ గరములఁ గాళ్ళన్
జరచుచు గ్రుద్దుచుఁ గ్రుమ్ముచు
కరచుచు రక్తము తనువులఁ గారుచునుండన్. 60

తే. గీ. యుద్ధమార్గాభిరతులుఁ బ్రసిద్ధబలులు
సాముగరిడీల నేర్చిన శక్తియుతులు
వారు యుద్ధసాధన చమత్కారములఁబ్ర
యోగ మొనరించి పోరాడుచుండి రొకట. 61

తే. గీ. పై కెగయుఁ గ్రిందికిందిగు వెంట వారు
గోపురాంతరయుద్ధంబు ఘోరమగుచుఁ

బయటఁబడి పోరఁ దొడఁగిరి పరిఘుల దరి
నొండొరు మెలివేఁకొనుచు నుండువారు. 62

తే. గీ. నొండొరుని జంపు పూనిక నుండి పోరు
చుండి విఫలులై విడివడకుండ వార
లలసటను బొందకుండఁగ నంత నసురుఁ
బరిఘులోఁ బడవైచెను నర్కసుతుఁడు. 63

తే. గీ. పరిఘులోఁబడి డస్సి యాసురవిభుండు
దైత్యమాయను సుగ్రీవుతలను గొట్ట
యోజనను బూని వానికై యుండెవేచి
గాని యర్కజుఁడు గ్రహించి గాలి కెగిరి. 64

రామభద్రుఁడు గలచోట వ్రాలినాఁడు
పరిభవించుచు దైత్యేశుఁ బడసి జయము
మరలివచ్చిన సుగ్రీవు మహితవీరుఁ
గాంచి మోదంబుఁజెందె మర్కట బలంబు. 65

## రాముఁడు సుగ్రీవుని మందలించుట

ఉ. సాహస మూనినావె సఖ చయ్యన రావణుఁబైకి దూకితే
ఆహవమందు నీవెజయమంది సుఖంబున వచ్చినావుఁ నే
నాహవమూని రావణు లయంబొనరింపఁ బ్రతిజ్ఞఁబూననే
బాహుబలాఢ్య నీవె కడుభారవహుండవుగాగఁ జూచెదో. 66

తే. గీ. రాజున కిటు సేయగ నౌనె లాఘవముగ
నిట్టి పనులింకనైనఁ జేఁబట్టరాదు
నీకె హానికలిగినచో నాకు సీత
యేల? సోదరులేల? నాకేలబ్రదుకు? 67

ఉ. రావణుఁ జంపి యుద్ధమున లంక విభీషణు రాజు సేసి నా
స్థావరమౌ యయోధ్యభరతానుజుకొప్పగించి వే
జీవము వీడు నిశ్చయముచే రిపుఁద్రుంచఁగఁ బూనినాడ నీ
వా! వరవీరమూర్తివియుఁ బ్రాణసఖుండవు నాకు నర్కజా!

కం. అను రాముని మాటల విని
వనచరపతి రాఘవుఁ గని భక్తిం బలికెన్
జనకజ నీభార్యాహరుఁ
గని పౌరుషమున వెడలితి గఁలఁగన్ మదిలోన్. 69

చం. అన విని శాంతచిత్తుఁడగు నా రఘురాముఁడు గాంచిలక్ష్మణున్
మన బలగంబు నింక రణమార్గమునన్ విభజించి తీరుగా
నొనరుపగాఁ దగున్ గను మహో యవి యే విపరీతదృశ్యముల్
మన కిక ముట్టడింపవలె మానవభోజుల లంక శీఘ్రమే. 70

తే. గీ. అనుచు శిఖరంబు విడనాడి యనుజుతోఁడ
వానరుల సేనతోగూడి వానర పతి
కాన నిచ్చి యుక్తమని వే బూన రణము
రాఘవుఁడు దాడివెడలె నాలంకపైన. 71

తే. గీ. నియతరీతిని యోధులు నిల్పినారు
రాముఁడుత్తరదిశ దైత్యరాజు నిలుచు
ద్వారమున సలక్ష్మణుఁడయి వరలుచుండె
ముప్పదియు నాజుకోట్ల కపులనుగూడి. 72

తే. గీ. గుమ్మములకడఁ గోటియా కోతి దండు
యోధులకుఁ దోడుగా నిల్పియుండెఁ బోర
భూమిజంబులఁ బర్వతముల వహించి
యుద్ధ మొనరింప వానరు లుండి రపుడు. 73

తే. గీ. లంక ముట్టడించిన వారు లంకఁజుట్టఁ
జెట్లఁ గొండల దిగి లంకఁ జేరువారు
భూమి నాకాశముల నిండి భూమి యీని
నదన నలరారుచుండె వానరుల సంఖ్య. 74

ద్వి. కోలాహలంబునఁ గోతుల దండు
నా లంక ముట్టడినలరునుండ. 75

ద్వి. రాముండు మంత్రుల లక్ష్మణుంగూడి
సామంబు దలపోసె సమరాదియందు. 76

ద్వి. ఆ విభీషణుఁగూడి యంగదుంబిలిచి
రావణుకడ కేగ రాముండు దెలిపె. 77

## రాముని సందేశము

ఉ. వాలి కుమార యంగద! జవంబున నీవు శ్రమంబు నెంచకే
వ్రాలుము రావణేశ్వరుని వాడను నాదగుమాటగాఁగ వా
డాలన సేయురీతిఁ బలుకాడుము మాదగు మాటఁదెల్పుమీ
అలము సేయరాదుసుమ యచ్చట దూతగ మాత్రముండుమా.

ఉ. దేవవిరోధివై పుడమి ద్రిమ్మరి సజ్జనకంటకుండవై
దేవతలాదిమౌనులఁ బదేపది బాధలఁ బెట్టినావు నీ
కా విధి యిచ్చియున్న వరగర్వముచే వరశక్తియంతయున్
రావణ వీడె నేటికి ఫలంబికఁ బొందఁగనుంటి వీ వహో. 79

ఉ. ఓయి దురాత్మ నీదు బల మొప్పదు మున్ను తెలంగుగాగ నీ
యాయువు నష్టమయ్యె హతమౌదువు దండధరుండనంగ నీ
కాయముఁ ద్రెళ్ళఁ జేయ నిటఁ గాసితి నాదు సతిన్ హరించుటన్
బాయుచు నీ జగంబు గత పాపుఁడవై గనుదీవు మోక్షమున్.

తే. గీ. రాక్షసాధమ యెట్టిబలంబు నెంచి
ముందు వెన్కలఁ గనకుండ మోసగించి
సీత హరియించినావో యీసిద్ధబలము
జూపఁగాఁదగు నిప్పుడు జూపు మింక. 81

చం. నయమున సీత నిచ్చి శరణంబన వేని యరాక్షసంబుఁగా
దయ విడనాడి చేతు సుమ ధర్మపరుండు విభీషణుండు రా
జయి భవదీయలంక విజయంబునఁ బాలననువాడు మూడు నీ
లయమునె గోరధర్మము తలంచి వహించెద వేనిరావణా! 82

తే. గీ. ధైర్యము వహించి రమ్ము యుద్ధమ్ము సేయ
విగతజీవుండవై నాదు విశిఖవృష్టి
వీతపాపుండవై పరిపూతుఁడవయి
సిద్ధమును లేను లోకంబుఁ జెందఁగలవు. 83

తే. గీ. అటుగఁ గాక పక్షి వగుచు నఖిలజగతిఁ
దిరుగఁ జూతువె నీకింకఁ దెరువు లేదు
నాకుఁగనుగప్పి మనుచోటు నీకు లేదు
బ్రతుకనేరవు నీవు రావణ నిజంబు. 84

ఉ. నీకు హితంబు సెప్పెదను నీ యపరక్రియ నీకునీవె వే
చేకొనఁగాఁదగుంబుడమిఁ జేయఁ దలంతు నరాక్షసంబుగా
నీకికఁ జేరువాయె నవనీస్థలి వీడి నశించు కాల మా
పోకకు ముందె లంకఁగనుమోయి తుదిం గడసారి చూపుగా.

ఉ. అసుర! ఆతతాయి! శరణాగతరక్షణ దీక్షవాడ నే
నీసునఁ జూడనేరి నెపుఁడేని విరోధిగ నెంచనేని నిన్
గాసిలఁజేయనెప్పుడు నెకాయెకి రమ్మిక సీత నిమ్ము నా
దాసుఁడవై మెలంగుము యథావిధి రక్షణఁ బొందు రావణా.

కం. అని రాఘవుఁడంగదునిం
గని దైత్యేశునకుఁ జెప్పఁగాఁ బొమ్మన వే
చని గగనంబున మంత్రి యు
తుని రావణు ముందు నంగదుఁడు వ్రాలెఁ దృటిన్. 87

## అంగదుఁడు రామ సందేశము దెల్పుట

ఉ. కోసలనాథుఁడైన రఘు కుంజరు రాముని దూత నేనె ఆ
వాసవసూనుఁడైన నల వాలి కుమారుఁడ నంగదుండ నీ
వాసముఁ జేరి నీకు రఘు వర్యుఁడొకండు హితంబు సెప్ప వ్యా
త్యాసము లేకఁ బంపె ననుఁ దాల్మి వినందగు దానిఁ జెప్పెదన్.

ఉ. ఓయి నృశంస రమ్ము రణమూనఁగఁ బౌరుషమున్ వహించి వే
జాయఁగఁ జేతుఁ బ్రాణములబాంధవులున్ సచివుల్ కుమారకుల్
దాయము నెందువారు సముదాయముగా నినుఁ జంప లోకముల్
హాయిగ సౌఖ్య మందగల వంతట నిర్భయమై సతంబునున్. 89

చం. సురలును మౌనులున్ సతము క్షోభ వహించుచు నున్నవారు నీ
వరబలగర్వహేతువున వారక నిన్దును మాడువాడ నా

ధరణిజ నొప్పగించి పరితాపము నొందుచు నన్నుఁజేరి వే
శరణము గోరకుండిన నిశాచర వంశ వినాశ కారకా! 90

కం. నిను దునుమాడి విభీషణు
జనపతిఁ గావింతు లంక సత్యము ధర్మం
బునఁ బరిపాలింపఁగ రా
వణ! యవసానంపుగడియ వచ్చుట నీకున్. 91

కం. అనుచున్ రాముఁడు నీతో
ననఁ బంపెన్ నను యదార్థ మంతయు నంటిన్
జనువాడ ననుచు నంగదుఁ
డనఁ గోపంబున సురారి యంగదుఁ జంపన్. 92

కం. ఆనతి నిడె మంత్రులఁ గని
దానిని వినిన భటు లంత దర్పము తోడన్
వానరుఁ బట్టిరి చంపఁగఁ
దానై యంగఁదుఁడు లొంగ దైత్యుల కంతన్. 93

తే. గీ. తన బలంబును జూపగాఁ దలఁచి యంగ
దుండు మునులొంగి వెనువెంటఁ దోర్బలంబుఁ
జూపి వారిఁ జంకలక్రింద మోపి పట్టి
పక్షులనువోలె సౌధంబుపైకి నెగసె. 94

తే. గీ. అమలసౌధశిఖరముపై నతఁడు దూకు
వడికిఁ జంకలందునఁ గల భటులు నేలఁ
గూలి చచ్చిరి విభ్రాంతిఁ గుందు నటుగ
రాక్షసులు రాక్షసేంద్రుండు లంకయందు. 95

కం. మిక్కిలిపొడవుగఁగొండకు
నెక్కిడిప్రాసాదముగని నేలంబడఁగా
గ్రక్కున శిఖరముఁదన్నెను
ముక్కలగుచు నద్దిగూలె భూమింబడుచున్. 96

ద్వి. తన పేరు లంకలోఁ దలఁచెడి రీతిఁ
బనిఁజేసి వెనువెంట వాయు వేగాన. 97

ద్వి. స్వామికార్యము దీర్చి స్వజనంబుఁ జేరి
రాముని పదముల వ్రాలె నంగదుఁడు. 98

ద్వి. తన సౌధశిఖరంబు ధాత్రి గూలంగఁ
గని రాక్షసేంద్రుండు కన్నీరుఁ గార్చె. 99

ద్వి. తన దూతగా నేగి పనిఁ జేసి రాగ
నినకులరాముండు వనచరు మెచ్చె. 100

ద్వి. యుద్ధము కాంక్షించియుండె రాముండు
సిద్ధుఁడై వానరశ్రేష్ఠుల నడుమ. 101

సీ. రాముఁ డుత్తరదిశ లక్ష్మణ సహితుఁడై
యుండె దైత్యేశుఁడే యుండు చోట
ద్వివిదుఁడు మైందుండు వెంటాడ నీలుండు
ప్రాగ్దిశాద్వారంబుఁ బట్టియుండె
గవయ గవాక్షుండు గజుఁడాదులనుగూడి
యంగదుండుండె యామ్యాశయందు
ప్రఘసప్రమాదులు రాఁ దోడుగాఁ బశ్చి
మంబున వర హనుమంతుఁ డుండె. 102

తే. గీ. మధ్యమున సూర్యసుతుడుండె మహితరీతి.
ద్వారములు నిరోధింపఁగా బడియె నిటుగ
కోటముట్టడించిరి కోట్లకొలది కపులు
ద్వారమునకొక్కకోటికితఱుగు లేక. 103

తే. గీ. మహితరామాజ్ఞఁ గోట గుమ్మముల యొద్దఁ
గపుల వీరులు నిల్చిరి రిపులకొఱకు
కోట్లకొలదిగ సైన్యంబుఁగూడి వారు
మున్ను రాముండు తెల్పిన తెన్నుగాగ. 104

తే. గీ. కోట గోడల దూకుచుఁగోతి దండు
ప్రబలుచున్నది ప్రాకారపరిఘలందు
ఆ ప్రహస్తుండు ద్వారంబులందుఁ దిరిగి
యేమరక సైన్యమును గడు హెచ్చరించు. 105

కం. ఎటఁ జూచినఁ గోతులఁ గని
కటకటఁ బడిరా యసురులు కాలుని రూపం
బట కనిపించెను వారికి
పటుతర బాహుబలులైన వానరులందున్. 106

కం. కొండలఁ జెట్లను బూని ప్ర
చండతరోగ్రనఖముల నిశాచరలంకన్
నిండుచు వానరసైన్యం
బుండఁగ దైత్యులు భయానఁ జొక్కిరి తమలోన్. 107

ఆ. వె. లంక భీతిఁజెంది రాక్షస వారంబు
బింక ముడిగి ఱేనివంకఁ జూచు
సాయుధబలగంబు సంసిద్ధమై యనిఁ
బూనఁ గౌతుకంబుఁ బొంది రంత. 108

కం. రాక్షస హాహా కారము
రక్షోపతి వినుచు సౌధరాజపు నగ్రం
బక్షయబలగర్వితుఁడై
కక్షను బైకెక్కి చూచెఁ గపి సైన్యంబున్. 109

తే. గీ. కడలి నేలయు గగనంబుఁ గాంచెఁ గాన్పి
లనఁగ వానరసంతాన మన్ని దెసల
నిండి ప్రాకారముల నెక్కుచుండఁ గనుచు
విహ్వలుండయ్యె రాక్షస వీరవరుఁడు. 110

తే. గీ. తోడనే మంత్రులనుగూడి వాడలెల్ల
గాపుఁ గాయుచుఁ బూనఁగాఁ గదనమపుడె
నాజ్ఞ నిడె రావణుండంత నసురతతికి
సింహనాదాల సల్పుచుఁ జెలఁగ వారు. 112

ఉ. బంగరు దండ మూని శశిభాతిముఖంబుల నొప్పు భేరులన్
ఖంగున మ్రోగఁగొట్టుచు వికారభయంకరులౌచుఁ బెక్కుతా
భంగుల శంఖదుందుభుల ధ్వానములన్ గజబృంహితంబులన్
చంగున రక్కసుల్ కపుల సైన్యము పైఁబడి తాకి రంతటన్.

తే. గీ. గదల శక్తుల శూలాలఁ గండ్రగొడ్డ
ులను బూని దైత్యులు వానరుల నెదిర్చి
కదన మూనిరి నిజపరాక్రమముఁ జూపి
చంపుచున్నది కపుల రాక్షసబలంబు. 114

తే. గీ. పరిఘలందున రాళ్ళను బాదపముల
వేసి పూడ్చుచు వానరవీరసైన్య
మెక్కి ప్రాకారమునుగూడ ముక్కముక్క
లౌగతిని గొట్టి చొచ్చిరి లంకనంత. 115

కం. వానర రాక్షస సైన్యం
బూనెను గదనంబు కత్తి ముద్గరశక్తుల్
దానవులున్ జెట్లు శిలల
వానరులున్ గొనిరణంబు ప్రారంభించెన్. 116

కం. లంకను గని రాముఁడు లో
సంకటపడసాగె దాన సంక్షోభితయౌ
పంకజముఖి సీతఁ దలఁచి
పంకముతోఁ బోరఁ గపుల పాటించి యనెన్. 117

ఉ. వచ్చినవారు సేతువున వచ్చుచునుండినవారు వృక్షముల్
తెచ్చినవారు బండలను దెచ్చెడివారలు చెట్ల కోతి కొ
మ్మచ్చులనాడువారలు కిలారవముల్ సెలరేగ గొండలన్
హెచ్చుగనున్నవారు కలరెందఱొ లెక్కకుమించి వానరుల్.

కం. తనువుల రాముని కొఱకై
వినియోగింపఁగఁ దలంచువీరులు కపులా
యని తాకిరి దైత్యతతుల
మనమునఁ దలపోసి రాము మహిమన్ భక్తిన్. 119

తే. గీ. కోటగోడల ద్వారాలఁ గూల్చినారు
దాటుచుండి అగడ్తల దైత్య పురిని
వేగమునఁ జొచ్చుచున్నారు వేనవేలు
వానరుల సైన్యమంత రావణుఁడు గనఁగ. 120

ఉ. రాళ్ళను జెట్లు కొండశిఖరంబులఁ బూనుచు రాక్షసావళిన్
గోళ్లను జీరుచున్ గఱచి గొంతున మేనుల రక్తవారధిన్
ద్రెళ్ళఁగఁ జేయసాగుచు పదేపది సల్పుచు సింహనాదముల్
గొల్లుమనంగ రక్కసులు కోతుల మూకలు వీరమూర్తులై.

## వానరరాక్షస ద్వంద్వయుద్ధము

తే. గీ. దొమ్మి యుద్ధంబు సాగె దైత్యులకును గపు
లకును దీవ్రముగ రణస్థలంబదెల్ల
మాంసశోణితకర్దమ మౌచునుండె
నుభయపక్షంబు లంత నొండొరుల దాక. 122

తే. గీ. జయము నీయదె సుగ్రీవ స్వస్తి యనుచు
కోతు లార్భటి సేయుచు గొంతులెత్తి
కఱకు కోరల వైరుల కఱచుచుండి
వీరవరులౌచు వెనుకంజ వేయ రపుడు. 123

సీ. కోట గోడలు కూలె కోట్లాది వానర
బలగంబు వానిపైఁ బడిన యంత
బంగారు శిఖరముల్ స్వర్ణంపు గోపురం
బులు ద్వారములు గూలిపోయె నంత
స్వచ్ఛమౌ జలమయ పరిఘలన్నియుగూడ
బండల వృక్షాల నిండె నంత

పుష్ప లతా ఫల భూజ వనంబులు
పెఱుకగాఁబడి చేరె పృథ్వి నంత

తే. గీ. జయము శ్రీరామ లక్ష్మణా జయము జయము
రామపాలితసుగ్రీవరాజ జయము
జయ మటంచని కపులు నిశాచరతతి
భీతిఁ గనఁజేయు నినదాలు వినఁగ బడియె. 125

కం. దిక్కుల నన్నియుఁ గాయుచుఁ
బెక్కురు కపులుండి లంక పెంపు నశింపన్
నెక్కొనుచుండగ రావణు
డక్కదనవిధంబు గాంచి యాతుర పడెడిన్. 126

తే. గీ. రావణ జయంబుఁ గోరుచు రాక్షస తతి
రాఘవజయంబు వానర రాజి దలఁచి
ఘోరసంగ్రామ మూనిరి పోరు సాగి
పీనుగుల పెంటయయ్యె నవ్వీటి చుట్టు. 127

తే. గీ. అంగదునిఁ దాకె నింద్రజి త్తమితశక్తి
నా ప్రజంఘుండు సంపాతి నంతఁ దాకె
జంబుమాలి వాయుజునితో సమర మూనె
నీలుఁడు నికుంభు నెదిరించి నిలిచె ననిని. 128

తే. గీ. ప్రఘసుఁడనువాఁడు సుగ్రీవుపైనఁ బడియె
ఆ విభీషణు మిత్రఘ్నుఁ డనెడివాఁడు
లక్ష్మణుని విరూపాక్షుడు రణమునందు
డీకొనిరి పోరినారు డీడీయనంగ. 129

తే. గీ. అగ్నికేతుసు ప్తఘ్ను లాయజ్ఞకోపు
రశ్మికేతులు దాకిరి రామవిభుని
వరుసమైందద్వివిదులును వజ్రముష్టి
యు నశనిప్రభుండును దాకి యుండిరపుడు. 130

ద్వి. అంత విద్యున్మాలి అసుషేణుఁగని
పంతాన ననిఁదాకె ప్రథితయశుండు. 131

తే. గీ. ప్రతిభను నలుండు పడగొట్టెఁ బ్రబలశక్తి
తక్కుఁగలవారలెదురైన రక్కసులను
దాకి పోరాడినారలు భీకరముగ
ద్వంద్వయుద్ధంబు చెలరేగె పగలు నడుమ. 132

ఉ. ఘోరరణంబుసాగెఁ బడగొట్టె గదాహతి నంగదున్ మహా
వీరుఁడు శక్రజిత్తు వెనువెంటనె వాలిసుతుండుఁ గోపియై
తేరునదూకి వానివిలుదీసి తటాలునఁ బారవైచి వే
సారథినిన్ దురంగములఁ జంపి రథంబొనరించె నుగ్గుగా. 133

ద్వి. సంపాతియుఁ బ్రజంఘు సాయకత్రయిని
పెంపటి వృక్షానఁ ద్రుంపె నవ్వాని. 134

తే. గీ. హనుమ బొమ్ముున శక్తితో నంత జంబు
మాలిఁ గొట్టగాఁ ద్రుటి హనుమంతుఁడతని
తేరుపై వ్రాలి యద్దాని విఱుఁగఁదన్ని
మొక్క గ్రుద్దునఁ జంపె నారక్కసు వెస. 135

ద్వి. పైఁబడు బ్రఘసునిపై బడి నలుఁడు
చేబట్టి కనుగ్రుడ్లు చెచ్చెరఁ బెఱికి. 136

ద్వి. వెనువెంట దునుమాడె దనుజులు చూడ
నినసుతుఁ డాప్రఘసునిఁ జంపెఁదోడ. 137

తే. గీ. రాముఁడొక్కొక్క తూపున రశ్మికేతు
యజ్ఞకోపు సుప్తఘ్ను నాయగ్నికోపు
ల దునుమాడె వారతనిపై రణ మొనర్చి
బాణవర్షంబు గురిపింపఁ బాటిఁజేసి. 138

తే. గీ. సౌమ్యుఁడై సరథుండునై చచ్చిపడియె
వజ్రముష్టి మైందుని గ్రుద్దువలనఁ బిడుగు
పాటునఁ బడు సౌధమువలె బదనగు ముసు
కులను వ్రచ్చెను నీలు నికుంభుఁడంత. 139

ఉ. అంతట వానరప్రముఖుఁ డాసురు సారథినిన్ రథంబునున్
సాంతముగాగఁ గూల్చె భువి నాద్వివిదుండొకకొండబండచే
నంతమొనర్చె రాక్షసుని నాయశరుప్రభుఁ దేరు నశ్వముల్
వింతగ సాలవృక్షహతి వేయసురావళిభీతిఁ జెందగన్. 140

తే. గీ. వడి విద్యున్మాలి సుషే
ణులు బోరిరొకరినొకరిగణుతి సేయుచుఁ బైఁ
బడుతూపుల భరియించుచు
వడికపివీరుడొకకొండ బట్టుచుఁ దాకెన్. 141

తే. గీ. కొండశిఖరముఁ గొనుచుఁ బ్రచండగతిని
దైత్యుబొమ్మున వేయ నద్దానివలన
బొమ్మ ముద్దగా వీడె జీవమ్ము నతఁడు
ద్వంద్వయుద్ధంబుఁ బూనుచు వానరులిటు
సోకుమూకలఁ జెండాడె శూరులగుచు. 142

సీ. తేరులు ముక్కలై పోరున గదనరం
గస్థలిఁ బ్రోగులై కానిపించు
వివిధాయుధంబులు విఱిగి నేలనుగూలి
రణభూమియందెల్ల రాసులయ్యె
కాలునిఁ జేరిన గజతురంగంబులు
మిట్టపల్లము గాగ పృథ్విఁ జేసె
ప్రాణముల్ వీడిన వానరదైత్యుల
పీనుగు లెల్లెడఁ బెంటలయ్యె

తే. గీ. నక్కలకు గ్రద్దలకు బెను కుక్కలకును
బండుగగ మారె రణభూమి భయదమగుచు
రాక్షసులు వేచియున్నారు రాత్రివడగ
నంతలో సూర్యుఁడస్తాద్రి కధిగమించె. 143

## వానరరాక్షసనిశాయుద్ధము

తే. గీ. ఘోరభీకరరాత్రి దుర్వారమగుచుఁ
గటికిచీకటి నల్దెస గ్రమ్మి వచ్చె

గాళరాత్రిగ నయ్యె నా కపుల కద్ది
రాత్రికాలంబు రాక్షస కాలమగుట. 144

తే. గీ. ఒండొరులఁ జూడఁ జాలక యుండిరపుడు
కపులు హెచ్చు బలంబు రాక్షసులు గాంచి
రాముదండును దాఁకిరి రాత్రివేళ
వారల నెదుర్కొనంగ నెవ్వారితరము. 145

తే. గీ. కండ్ల వైరులఁ గనలేని కాల మాయె
శంఖభేరినినాదంబు చదల నంటి
సింహనాదంబులనుగూడి చెలఁగుచుండెఁ
గర్ణపుటములు బ్రద్దలౌ కపుల కపుడు. 146

తే. గీ. విలయతాండవమున విఱ్ఱవీగు నసుర
సైన్యము కపులపైఁబడి చంపఁ గడఁగె
వారి చీకటి క్రమ్మ నావానరతతి
చేష్టలను బాసియుండె నిశీథమందు. 147

తే. గీ. కనక కవచాలఁ గ్రాలు రక్కసులదండు
రాత్రి దీప్తౌషధయుతశైలముల మాడ్కి
ప్రజ్వరిల్లుచు రణమున వరలుచుండి
వానరుల భక్షణమ్మును బూనెనంత. 148

తే. గీ. వానరులు వికావికలయ్యు దానవులను
గలవరముఁ బెట్టుచుండిరి కనకభూష
లఁదలఁదాల్చిన గుఱ్ఱములను రథగజ
ములను దంతములకొఱికి భూమిఁగలిపె. 149

ఉ. స్వీయచమూసమూహము నశించుటఁ గాంచుచు రామలక్ష్మణుల్
సాయకపంక్తులన్ విడిచిచంపి రగోచరగోచరారులన్
బాయునె నూటి వారిశరవారము పాములకో అలో యనన్
బాయఁగఁ జేసె పెక్కసుర వర్గముఁ బ్రాణములందృటిన్ వెసన్.

తే. గీ. గుఱ్ఱముల రథంబుల పోకఁ గొండ కెగసి
దుమ్ము చెవుల కన్నుల నిండె దుర్భరముగ

యుద్ధభూమిని గలవార లొక్కగతిని
బొక్కుచుండిరి పీన్గుల ప్రోగుమధ్య. 151

తే. గీ. దేవదానవరణమొండె దీనికి సరి
రుధిరవాహిని రణభూమి రోతయయ్యె
నెపుడు తెల్లవారునో యని యెల్లవారు
వేచి చూచుచునున్నారు వీరరణము. 152

ఉ. చీకటి చుట్టుముట్టినది చేయి రథంబు గజాశ్వబాణముల్
సోకులు గానరాక గడు క్షోభ జనింపఁగ దైత్యవారముల్
దాకగఁ జేయుఁ దూపులను దాశరథిప్రభులత్కృణాయుతున్
బ్రాకటలీలరాఘవుఁడు బంగరు పూతల బాణసంతతిన్. 153

తే. గీ. అగ్గిసరిపోలు వానితో నసురులత్రుటి
నభిముఖంబుగనుండిన యట్టి వారిఁ
ద్రుంచె బాణాగ్ని దిక్కుల నిండఁ గాంతి
మిడతలగ్గిని బడురీతి మడియ రిపులు. 154

దండకము. రాముండు షడ్బాణముల్ వీడి షట్దైత్యవీరుల్
గడుంనొప్ప గాఁజేసెఁ బ్రాణాలతో వారుయుద్ధంబులే
వీడి వెన్నిచ్చి నారల్ గదా. 155

సీ. ఆ మహాకాయుండు నావజ్రదంష్ట్రిండు
నామహాపార్శ్వుండు నా మహోద
రుఁడు శుకసారణులు వడిగ వెన్నిచ్చి
పారిరి రాఘవు బాణ హతిని
షడ్బాణములతోడ షడ్దైత్య వీరుల
బలమడివోవగాఁ బట్టి కొట్టె
దృశ్యులదృశ్యులు తెగి పడినారలు
రామబాణాగ్నిని ధూమ మైరి

తే. గీ. వేనవేలగు రాముని విశిఖపంక్తి
రామనామంబు లిఖతమై రాణమీరి

కనకపుంబుంజలంగూడి క్రాలఁ దొడఁగి
యగ్నికణములరీతిగా నలరు నంత. 154

తే. గీ. రక్కసుల నుక్కడంచుచు రణమునందు
దిక్కులన్నియుఁ దేజానఁ దేజరిల్లె
శలభములరీతి రాక్షసుల్ చచ్చి రపుడు
వీరరాముండు విల్లూని వెలయుచుండె. 155

తే. గీ. బెండువోవదు బాణ మొకండుగాని
గుఱిని దప్పదు విశిఖంబు కూల్చ దేరి
వెన్నునకుఁ దట్టి తూపుల నెన్నఁ బోవఁ
దవనిజాభర్త దైత్యసంహారకుండు. 156

ఉ. చండతరోగ్రబాణముల సాధుజనావనసువ్రతుండు రా
ముండు నిశాచరవ్రతతి భూమిని గూల్చుట యొండె భీతియే
యొండె శవంబులొండె గన నుండె గుణధ్వని నింగి నిండె వే
రొండు గనంగరాదు శరమొప్పుగఁగూర్చుచు వీడుటయ్యెడన్.

## రామలక్ష్మణులు నాగపాశబద్ధులగుట

తే. గీ. అంత నింద్రజి సారథి నశ్వములను
నంగదుఁడు జంప విడనాడి యతఁడు రథము
జాడ దెలియకుండగ వీడి సమరభూమి
వెడలె నంతర్హితుండయి తడయకుండ. 158

తే. గీ. ఇంద్రజి పరాజయంబునే యెంచి కపులు
ముదముఁ గనినారు కాని రాముండు దెల్పె
బ్రహ్మవరబల మునఁ గడు వాఁడు గర్వి
మాయయుద్ధంబుఁ బూనుచు మనలఁదాకు. 159

తే. గీ. మరణ మాసన్న మగుటచే మరల వచ్చు
మూఁడులోకాల బాధింపఁ బూనువాఁడు
జాగరూకత వహియింప సమయ మిదియె
ననుచుఁ గపులకుఁ దెల్పె రామాధినేత. 160

## ఇంద్రజి మాయ యుద్ధము

తే. గీ. వాని వెదుకంగఁ బదిమంది వానరులను
రాముఁడంగదాదులఁ బంపె వ్యోమతలము
వారు బ్రహ్మాస్త్రమంత్రిత బాణవితతిఁ
గొట్టఁబడి రింద్రజిత్తుచే గోడువీడ. 161

తే. గీ. రావణి రణకర్కశుఁడు పరాక్రముండు
వీడె నంతర్ధియై తీక్ష్ణ విశిఖతతుల
నాగబాణపరంపర వేగ విడిచి
రామలక్ష్మణులను గొట్టె లాఘవమున. 162

ఉ. రోసముతో నదృశ్యుఁడయి రోయుచుఁ దీవ్రశరాళిఁ గ్రోతులన్
గాసిలఁజేసె నింద్రజి ముఖాముఖి పోరున రామబాణ వి
న్యాస మెదుర్కొనన్ బలమునన్ సరిగాక నదృశ్యుఁడై వెసన్
వేసెను నాగపాశముల వే శరబద్ధులు గాగ రాట్సుతుల్. 163

తే. గీ. సూదిమోపుటకైనను జోటు లేక
శరమయంబుగఁ దనువు లాచ్ఛాదితమయి
రక్తసిక్తదేహంబుల రాజసుతులు
పృథ్విపైఁబడి చేష్టల వీడినారు. 164

తే. గీ. ఛిన్నసర్వాంగులయి వారు విశిఖతతుల
నెత్తుటం దోగుచుండిరి నిద్రరీతి
రామలక్ష్మణు లిర్వురు రాజసుతులు
వీరులయ్యును జగతికి విభులు నయ్యు. 165

ఉ. రావణిముందు రాఘవుఁబరాజితుగాఁ బడఁగొట్టె భూమిపై
వేవివిధాస్త్రశస్త్రముల వేసి సుమిత్రతనూభవుండు వా
పోవఁగడంగె నన్నఁగని పొక్కుచు నేలను గూలె నాతఁడున్
దేవతలుంగపుల్ మునులు దిగ్భ్రమఁ జెందిరి విహ్వలాత్ములై.

తే. గీ. చావకయె చచ్చియుండిన సరణినుండి
వేడి నిట్టూర్పులను వారు వీడుచుండ
సూర్యసుతుఁడంగదుఁడు వాయుసూనుఁడాది
కపులు చుట్టుముట్టి రంత శోకంబుఁగనుచు. 167

ఉ. భూమిఁ బరుండియున్న నృప పుత్రుల నర్కజుఁడంగదాదిశా
ఖామృగయోధులందఱును గావల గాయుచునుండుచున్ నిజ
స్వామిఁ దలంచి దుఃఖమున వందురుచుండ విభీషణుండు వే
రాముఁడు చావఁడంచుఁ గపిరాజునకంతటఁగూర్చె ధైర్యమున్.

కం. గుసగుస లాడుచుఁ గపితతి
వెస గుంపులుగాఁగఁ జేరి బీభత్సగతిన్
దెసలకుఁ జూచుచుఁ బాఱుచుఁ
బసఁ జెడి చెల్లెక్కనున్న వారలఁ గనుచున్. 169

ఉ. చూడుడు కాంతియుండె రఘుసోముముఖంబునఁ జావఁ బోఁడు పో
రాడును మూర్ఛదేరి జయ రాముఁడు కాఁగలవాఁడు భీతినిన్
వీడుడటంచుఁ దెల్పెఁ గపి వీరులకుం గపులెల్లవారికిన్
వీడుచుఁ బోరుఁబాఱఁ దలపెట్టిన వారలు ధైర్యమూనగన్.

చం. భయమున వెన్ను నిచ్చి వడిఁ బాఱెడి కోతులనాపు సేయుచున్
రయమునఁ జెట్టుగుట్టలకుఁ బాఱెడి వారల మందలించుచున్
లయ మొనగూడ దెంచ రఘురామునకంచని నొక్కిచెప్పుచున్
స్వయముగ రామచంద్రుకుపచారము సల్పె విభీషణుండహో!

గీ. కరముతో నీట సుగ్రీవు కంటినీళ్ళఁ
దుడిచి ధైర్యంబు సెప్పి హితోక్తులాడి
మాయ తొలగంగ మంత్రించి మంచినీరు
నతనిపైఁ జల్లి మోహాలయంబుకొఱకు. 172

గీ. ఎల్లరకు నదృశ్యుండగు నింద్రజిత్తు
నావిభీషణుఁడు గనుట నంత వాఁడు
రామలక్ష్మణులనుగని రహిఁ జెలంగి
యసురు లానందమును బొందు నటుగఁ బలికె. 173

ఉ. చంపితి దండకాటవి నిశాచరులన్ ఖరదూషణాదులన్
జంపినవాని దేవతలు సన్నుతను లాసురు లేకమైన నా
పంపున నాగపాశముల బద్ధులు వీరల నాగపాశముల్
ద్రెంపఁగలార లెవ్వరు తుదింగనినారలు వీరలింతతో. 174

ఉ. ఏని కతంబునన్ జనకుఁ డెంతయొ భీతి వహించి నిద్రయున్
గానక దుఃఖముంగనుచుఁ గాలముఁ బుచ్చుచునున్నవాఁడొ యె
వ్వాని నిమిత్తమై ప్రజ లవారితభీతిఁ గలంగియుండిరో
వాని వధించినాఁడ నిక వర్ధిలవచ్చుఁ బ్రశాంతి రాక్షసుల్. 175

తే. గీ. మూఁడుయామంబులేగెగా పోఁడు నిద్ర
జనకుఁ డెవ్వానిపోరునే సతముఁదలఁచి
కాంచు నికశాంతి నిద్రింపఁ గలఁడు తండ్రి
యనుచు వేవేగఁ జననెంచి తండ్రిఁ గనఁగ. 176

తే. గీ. అతఁడు వానరయోధుల నందఱ వెసఁ
గఱకు తూపుల నొప్పించి వెఱపుఁ గొలిపి
రక్తమయులౌచుఁ బడియున్న రామలక్ష్మ
ణులను గని చచ్చి రని వారు తలఁచి యంత. 177

తే. గీ. రాక్షసుల హెచ్చరించుచు రావణు గని
తాను జంపితినంచనె దాశరథుల
పుత్రు దీవించి యా దైత్య పుంగవుండు
హర్ష చిత్తుండు రామభయంబు వీడి. 178

సీతకు రామలక్ష్మణుల శవములఁ జూపుట

తే. గీ. రావణిని బంపి రప్పించె రావణుండు
సీతఁ గాపున్న త్రిజటాది స్త్రీల నపుడు
కాంచి వారల రామలక్ష్మణుల చావుఁ
బ్రమదమునఁ జెప్పి పలుకాడె వారితోడ. 179

ఉ. ఏనిఁ దలంచి సంతతము నెవ్వతె నన్ వరియింపనొల్లదో
వానిని జంపె నింద్రజిఱె భర్త నశించెఁ దనంతఁదానె నన్
గానదొ ప్రేముఁడిన్ బతినిఁ గాంచఁగఁ జేయుడు చచ్చియున్న న
వ్వాని శవంబుఁ జూచిననుఁ బట్టును నమ్ముచు నేనె దిక్కుగా.

ద్వి. కొనిపొండు పుష్పకంబున సీత నిపుడె
కనునంత మరల నా వనిఁజేర్పుఁడామె. 181

కం. అనుచున్ లంకాపురి నం
తను బండుగగా నొనర్చె దైత్యేశుఁడు తో
రణముల భేరుల మ్రోతల
విన దైత్యులు రాము చావు విశదము గాగన్. 182

కం. వనితలు రాజాజ్ఞను రా
ముని హాతి దెల్పుచుఁ గనఁగ విమానమునందా
మెను గొని చూపిరి శవగతిఁ
దన విభు రక్తమయుఁగాంచి ధాత్రిజ యేడ్చెన్. 183

## సీత విచారము

చం. తనువులఁ దూపులున్నవి సదారుధిరంబు స్రవించుచుండె మా
ర్గణముల మధ్యపీడి స్పృహఁ గన్నులుమూసిపరుండియున్న రా
ముని సహలక్ష్మణున్ గనుచుఁ బుష్పకమందుననుండి సీత తా
మనమునఁ గుందుచున్నయది మానవదేహుల కార్తి దప్పునే.

తే. గీ. సంతసంబుననున్న రాక్షసులఁగాంచె
దుఃఖపీడితులై యున్న కోతులను గాంచె
శవమయంబుగనుండిన సమరభూమిఁ
గనులు మూసిన రామలక్ష్మణులఁ గాంచె. 185

తే. గీ. బాణతల్పశయనులైనఁ బార్థివులను
బాణపీడితరఘువంశ పుంగవులను
సాయకచ్ఛిన్న సర్వాంగ శౌర్యనిధుల
విపుల విధ్వస్త కవచాల వీరవరుల. 186

తే. గీ. స్పృహావిహీనుల మేన స్రవించు రుధిర
దేహులఁగనుచు సీత విదేహతనయ
పరమదుఃఖార్తిఁ గడుఁగడుఁ బరితపించుఁ
ద్రిజటఁ గాంచుచు విలపించు దీన యగుచు. 187

మ. ననుఁ గోల్పోయి మహాటవిందిరుగుచున్ నా జాడ నాలించి వా
రినిధిన్ సేతువుఁగట్టి వచ్చి యని నిఁద్రింపంగ వేఁబూనితే
వనజాక్షేక్షణ! రామచంద్ర! రిపుగర్వంబాపుశస్త్రాస్త్రముల్
ధనువుంగల్గియు లంకయందు మృతి బొందన్ వచ్చితే సీతకై.

ఉ. నాథ! యనాథనాథుఁడవె నన్నిటులేల ననాథఁ జేసితో!
బోధ యొకింతకాదిది శుభోచిత సర్వసలక్షణాంగినై
యీధరఁబుట్టియుంటినని యే మును శాస్త్రవిదుల్ వచింపరే
శోధనఁ జేసి జాతకము సూరులు దివ్యమటంచుఁదెల్పరే. 189

తే. గీ. పద్మరేఖల విలసిల్లు పాదయుగళి
నెవ్వతె జనించు నామె పృథ్వీశుభార్య
యగుచుఁ బట్టాభిషిక్తయై యలరునెడి
శాస్త్రవేత్తల మాట లసత్య మాయె. 190

తే. గీ. ఏవి యవలక్షణమ్ములో యింతి కెంచ
నవియ గనరావు వైధవ్య మబ్బె నెటుగ
అతుల శుభలక్షణమ్ములు వ్యర్థ మాయె
భర్తయే హతుఁడాయె శుభంబికేమి? 191

తే. గీ. సమము సూక్ష్మంబు నీలకేశములతోడఁ
గనుబొమలు వేరు వేరుగాఁ గ్రాలు దాన
పిక్కలును గుంఁడ్రములు లేవు వెంఁడ్రుకలటుఁ
బలువరుస తీరుగానుండి వరలుదాన. 192

తే. గీ. నా లలాటప్రదేశంబు నాదు కనులుఁ
జీలమండలు హస్తపాదాలుఁ దొడలు
బలిసియున్నవి గుంఁడ్రమంగుళి నఖమ్ము
దేల వైధవ్య మబ్బెనో? యెఱుక రాదు. 193

తే. గీ. కొనలు దేరిన విరళమౌ స్తనయుగంబు
వరలు నొండొంటి నొరసి నా పదము లఱయ
భూమిపై నాను మణినిభంబుమెయి రంగ
దేల? వైధవ్య మబ్బెనో? యెఱుక రాదు. 194

తే. గీ. మేన వెండ్రుకలు మృదుల మైనవి గను
హస్తపాదాల వ్రేళ్ళు రవంతసందు
లేకయుండియవాకార రేకలుగల
వేల వైధవ్య మబ్బెనో యెఱుక రాదు. 195

తే. గీ. నాభి లోతుగనుండి యున్నతపు పార్శ్వ
ములఁ దనరుచుండి చిఱునవ్వు మోముఁదమ్మి
దాననగుట సకలశుభదాయకమ్మ
దేల వైధవ్య మబ్బెనో యెఱుకరాదు. 196

తే. గీ. వారుణాగ్నేయవాయవ్య బ్రహ్మశిరము
లైంద్రమును నస్త్రములఁబొంది యలరువారె
ఆ మహాస్త్రసంచయ మేడ కటిగె నిపుడు
వచ్చె వైధవ్య మింకేల బ్రదుకు నాకు. 197

ఆ. వె. కపటయుద్ధమూని కడతేర్చె నింద్రజి
రామలక్ష్మణులను రాత్రి వేళ
రాముకంటఁబడిన రావణియు నపుడె
విగతజీవికాఁడొ! వేయి యేల! 198

తే. గీ. ఈ పరాక్రమశాలి మహేశ్వరుండు
తమ్మితోఁగూడ హతుఁడయ్యె ధాత్రిఁ బడియె
దైవవిధి కెదురగువారు ధాత వ్రాయు
కాలమును మీరువారలు గలరె పుడమి? 199

తే. గీ. అత్త కౌసల్య యెంతయే నార్తిఁ గుందు
విధవరాలను నాదు జీవితముపైన
వేయి విధములఁదలఁపేల వీడఁదగదె
యనుచు శోకించు సీతమ్మఁ గనుచుఁ ద్రిజట. 200

## త్రిజట సీత నోదార్చుట

ఉ. చచ్చినవాఁడుగాఁడు రఘుచంద్రుఁడు చావఁడు సీత నమ్ముమీ
పొచ్చెము వీడుమింక నిను మోయ విమానమురాదు రాముఁడే
చచ్చిన గాంతిఁ గాననగు సారసనేత్రుల మోములందు వే
చచ్చినఁవారు చూచుట కసహ్యముగాగ వికారులౌగదా! 201

తే. గీ. మూర్ఛఁగాంచిరి వార లా మూర్ఛనుండి
తెప్పరిలెడివారలు దేవి వినుము
సత్యముమ బల్కుచుంటి ననత్యమాడ
నీకు నాకును గలయట్టి నెమ్మివలన. 202

తే. గీ. అనఁగ సీతమ్మ యామాట లాలకించి
యంజలి ఘటించి భక్తిమై యనియె రామ
లక్ష్మణులు బ్రదుకుదురు సలక్షణముగ
నీవు చెప్పిన యటుగనే నిజము యగుత. 203

తే. గీ. అంత నావిమానముననే యవనిజఁ గొని
చేర్చెఁ ద్రిజట వేగ నశోక వృక్షవనిని
స్పృహను విడనాడి పడియున్న వీరవరులఁ
దలచి శోకించు సీతమ్మ ధాత్రిఁబడుచు. 204

రాముఁడు మూర్ఛఁదేరుఁట

ఉ. రాముఁడు లక్ష్మణుండును శరంబుల బద్ధులు గాఁగ వానర
స్తోమము సూర్యనందనుఁడుఁ జుట్టును రక్షణ మూనియుండ నా
రాముఁడుమూర్ఛఁదేఱికనిలక్ష్మణుఁడున్‌స్పృహఁదప్పి నెత్తుటన్
భూమిఁబరుండియుండుట ప్రమోదముబాయుచుదుఃఖితాత్ముఁడౌ

రాముఁడు చింతించుట

ద్వి. సౌమిత్రి పడియుండ సంగరభూమి
నేమిక నాకగు నీసీతతోడ. 206

ద్వి. ఈజీవితంబుచే నేమికార్యంబ
ఆజిలో సోదరుం డంతరింపంగ. 207

ద్వి. భూమిపై వెదకిన భూపుత్రివంటి
భామ రెండై ననుఁ బ్రాప్తంబు కారె. 208

ద్వి. కనుఱెప్ప వేయక నను గాచునట్టి
యనుజుండు లభియింపఁ డవనియందెచట. 209

ద్వి. సౌమిత్రి జీవమే సమసిన యేని
నేమరణింపనే యాకోఁతులుఁగన. 210

ద్వి. ఏ నయోధ్యకుఁ బోయి యేమనఁ జెల్లు
ఏనొక్కరుడ నేగి యేమనువాఁడ. 211

ద్వి. మూవుర తల్లుల ముద్దుబిడ్డండు
మూవుర తోడుల మురిపెంపు తోడు. 212

శా. నాతోడన్ వని కేగుదెంచి సతమున్ నారక్షణంబూనుచున్
బ్రీతిన్ నా వెనువెంటనే తిరిగి సేవించెంగదా! కానలోఁ
జేతన్ విల్లునుబూని శత్రుచయముం జెండాడు వీరున్ మహా
భూతప్రేతపిశాచసంతతులకున్ భోజ్యంబుగా వీడుదే. 213

ద్వి. జీవంబు వీడుటే చేయఁగాఁ దగును
దావానలమువోలె దహియించు నార్తి. 214

తే. గీ. కాని నేవిభీషణు రాజుగా నొనర్ప
సల్పిన ప్రతిజ్ఞ యంత నసత్యమగును
దానఁ బాపంబు వాటిల్లు దగ్ధమగుదు
నేమి సేతును శోకార్తి నెటుభరింతు. 215

తే. గీ. పోఁదగును నీవు సుగ్రీవ పొందు విడిచి
స్వీయసైన్యంబుతోడ గిష్కింధ కింక
నేను లేకుండుటను జూచి నిన్ను దైత్య
రాజు దటిమి కొట్టడకొ సంద్రంబుఁదాట. 216

తే. గీ. వీరులంగదాదులుఁ గడుపోరినారు
నలుఁడు నీలుండు జాంబవంత శరభులును
దక్కఁగాఁగల యోధులు నెక్కుడుగనె
పోరిరి నరులు దాటఁగ లేరు విధిని. 217

చం. హితుఁడవు శక్తియుక్తుల జయింపఁగఁ జూచితి నీవు దైత్యులన్
హితమతివానరప్రతతి నీవలె బోరిరి దోర్బలంబునన్
సతతము ధర్మమెంచియె నిశాచరకోటి నెదిర్చి శక్తిమై
విదితము సేసినావు మన హితము నీకొరులేరు సాటియే. 218

తే. గీ. హనుమ యొనరించె నితరుల కలవిగాని
సత్కృతులఁ బోరునందు నిశాచరతతి
సంహరించిన వీరుఁడు సాటిలేని
భక్తుఁ డాతని కెనయైన వారు లేరు. 219

ద్వి. శక్తివంచన లేక సల్పిరి రణము
భక్తిమై వరలిరి వానరులార! 220

ద్వి. ఆనతిచ్చితినిదె యరుగంగ మీరు
పూని ధైర్యము స్వేచ్ఛఁ బొండిక మీరు. 221

కం. అని రాముఁడు మాటాడఁగ
విని పరితాపంబు నొంది విహ్వలు లగుచున్
వనచరు లెల్లరు కన్నీ
ళ్ళను గార్చుచు రాముఁగనిరి లావు దొలంగన్. 222

## విభీషణుఁడక్కడకు వచ్చుట

తే. గీ. అంతఁ గపుల నిలువరించి యా విభీష
ణుండటకు వచ్చె గదఁబూని చండరీతి
నతని నల్లని దేహంబు నతనిగదను
గాంచి యింద్రజి యనిభీతిఁ గనిరి కపులు. 223

తే. గీ. వీఁడుడు భయంబు నింద్రజి గాడితండ్రు
మన విభీషణుఁ డీతండు మఱలు డంచు
జాంబవంతుండు వానర చయము నెల్ల
జాఱుచుండిన వారలఁ బట్టి నిలిపె. 224

ఉ. చేతుల నీరముం గొనుచుఁ జేష్టలఁ దక్కి పరుండియున్న వి
ఖ్యాతులు రామలక్ష్మణుల కన్నులపైన విభీషణుండు సం
ప్రీతిగఁజల్లె స్వేద జన వే మదిగుందఁగసాగెఁ గాంచుచున్
భూతలతల్పమందు శరముల్ మెయి దూరి తపించువారలన్.

తే. గీ. ఆ విభీషణు దుఃఖమ్ము నర్కసుతుఁడు
గాంచి నాశ్వాస మొనరింపఁ గడగి పలికె
వీరు మూర్ఛఁ దేఱుచు జంపి వైరి నిన్ను
లంక రాజుగఁ జేయఁగ లారటంచు. 226

తే. గీ. మధురగతి నావిభీషణుగని మాటలాడి
ప్రక్కనున్న సుషేణుని బలుకరించె
మూర్ఛదేరగ వీరల మోసికొనుచు
పొమ్ము వీరి కిష్కింధకు నిమ్ముగాగ. 227

తే. గీ. పుత్రబంధుమిత్రసమేతముగ సురారిఁ
జంపి సీతఁదెచ్చెద రామచంద్రునికిడ
నంచు సుగ్రీవుఁడాడంగ నాసుషేణు
డతని నూరడించుచుఁబలు కాడఁ గడఁగె. 228

తే. గీ. దేవదానవయుద్ధంబె దీని సాటి
గాంచియుంటి ఈతాంగుల గాయములకు
నాఁడొనర్చెఁ జికిత్స నీ నాడుగూడఁ
జేయఁగా నగు నా చికిత్స సంజీవకరణి
యును విశల్యకరణియుఁదేఁ బనుపు కపుల. 229

తే. గీ. చంద్రుఁడను ద్రోణమను కొండ చరియలందు
వాని గొని తెచ్చు హనుమ వే వానిఁబంప
రాఘవుల గాయములను నమోఘ రీతి
మాన్పగలవవి వీరలు మనగలారు. 230

## గరుత్మంతుని రాక

తే. గీ. అని సుషేణుడు పలుకాడు నంత
వీచెఁ బెనుగాలి చెట్లన్ని విఱిగి పడఁగ
జలధరంబులు పట్వేడ సంద్రజలము
కలియునట్లు మహోధ్వని కడలిఁ బుట్టె. 231

తే. గీ. కడలి సర్పంబులన్నియుఁ గాంచె భయము
నేలఁగల పాము లన్నియు నీటఁ జొచ్చె
రివ్వుమని వచ్చు గరుఁడుని దవ్వులందుఁ
గనుచు నాగపాశంబులుఁ జనిన వంత. 232

తే. గీ. బలముగలవాని జ్వలియించు వైనతేయుఁ
గాంచినంతట నింద్రజి కఱకుటమ్ము
లనఁగ వీడిన నాగచయంబు రాఘ
వులను వీడి పాఱిన వంత విలయగతిని. 233

ఉ. కాంచిరి వానరుల్ పరమ కాంతి వెలింగెడి వైనతేయు సే
వించి యతండు రాఘవుల వేతడిమెం దనువుల్ గరద్వయిన్
మించిన భక్తి రాముఁడు సుమిత్రసుతుండును సుస్వరూపులై
మించిరిపూర్వకాంతినినమేయగుణాస్పదసూత్మబుద్ధినిన్. 234

ఉ. వీరుఁడు నాగవైరి రఘు వీరులఁ గౌగిటఁ జేర్చి తుష్టుఁడై
వారలఁ గాంచుచున్నిలిచె భక్తిమెయిన్ గని వాని రాఘవుం
డారయ నెంచి యాతనిఁ బ్రియంబున మెచ్చుచు బూర్వరీతి శా
రీరబలంబు వచ్చెను జ్వలించెడి మీరలు నుమ్ముఁదాఁకగా. 235

ఆ. వె. తమను జూడఁ దండ్రి తాతలఁ జూచిన
యట్లు హర్షమొదవె నతుల రూప
ఇటకు వచ్చి నార లెవ్వారు మీరలు
దెలుపఁ గోరువాఁడ దివ్యపురుష. 236

ద్వి. అని రాఘవుఁడు గోర నాదివ్యమూర్తి
మనవి యొనర్చెను మాసతీపతికి. 237

తే, గీ. గరుడుఁడను వాఁడ మీహిత కరుఁడ నేబ
హిశ్చరంబగు మీప్రాణ మేను వినుచు
నాగ పాశబద్ధులుగ నున్నారటంచు
వినినతోడనె వచ్చి తీఁ గనితి మిమ్ము. 238

తే. గీ. క్రూరకర్ముండు రావణి గూర్చినట్టి
నాగపాశంబులివి వీని నాగదేవ
దానవులగు వారలెవరు గాని వీడఁ
జేయఁజాలరు రావణి మాయవలన. 239

తే. గీ. కాలసర్పంబులివి వీని కద్రువగనె
విశిఖములరీతి నింద్రజి వీడె వీని
సఖుఁడ! రాఘవా! ధర్మజ్ఞ! శత్రువత్స
లుండ! నీవ యనిని విజయుండవౌదు. 240

తే. గీ. ఏనెటుగ నీకు సఖుఁడనో యెంచవలదు
రాక్షసులఁ జంపి జయమొంది రణమునందు
నీవెఱుంగగలవు మన స్నేహవిధము
పోయివచ్చెద సెలవిమ్ము భూతలేశ! 241

తే. గీ. సీతఁగొని రాజ్యమేలుచుఁ జెలిమి విధము
నెఱుఁగఁగాఁగలవాడవో యినకులేశ!
యని ప్రదక్షిణ మొనరించి యంజలి ఘటి
యించి కౌగలించి సుపర్ణుఁడేగెనంత. 242

ఉ. రాముఁడు లక్ష్మణుండపుడు రావణి బంధములన్ని వీడఁగా
శ్యామలదేహులై విమల కాంతి విరాజితులైరి వానర
స్తోమము వారలంగెరలు చుంగని సింహనినాదముల్ గడున్
వ్యోమతలంబునంటగ రిపుల్ విని భీతిలఁజేసి రంతటన్. 243

అంబురుహవృత్తము :

వానరు లంతట భేరుల గొట్టిరి వాలముల్ నిగుడించుచున్
పూనిరి శంఖనినాదము మద్దెల మ్రోతలంగడు హృష్టులై
దానవు లెల్లరు భీతిలు రీతిగ దైత్యనాథుఁడు వేగులన్
వేనియమించె గనుంగొన గోతుల వేడ్కకుం గతమున్ వెసన్.

సుగంధి :

వించు రాత్రి వానరాళి వేగ సల్పు ఘోషఁబు
త్తెంచినట్టి వేగులంత దెచ్చియున్న వార్త నా
లించి పాశబద్ధులైర రే? యెటుల్ విముక్తులై
రంచు రావణుండు భీతి నాత్మలోఁ దలంచుచున్. 245

సుగంధి :

వైరినాశనంబె యెంచి వైచె నాగపాశముల్
ధీరుఁడైన నింద్రజిత్తు తెప్పరిల్లి నారలే
వారలింత నుంచి సల్పువారు ఘోరయుద్ధమున్
శూరులైనవారు చావఁ జూచుటొండె కర్జమా. 246

కం. అనుచున్ గర్జించుచు రా
వణుఁడనె ధూమ్రాక్షునిఁగని భారము నీదే
యనిలో వానరవైరుల
దునుమాడి జయంబుఁగాంచ ధూమ్రాక్ష యనెన్. 247

మానిని :

ఆలన సేయుచు తేని యనుజ్ఞను నాసురసైనికులంతన్
గాలునిఁ బోలెడి భీకరమూర్తులు కావరమొప్పఁగఁ బోయిరిగా
నాలముసల్పఁగశూలముముద్గరమాదిగనాయుధముల్ గొనుచున్
బాలకుఁడెంతయొఁ బ్రీతినిగాంచగ వారల యుద్ధమహోద్ధతినిన్.

కం. నడుముల గంటలు మ్రోగగ
వెడలిరి ధూమ్రాక్షు వెంట వేరథములపై
వడిగ గజాశ్వఖురమ్ములు
తడబడకన్ లాగుచుండ దైత్యుల యోధుల్. 249

ఆ. వె. దుర్నిమిత్తములను ధూమ్రాక్షుఁ డప్పుడె
యనికిఁ బోవు దారి యందెఁ గనియె
వాలి గృధ్రమతని ధ్వజముపైఁ గూర్చుండె
నపశకునము లెన్నొ యైన వంత. 250

మ. ప్రకటభ్రూకుటిరక్తనేత్రుఁడగుచుం బల్మారు గర్జించుచున్
వికటాకారుఁడు భీకరుండు రణసంవేద్యుండు ధూమ్రాక్షుఁడా
జికిఁబోయెన్ నిజసైన్యయుక్తుఁడగుచున్ జీమూతమున్ మించు
సకలాత్ముండగు రామచంద్రుపయికిన్ సంసిద్ధుఁడై పోరఁగన్. 251

గీ. రక్తమయమైన శవమొండు రథముముందుఁ
బడియె శవభుక్కులగు పక్షివర్గమపుడు
రథముపై నుండి శవముపై వ్రాలెనంత
రుధిరవర్షంబు గురిసె నా రథముపైన. 252

గీ. పిడుగుపడురీతి ధ్వనితోడ వీచె గాలి
తిమిరమలముచు దిక్తతి తేజుఁ బాసె
వీని వీక్షించి ధూమ్రాక్ష వీరుఁ డంత
దుఃఖమును గాంచె బలగంబు దుఃఖితమయె. 253

## ధూమ్రాక్షుఁడు చచ్చుట

గీ. రాజు నాజ్ఞనుబూని ధూమ్రాక్షుఁడపుడు
వేయకోకయింత వెనుకంజ వెడలదొడఁగె
సరకుసేయఁడు నుత్పాత సరణిఁ గాంచి
బవరమూనఁగ నుత్సాహవంతుఁడగుచు. 254

గీ. రామబాహుపాలితవానర బలగంబు
కడలివలె నొప్పుచుండంగఁ గాంచినాఁడు
విపులసైన్యసమేతుఁడై వెడలె వాఁడు
వాయుసుతుఁడున్న పశ్చిమద్వారమునకు. 255

దరువు:-

వానరు లెల్లరు వారని వేడ్కన్
బూనుచుఁ జెట్లను భూరి నగంబుల్
దానవ సేనల దగ్ధ మొనర్పన్
ప్రాణము లొడ్డిరి భండనమందున్. 256

తే. గీ. బాణశూలముద్గరములఁ బరిఘులఁ గొని
రాక్షసులు వానరుల భీకరంబు గాగ
జంపి రంతట శిలల రాక్షసులపైన
వానరులు వేసి దునిమిరి వారి నపుడు. 257

తే. గీ. అపుడు శాఖామృగావళి యసురతతుల
గోళ్లఁ జీల్చుచు దంతాలఁ గొఱుకుచుండి
శిలల విసఱుచు శిరముల శిధిల పఱచి
చంపసాగెను దైత్యులు చచ్చుటఁగని. 258

శా. ఏపుం జెంది నిశాబలప్రగతిమై నీర్ష్యంప్రబతాపంబుతోఁ
గోపావేశంబున వానరౌఘముల వేగోడ్డళ్ళచేఁ గొట్టుచున్
దూపుల్ వీడుచుఁ జీల్చుచుం దినుచు దైత్యుల్ భీకరాకారులౌ
టోపంబుం బ్రకటించుచుండిరి కపుల్ డుల్లంగ నిర్జీవులై. 259

తే. గీ. వానరుల చావుఁ జూచి యావాయుజుండు
రాక్షసుల చావుఁ గాంచి ధూమ్రాక్షు డంతఁ
గడు భయానకబీభత్స గతినిఁ దాకి
రొండొరులను జయార్థు లుద్దండ రీతి. 260

ఉ. వారని భీతిమై ముడిచి వాలములం గపులందు కొందఱా
వైరుల ధాటికిన్ వెఱచి పాఱుచునుండిరి నిల్చిపోరుచోఁ
బోరున జచ్చుచుండిరి కపుల్ గడుభీతిలుచున్నవార లా
తీరును జూచి వాయుజుఁడు తేరులపై వడి వేసె కొండలన్.

ఉ. ముక్కలు చెక్కలౌచు రథముల్ ఖరముల్ తురగంబులేనుగుల్
డొక్కలు బ్రద్దలౌచు వడిడుల్లుచుఁ దెళ్లినవప్డు బండలన్
దిక్కులు పిక్కటిల్లు ధ్వని దేరుభువింబడి చచ్చి గుట్టముల్
ద్రుక్కగ ధూమ్రనేత్రుఁడు వసుంధర నిల్చె గదాధరుండుగా.

తే. గీ. కోపతాపాలు పురిగొనఁ గ్రోధి యగుచు
గదను గొని వాయుసూనుని గదిసికొట్టెఁ
బరిగణింపక నాదెబ్బ వాయుసుతుఁడు
శిఖరమును వైచె ధూమ్రాక్షు శిరముమీద. 263

తే. గీ. అసువులను వీడె ధూమ్రాక్షుఁ డంత హనుమ
శైలపాతంబుకతన వేజావకుండఁ
బారిపోయిన దైత్యులు ప్రభువుఁ గాంచి
చచ్చె ధూమ్రాక్షుఁడని తెల్పినారు చావు కబురు. 264

ఉ. ఏనుగు మొండెముల్ తలలు నీల్గిన నశ్వఖరాదిదేహముల్
గానఁగనౌ రణస్థలిని గార్ముకముల్ చెడియున్న ప్రోగులన్
దానవులౌ శవంబులను ధాత్రిధరప్రకరంబు తున్కలున్
వానరవీరుఁ డాహనుమ వైచిన కొండలఁ జచ్చి రాసురుల్.

కం. రూక్షణ సంగ్రామము ధూ
మ్రాక్షుఁడు పూని హతుఁడయ్యె రాక్షస సైన్యం
బక్షయ మయ్యు నశించెను
రక్షోనాథ యని తక్కురక్కసులనఁగన్. 266

వజ్రదంష్ట్రుఁడు చచ్చుట

కం. విని రావణుఁ డామాటను
కని దుఃఖము భీతియు మదిఁ గాననచరులే
యనిఁ గెల్చిరిగా యనుచుం
బనిచెన్ వేవజ్రదంష్ట్రి బవరము సలుపన్. 267

తే. గీ. వజ్రదంష్ట్రుఁడు దక్షిణ పార్శ్వమందు
వేచియుండిన నంగద వీరుఁ డాకె
నిజబలసమన్వితుండయి భుజబలాన
సలిపి రావీరు లిర్వురు సమర మపుడు. 268

తే. గీ. సింహనాదాల దైత్యులు చేయుచుండి
రథగజతురగ బలవీర రణముఁ బూని
ప్లవగతతి దేహముల నెత్తు రలము కొనఁగఁ
దూపులను ఖడ్గముల వారిఁ ద్రుంచి రపుడు. 269

ఉ. వానరకోటి వృక్షములఁ బట్టుచు వాలములన్ నిగుడ్చుచున్
దానవసైన్యముం గదిసి దైత్యులఁ జంపిరి కొండ బండలం
బూనుచు రాక్షసావళి లబో యన వారల మస్తకంబులున్
వేనకు వేలు చూర్ణమయి పృథ్విఁబడెంబవరంబు నూనగన్.

తే. గీ. వానరులు రాక్షసులు బాహు బలముఁ జూపి
యొండొరులఁ బట్టి చంపుచు నుండి రపుడు
వజ్రదంష్ట్రుండు తూపుల వానరతతి
శవములే గుట్టలౌ రీతిఁ జంపుచుండె. 271

కం. ఇరుపక్షము లొండొంటిని
ధరపైఁ గూలంగఁ జేయు తరుణమునందా
సురవీరుడు నంగదుఁడు నొం
డొరుఁ దాకుచుఁ బూని రంత నుగ్రరణంబున్. 272

సీ. చెట్లను జేఁబూని కొట్టఁగా శిరముల
నుంకించి యత్నించుచున్న వారు
గదలను జేఁగొని కంఠీరముల వోలె
గర్జించి పోరాడఁ గలుగు వారు
ఖడ్గంబులంగొని కసితోడఁజంపఁగా
నొండొండుతోఁ బోరు చున్న వారు
ముష్టులబిగియించి మోదుచు గుద్దుచు
ద్వంద్వయుద్ధంబుఁ జేఁబట్టు వారు
కోదండములఁగొని కోపారుణాక్షులై
బాణపరంపర వదలు వారు.

తే. గీ. ఇరువు రేకవిధాయుధంబె గ్రహించి
ద్వంద్వయుద్ధంబు సల్పుచు దాన నలసి
కొంత తడవాగి నట్లుండు నంత వాలి
కొడుకు వజ్రదంష్ట్రుని మెడఁ గోసి చంపె. 273

ఆ. వె. ప్లవగసైన్య మెల్లఁ బ్రమదంబుఁ గనె నంత
నంగదుండు మోద మంది యుండె
తటిమి గొట్టఁబడుచు దైత్యుల సైన్యంబు
లంకఁ జేరి వారు రాజు గాంచి. 274

కం. సైనికనాథుఁడు చచ్చుట
సైనికులంగొలదిమంది చావని వారల్
జానికిఁ జెప్పిరి రణగతి
దానవవీరుండు వజ్రదంష్ట్రుని చావున్. 275

## అకంపనుండు చచ్చుట

ద్వి. మేఘవర్ణుండు నమేయబలుండు
మేఘగర్జన సేయు మేటి వీరుండు. 276

ద్వి. సేనకధ్యక్షుండు శీఘ్రంబుగఁ జని
పూనె రణమ్మును బొందఁగా జయము. 277

తే. గీ. అనియకంపను గాంచుచు నసురవిభుఁడొ
సంగె నాజ్ఞను వెనువెంట సైనికతతిఁ
గొనుచు రాము లక్ష్మణుఁ జంపి వనచరేశు
మడియఁ జేసి జయమ్మున మఱలిరాగ. 278

ద్వి. బంగారు పోగుల వరలెడి వాఁడు
ఖంగున రథమెక్కెఁ గాలుఁడో యనఁగ. 279

ద్వి. అనియందుఁ గదలింప నలవి గాకుండఁ
ఈశాజ్ఞనిడ చెలఁరేగుచు వాఁడు. 280

ద్వి. సైనిక నివహంబు సనెఁ దనతేరు
పూనిన తురగాళి వొందె దైన్యంబు. 281

ద్వి. మొగముల వర్ణంబు వోయెను స్వనము
దిగఁజారె వెడలెడి తేరునందపుడు. 282

ద్వి. సుదినంబుగా వెల్గు సూర్యుఁడు మబ్బు
చదలంత నిండి యాచ్ఛాదన మొందె. 283

తే. గీ. ఆ మహోత్పాతచయముల నతఁడు సరకుఁ
గొనఁడు సైన్యసమేతుఁడై యనికిఁ జనియె
నాయకంపనుఁ డేగు మహాధ్వని విని
వానరులు సిద్ధమైనారు బవర మూన. 284

తే. గీ. రామరావణార్థంబుగా రణముఁ బూని
హరులు రక్కసులును బోరి రపుడు దుమ్ము
గప్పి నింగి భూమియు నేమి గాన రాక
వినఁబడియె గుణధ్వని యొండె వీను లదర. 285

కం. వానరులను వానరులే
దానవులే దానవులను దా మొదు ననిలోఁ
గానఁగఁ జాలకఁ జంపిరి
భూనభములు నిండి మాఱుమ్రోఁగెడి ధ్వనిలోఁ. 286

తే. గీ. వెఱపుఁ గొనుచున్న తమవారి ద్వివిద మైంద
కుముద నలు లంత గాంచుచుఁ గోప మూని
సింహ నాదంబుఁ జేయుచుఁ జెలఁగి చెలఁగి
గుంపు గుంపుగఁ గొట్టిరి కూల నరులు. 287

ఉ. దాని నకంపనుండు గని తక్షణమే రథమున్ మరల్చి నా
వానరవీరులం గదిసె వార లకంపనుఁడున్ మహోరణం
బూన భయంబునం బ్లవగముల్ వడిఁ బాఱుటఁ జూచి క్రుద్ధుడై
చేనొకకొండఁ బూనియని సేయఁగడంగెను వాయు సూనుఁడున్.

తే. గీ. వాయుసుతు డకంపనుమీఁదఁ బడఁగఁ గొండ
విసిరె నద్దాని దారిలో విశిఖ తతుల
గట్టిగాఁ జూర్ణంబు గాగ నకంపనుండు
గొట్టి వాయుసూనుని కొండఁ గూలఁ జేసె. 289

తే. గీ. అంత మద్ది వృక్షముఁగొని హనుమ వెడలి
గిరగిరం ద్రిప్పి రథ గజతురగములను
రథికులఁ బదాతులను జంపె రాక్షసాళి
భయముఁ గొని పర్వు లెత్తుచుఁ బాఱిపోయె. 290

తే. గీ. బాణ వర్షంబుఁ గురిపించి వాయు సూనుఁ
జంప యత్నించె నంత నకంపనుండు
అగ్ని పొగ లేక వెలుగొందునట్టి దీప్తి
హనుమ రక్తారుణంబగు తనువుతోఁడ. 291

ఆ. వె. మద్ది చెట్టుఁ బూని మస్తకమునఁ గొట్టె
వ్రక్కలై యసురు శిరంబు వడగ
హనుమ చంపి యటుగ నాయకంపను నంతఁ
దఱిమి దఱిమి దునిమె దైత్య తతుల. 292

కం. కొండలు వెన్నిచ్చుచు వే
పందలవలెఁ బాఱి లంకఁ బ్రభువున కంతన్
గుందుచుఁ దెల్పి రకంపనుఁ
డొందెను మృతి నంచు దుఃఖ మూనెను ఱేడున్. 293

తే. గీ. విజయ లక్ష్మి విలాసిత వీర హనుమ
గాంచిసింహ నాదంబులఁ గపులుఁ జేసి
పొగడి పూజించినారలు భూపసుతులు
నర్కజ విభీషణులు మెచ్చి రతనిఁ జూచి. 294

కం. కొనియాడెను దేవగణము
వనచరముఖ్యుని హనుమను వైరుల వీరున్
దునుముటఁ గని దుందుభి మ్రో
తను రావణుఁడు విని భీతి దద్దరిలంగన్. 295

## ప్రహస్తుఁడు

తే. గీ. ఆ యకంపను మరణంబు నసుర విభుఁడు
వినుచు దిగులొంది కోపంబుఁ గనుచుఁ గొంత
తడవు మంత్రులఁగూడి మంతనము సేసి
వేచి పూర్వాహ్ణమందునఁ జూచెఁ బురిని. 296

ఆ. వె. సైన్యతతులతోఁడ సంరక్షితంబగు
లంకఁ జూచిరాజు జంకు వీడి
కపివృతంబు లంకఁ గాయంగఁ దలపెట్టి
సైన్యనాయకుఁ గని సంప్రదించె. 297

తే. గీ. కని ప్రహస్తుని నీపెగా గట్టివాఁడ
వనిని వేఱెరికినిఁ బోర నలవి గాదుఁ
నే నికుంభుండు నింద్రజి నీవు కుంభ
కర్ణుఁడును దప్ప గెలువగాఁ గలఁడెవండు? 298

తే. గీ. ఓ మహాబలసంపన్న ఊను మనిని
సేన కధిపతి వగు నీవె సేనను గొని
వెడలునంతఁ జపలుఁలౌ కపివరు లెల్లఁ
గదన రంగంబు వీడుచుఁ గదలిపోరె? 299

తే. గీ. చంచలులు వారు యుద్ధశిక్షణ మొకింత
లేని వారలు స్థైర్యంబు లేని వారు
నీవు సింహనాదము సల్ప నిలువ గలరె
వారు పాఱిపోవరె వీడి ఖండనమ్ము. 300

తే. గీ. వానరులు పాఱ నెవ్వారు వారి దిక్కు
రాముఁడును లక్ష్మణుఁడు నిరాలంబు లగుచు
నీకు చిక్కరే వారు కాని యనియందు
చావొ విజయమొ యేదేని సంభవించు. 301

తే. గీ. అనుచు నీలంకఁ గాయఁగా మనము నేడు
సంగరముఁ బూనకున్నను జంపకుండ
వీడుదురె శాత్రవులు చావు విడువదపుడు
పావకాశము గల దని జయముఁ గాంచ. 302

తే. గీ. యుద్ధ మొనరింప నద్దాన యుద్ధమె తగుఁ
గాదనిన నీవె చెప్పుము కర్జ మిప్పు
డని ప్రహస్తుని గోరె దైత్యాధిపుండు
వాహినీపతి విని వానిఁ బలుకఁ బూనె. 303

చం. అచలనిశాచరేశ్వర భయంబు జనించిన దేల? వీడు నీ
సచివులతోడఁగూడి మునెసర్వము యోజనఁ జేసితీవు నే
నుచిత మటంచు నెంచినది యోర్మి వహించి వచించినాడ నా
వచనములెంచి తక్కఁగల వారలు నాపయి దెబ్బలాడినన్.

శా. మున్నెన్నంటిని నాడె సీత నిడి రాముస్ మైత్రినింగోరు మం
చెన్నంబూనరు మంత్రు లప్పుడని నీకిష్టంబు ప్రాణార్థమై
వెన్నియందలపెట్ట నీయభిమతంబె దీర్చువాఁడన్ మఱో
తెన్నేమున్నది దానవేళ యిపుడెంతే యోజనన్ సల్పినన్.

ఉ. తిన్నది నీదు తిండి మెయి తీరుగఁ దాననఁ బెంచినాడ నా
పన్నతనున్న నిన్ను విడఁ బ్రాణము పోయినఁ బోవు గాక నీ
సన్నిధినే జయంబో యనిచావో వరించెడివాఁడ సుమ్మ; ము
న్నెన్నడొ చేయిజారెను సుమీ యల సామవిధాన మెంచఁగా.

తే. గీ. కాగలది కాకమానదు గణన మేల
చచ్చి రప్పుడె మనవారు చాలమంది
జయము గాంచిన సైనిక సౌఖ్య మబ్బ
నపజయమున నాముష్మిక మందఁగలము. 307

కం. కానున్నది కాక విడుచు
నే నిన్ను ననున్ మఱేని నేనియుఁ గానీ
పూనెద రణమును రాముని
ప్రాణంబె కొనఁదలంతు రాక్షస రాజా! 308

తే. గీ. పోయివచ్చెద సంగర మూనువాఁడ
ననుచు నిజబలంబునుగూడి యరుగుచుండి
దారిలోఁ గాంచి దుర్నిమిత్తముల నెన్నొ
కాలువెనుకాడకయె పోయెఁ గాలుని వలె. 309

తే. గీ. అపుడు రాక్షస బ్రాహ్మణులగ్నిహోత్ర
హోమముల సల్పిరి జయంబు నొందుకొఱకు
నాజ్య గంధ యుతము మనోహరము గాగ
వాయు వెల్లెడ నిండెను బట్టణంబు. 310

తే. గీ. ధనువు కవచంబులు ధరించి దైత్యబలము
రాజునకు మ్రొక్కెను బ్రహస్తు రథముముందు
జనియె భేరీనివాదంబు శంఖ సింహ
నినదములు భయంకరముగ నింగి నిండె. 311

తే. గీ. కడునిపుణుఁడు సూతుఁడు తేరు గట్టిది తుర
గంబులా వేగముగఁబోవఁ గలవు స్వర్ణ
కాంతి వెలిగెడి రథము నా గాలిమేత
రిగల ధ్వజ మెగురఁ జనియె రిపులఁ దాక. 312

తే. గీ. ఆ ప్రహస్తుని వెనువెంట నతని సచివు
లరిగి రాకుంభహానుఁడు నరాంతకుండు
నతులుఁ డా మహానాథుఁడు నాసమున్న
తుండు నలువురుగూడఁ బ్రచండ బలులు. 313

తే. గీ. ప్రళయకాల యముండను భాతి నున్న
నా ప్రహస్తుఁ డంబుధి ప్రవాహంబు వోలె
వెంట వచ్చు మహాసైన్యవితతిఁ గూడి
యుద్ధమున కేగె నిజలంక నుద్ధరింప. 314

సీ. మాంస రక్తాహార మహిత ఖగతతి ప్ర
దక్షిణ మూనె రథమ్ము చుట్టు
పావక జ్వాలలఁ బైకిఁ గ్రక్కుచు నక్క
లఱచుచున్నవి తేరు కడ్డునిలిచి
కొఱవి కట్టియ వంటి గొప్ప తేజమువడె
ధాత్రిఁ దేరు కదలు తరుణమందు
నెత్తురు గురిసెను నెత్తుటఁ దడువంగ
సైన్యంబుమీద వర్షంబు వోలె

తే. గీ. గద్ధ్వజముపైన యమముఖంబు గాగ
వ్రాలె సారథి చేనుండి పడియె కోల
సమతలమునందె పడిన వశ్వములుగూడ
వీనిఁ గని వివర్ణముఖుఁడై వెడలె ననికి. 315

తే. గీ. శలభ మగ్నిని జొరఁబడు సరణి వాఁడు
విజయ మొందఁగఁ దలపెట్టి వెడలి చొచ్చె
వానరేశుఁడు సుగ్రీవు బలమునందుఁ
బ్రథితుని బ్రహస్తుఁ గాంచుచు వానర తతి. 316

తే. గీ. ఆయుధంబులు గాగ వృక్షాళి శిలలఁ
గొనుచు సింహనినాదంబులను జెలంగి
యని నొనర్పంగనుండిన యపుడు రాముఁ
డడిగెనా విభీషణుని బ్రహస్తుగూర్చి. 317

తే. గీ. ఆ మహాబాహుఁడై యున్న నతఁడెవండు
అమిత సేనలతోఁడ వాడధిగమించెఁ
జూడఁగఁ బరాక్రముండని వాఁడుతోచు
సర్వ మెఱిగింపు మాతని సమర బలము. 318

ఉ. ఆతఁడు సైన్యనాయకుఁడు నాతఁడె రావణరాజుకుం బ్రియుం
డాతఁడు సుప్రసిద్ధుఁ డనినాతఁడె మూడవవంతు సేనకున్
నేత మహాస్త్రవేత్తయు వనీచను లాతని బాణధాటి నే
రీతి సహించువారో యవలీలఁగఁ బోరు ప్రహస్తుఁ డాతఁడే.

ద్వి. అనుచు విభీషణుఁ డాడ రాముండు
విని చిరునగవున వేయూచెఁ దలను. 320

కం. చెట్టుల శిలలను బూనుచు
బిట్టుగ యుద్ధంబు సలుపు వేడుక లంకన్
జుట్టుచు ముట్టడి నిల్చిరి
దిట్టరులై జయము నొందు దీక్షను గపులున్. 321

కం. నెట్టుచు గదలను మోదుచుఁ
గొట్టుచుఁ దూపులను వధించి కోతుల మూకన్
బిట్టుగఁ గత్తుల నఱుకుచుఁ
బట్టుచు దినువారి దైత్య వారములంతన్. 322

కం. కొఱుకుచు దంతంబుల చే
గీఱుచు నఖముల నసురుల గిరులన్ విసరున్
బాఱుటకుం దడ వీయకఁ
జీఱగ నాసుర శిరములు చెచ్చెర కపులున్. 323

కం. కొండల బండల భూమిజ
తండంబులచేతఁ జచ్చు దైత్య గణమ్మున్
భండనమునఁ గనుచుఁ బ్రహ
స్తుండతని సచివులు గోపదుర్మతు లగుచున్. 324

కం. చెలరేగుచు నా మంత్రులు
నలుగు రనేకాయుధముల నలుగడలందున్
గల వానరులం దునిమిరి
కలగం గపిసేనఁ భీతిగలుగన్ బాఱన్. 325

చం. రుధిరము పాఱుచుండె నదులో యనఁగాఁ దురగేభబృందసా
రథులును రాక్షసప్లవగరాజి శిరంబులు గూలియున్న నా
రథములు గుట్టలై రణతలంబున జూడ భయంకరమ్ముగా
వధ నొనరించుచున్న విరుపక్షములున్ రిపుసైన్యవారమున్.

సీ. భూధర శిఖరంబుఁ బూనుచు ద్వివిదుండు
జంపె నరాంతకు సమరమందు
విపుల ద్రుమంబును వేఁగొని దుర్ముఖుం
డంత సమున్నతు నంతముఁ గనె
పెనుబండ ఱొమ్ముపై వేసి జాంబవం
తుఁడు మహానాథుని తుదినిఁ గాంచె
కొట్టగాఁ గబగబఁ జెట్టుచే దారుండు
కుంభహనుండునుగూలె భువిని.

తే. గీ. స్వీయమంత్రులు నల్వురు వీడఁ బుడమి
చండ భీకర భయదమౌ సంగరంబు
సలుపుచుఁ బ్రహస్తుఁడు కపులఁ జంపఁ గడఁగె
గుంపు గుంపులుగ రణమ్ము ఘోరమయ్యె. 327

తే. గీ. అంతఁ గపి సైన్యనాయకుండైన నీలుఁ
గని ప్రహస్తుండు తీక్ష్ణమార్గణవితతిని
నతనిపై వేయ నలుని దేహంబు సొచ్చి
వెలికిరాసాగె నెట్టనై పృథివిఁ బడుచు. 328

ఆ. వె. నీలుడపుడు బెఱికి నేల వృక్షంబొండు
దైత్య సైన్య పతిని దాకి పోరె
నంత నాప్రహస్తుఁ డంబుల వర్షంబు
దోడఁ నీలు ముంచె ద్రొట్టు పడక. 329

తే. గీ. క్రుద్ధుఁడై భూమిజంబొండుఁ గొని ప్రహస్తు
తేరు గుఱ్ఱములను జంపి తేరుఁ గూల్చి
యతని విలుఁబట్టి విఱచి సింహంబు వోలె
గర్జన మొనర్చి నీలుండుఁ గ్రాలఁ దొడఁగె. 330

తే. గీ. విరథుఁడు విధనుష్కుండునై వే ముసలముఁ
గొనుచు నీలుపైఁ బడి యనికిఁ బూనె
సహజ బద్ధ వైరు లుభయ సైన్య పతుల్
పోరి రిరుపురు మత్తేభముల తెఱంగు. 331

చం. ముసలముతోఁ బ్రహస్తుఁడును భూజము తోడుతనీలుడున్ వడిన్
దెసలకు నిండు నాదములఁ దీ వ్రగతిన్ రణమూని రంత నా
ముసలముతోఁడ నీలు ముఖమున్వడిగొట్టె బ్రహస్తుఁ డాజిలో
వెస రుధిరంబు గాఱ మెయి వేగమ నీలుఁడు బండఁ బూనుచున్.

కం. శిలతో బ్రహస్తుఁ గొట్టెను
దలభిన్నముగా నతండు ధాత్రింబడియెన్
విలవిల లాడుచు రక్తము
సెలయేరులుగా స్రవించె జీవము వీడన్. 333

తే. గీ. ఆ మహావీరుఁడు బ్రహస్తుఁ డటుగఁ జావ
వానరులు నీలుఁ గొల్చుచు వారి నృపుని
రాఘవుని జేరి కిలకిలా రావములను
సలిపితోక లెత్తుచు సంతసంబుఁ గనిరి. 334

కం. వడి వడి రాక్షస సైన్యము
తడయక దమ ఱేనిఁ గాంచి తక్షణ మందే
నుడివిరి తడబడు మాటల
జడియుచుఁ దమ నాయకుండుఁ జచ్చిన తెఱగున్. 335

తే. గీ. విని ప్రహస్తుండు నీల్గిన విధము నెల్ల
నమిత దుఃఖాశ్రు పూర్ణ కోపాక్షుఁ డగుచు
రావణుఁడు బలగర్విత రావణుండు
ప్రక్కఁగల దైత్యులను గాంచి పలుకఁ గడగె. 336

తే. గీ. ఇంద్రబలసూదనుఁడగు నిద్ధబలుఁడు
సైన్యపతి ప్రహస్తుండును జచ్చె వినరె
వానిఁ జంపిన వారలు వానరు లని
మాత్ర మెంచఁగా రాదు సుమా! కనంగ. 337

ఉ. అంబువులందు మున్గెడి మహాశిల తేలుచు నిల్చుచుండె నీ
రంబుల హారమా సరులె రాక్షసహాంతకులై రిగా ప్లవం
గంబులె కార్యనిర్వహణ కారకులై నవి గాంచగా విచి
త్రంబుగనుండెఁ గాలగతి దైవ విధిం గడుఁ దారుమారుగా. 338

తే. గీ. అల్పు లగువారె ప్రబలుల నని వధించి
విజయ మొందుట నాశ్చర్య విషయ మెంచ
బహు రణంబుల గెల్చిన వారె వీర
వరులె మనవారు చావ నేమరుట తగునె. 339

శా. నేనేపోయెద యుద్ధమున్ సలుపఁగా నేనే జయంబందెదన్
నేనే రాముని లక్ష్మణున్ దునిమెదన్ నేనే వనౌఘమున్
గానంబిచ్చు దహించు రీతి మసిగాఁ గావింతు తీక్ష్ణంబులా
నానారావమహాగ్ని శత్రుచయమున్ నాశంబు గావించెదన్.

మ. అని దేవేంద్రరిపుండు రావణుఁడు దివ్యం బౌరథారూఢుఁడై
చనె భేరీప్రవణాదిశంఖముల ఘోషన్ సింహనాదంబులన్
దనచుట్టున్ నగమేఘ రూపులగు దైత్యవ్రాతముల్ మూఁగఘూ
తనికాయంబులు గొల్చు రుద్రువలె యుద్ధంబున సంసిద్ధుఁడై.

చం. పురమును వీడుచున్ నగరమున్ నలు|పక్కలఁ జుట్టుముట్టుచుం
గరముల శైలవృక్షములఁ గల్గి యనిన్ సలుపం దయారుగా
స్థిరమతి నున్న వానరుల సింధువు రావణుఁడంతఁగాంచుచున్
బిరబిర సంచరించెడి విభీషణుఁ దమ్మునిగూడఁ జూచెడిన్. 342

ఉ. సోకుల సింహనాదముల శూలము మున్నగు నాయుధంబులం
గైకొని యట్టహాసముగఁ గాల్బల మశ్వమదేభ వాహినీ
ప్రాకట వైభవంబున సరాసరి వచ్చెడి వారి రాముఁడా
లోకన మూని రాక్షస వరున్ బలుఁడైన విభీషణుంగనున్. 343

తే. గీ. ఉత్తముండైన విలుకాని బత్తిపరుని
రావణుని సోదరుని గాంచి రాఘవుండు
వచ్చు భీకరవాహినీ పతి యెవండో
అందు గల వీరు లేరని యడుగునంత. 344

## అకంపనుఁడు

తే. గీ. ఉదయభాస్కరు రీతిగా నొప్పు రక్త
వర్ణవస్త్రింబుతో మదేభంబు నెక్కి
కడగివచ్చెడి వాఁడె యకంపనుండు
రావణుని పుత్రుఁడౌ వాఁడు రాఘవవిను. 345

## ఇంద్రజిత్తు

తే. గీ. తెగువ సింహధ్వజంబునఁ దేరు నెక్కి
కఱకు దంష్ట్రలఁజూపించు గజము వోలె
నారి సారించి భయద నినాద మొప్ప
వచ్చునతఁడె ఇంద్రజి బ్రహ్మ వరమువాఁడు. 346

## అతికాయుఁడు

తే. గీ. అతిపరాక్రమశాలియు నతిరథుండు
కొండ వలె నుండి పెద్ద కోదండ మూని
రథముపై వచ్చుచుండె జ్యారవముతోఁడ
వాఁడె యతికాయుఁడను పేర వరలు వాఁడు. 347

## మహోదరుఁడు

తే. గీ. ఎవఁడు ఘంటానినాదయు క్తేభ మెక్కి
యుదయ రవిబింబ రక్తారు ణోజ్వల మగు
నరుణనేత్రాల గర్జించి యరుగుదెంచు
నాతఁడె మహోదరుండన నలరువాఁడు. 348

## పిశాచుఁడు

తే. గీ. వివిధసర్వాభరణముల వెలుఁగు గుఱ్ఱ
మెక్కి పాశంబుఁ జేఁ బూని యుక్కు మీరి
వడిగ సంధ్యాభ్ర గిరికాంతిఁ బిడుగు వోలె
వచ్చెడి పిశాచుఁడను వాఁడు వాఁడెరామ! 349

త్రిశరుఁడు

తే. గీ. పర్వతాకార వృషభంబుపైన నెక్కి
నిశితశూలంబుఁ గొనివచ్చు త్రిశరు డతఁడు
యశుఁడు వీరరణంబుల నమిత బలుఁడు
అతని శూలము మించు వజ్రాయుధంబు. 350

కుంభుఁడు

తే. గీ. జలధరాకారుఁడైన విశాలవక్షు
సుందరుడు ధనువెత్తి విశుద్ధదీక్ష
వచ్చుచుండె నికుంభుండు వాఁడె రణము
సలుప సన్నద్ధుఁడై యున్న రాక్షసుండు. 351

నికుంభుఁడు

తే. గీ. ఆతఁడె నికుంభుడనువాఁడు నమితయశుఁడు
స్వర్ణవజ్రాల పరిఘదీప్తంబు ధూమ
సహితమునగుదానిఁగొని హస్తమున వచ్చు
నతఁడె ఘోరకర్మలఁ గడు ఖ్యాతుఁడరయ. 352

నరాంతకుఁడు

తే. గీ. ఎవఁడు చాపాసిబాణ సహితుఁడొ నిప్పుఁ
బోలు తీరున జెండాను బూని భీక
రాకృతిని వచ్చువాఁడె నరాంతకుండు
వాఁడె నగశృంగమునఁజెల్లు వానిఁ గనుము. 353

రావణుఁడు

తే. గీ. భయద గజమృగ వ్యాఘ్రఘోష్ట్రి వదనయుతులు
వికృత భూత పిశాచముల్ వెంట రాగ
శ్వేత కేతువు ఛత్రమున్ వెలయుచుండ
రాక్షస పరీవృతుండయి రథమునందు. 354

తే. గీ. వచ్చుచున్నాఁడు వాఁడె రావణవిభుండు
కుండలకిరీటధారుఁ డర్కునిసమానుఁ
డా హిమాద్రినిబోలు దేహంబువాఁడు
రుద్రుఁడై వడి వచ్చు వీరుండు వాఁడె. 355

తే. గీ. దేవతల గర్వమడచిన దేవ వైరి
ఆతఁడే మహాత్ముఁడు నసురాధినేత
చూడు మీ రాఘవా రావణు చూడు మతని
యని విభీషణుఁడన రాముఁ డతనిఁ గాంచి. 356

## రాముని ఆశ్చర్యము

చం. కనికని రావణాసురుని గండలు దండిగనున్న వీఁడహో
యినసమకాంతిమంతుఁడు నహీనబలుండును దివ్యతేజుమై
తనువు బరివృతంబుకద! దానవదేవతలందుఁ దుల్యులం
గనము మహాప్రతాపునిగఁ గన్పడుచుండె నితండు చూడగా.

చం. భటులును దేజుమై వెలుఁగు వారలుఁబర్వతరూపులున్ మహా
పటుతర దేహశక్తి గలవారలు కొండలఁ బూని పోరునన్
దిటవరులై చెలంగెడి సుధీరులు వీరులునుంగదా! కనం
జటుల మహాయుధంబులఁ బ్రశస్తగతిన్ ధరియించి రందఱున్.

తే. గీ. భీకరాకార విక్రమ వీర పరివృ
తాసురవిభుఁడు రావణుం డరయ భయద
కాయభూతపరివృతుఁ డా యము వలెఁ
బ్రజ్వరిల్లుచు వచ్చెడి వర బలాన. 359

ఉ. జానకినిన్ హరించిన నిశాచరదుర్మతివీఁడు కండ్లకుం
గానఁగనయ్యె నేఁడెకద! కర్మవశంబునఁ బాపకర్మముం
బూననిచో నజయ్యుఁడగు మూఁడుజగంబుల నీ తపస్వి నే
వీని మహోఘజన్మమును వీగగఁ జేసెద వేవిభీషణా! 360

కం. అనుచున్ రాముఁడు ధనువున్
గొనుచున్ లక్ష్మణునిదోడఁ గూడుచు యుద్ధం
బొనరించి యసురనాథుని
దునుమన్ గంభీర శాంత దృక్కుల నిలిచెన్. 361

తే. గీ. సైనికులఁగాంచి యంత రాక్షసవిభుండు
ద్వారముల గృహగోపుర వారములను
నిర్భయంబుగఁ గాయఁగా నిలిచియుండ
నాజ్ఞ నిడె పురిరక్షణ మాత్మఁ దలఁచి. 362

కం. అనుచున్ సైనిక వీరులఁ
బనిచెం గొందఱ బురంబు పట్టులఁ గాయన్
ధనువున్ మీటుచు వనచర
వనధింబడెఁ బెద్ద చేప భంగిం దానున్. 363

కం. పలుతూపుల వేయుచుఁ గో
తులఁ దునుమాడు నసురేశుతో రవిసూనుం
డలయకఁ గొండలఁ బూనుచు
సలిపెన్ యుద్ధంబు దైత్య సంతతి మడియన్. 364

కం. బండలు భూజంబులునుం
దండిగఁ గల పెద్దకొండ దైత్యేశు తలం
ఖండింప విసరె సుగ్రీ
వుండును రావణుఁడు దాని ముక్కలు సేసెన్. 365

తే. గీ. శైలశృంగము బహువృక్ష సానుయుతముఁ
దునియలుగఁ గొట్టి వెంట మృత్యువునుఁ బోలి
గాలి వేగము గల నగ్ని కణముల వలె
మండు తూపున సుగ్రీవు గుండెఁ గొట్టె. 366

తే. గీ. అంతఁ బ్రబల బలుండయ్యు నర్కసుతుఁడు
వీర రావణుండు విడిన విశిఖ వశత
మూర్ఛితుండయి భువిఁబడె మోద మంది
రాసురులు రావణేశు జయంబుఁ గాంచి. 367

సీ. వానర రాజైన భాస్కర సూనుండు
నేల విసంజ్ఞుఁడై గూలుటఁ గని
కోతుల వీరులు జ్యోతిర్ముఖుఁడు గవ
యు గవాక్షు ఋషభ సభాదు లంతఁ

గొండలఁ జేఁబూని కురిపించి రాసుర
పతిపై న దీవ్రకోపంబుఁ బూని
వానిని దారిలో (బ్రయ్యాలా నట్టుఁగొట్టె
నిజబాణ వితతిచే నిర్జరారి

తే. గీ. కాంచనాలంకృత విశిఖ కాండ శక్తి
వారి నెల్లర స్మృతిఁదప్పి వడగఁ గొట్టె
వానరుల మూక గబగబ పట్టి చంప
మొదలిడె గపులు పాఱ రాముండు గనియె. 368

## రామలక్ష్మణులు, రావణుఁడు

తే. గీ. ఆశరేశు మహాసాయ కార్తిఁ దగిలి
కపులు గుంపులుగాగ రాఘవుని జేరి
శరణుఁ జొచ్చిరి క్షణమాత్ర జాగు లేక
దాశరథి విల్లుఁబూనె యుద్ధంబు సలుప. 369

కం. దానింగని లక్ష్మణుఁడనె
వినయంబును భక్తిమీర విజ్ఞానముతోన్
వినతి నొనర్చుచు రామా
అనిఁ బూనఁగ నీవవోదువా? తగు నొక్కొ! 370

కం. నీకాతఁడు లెక్క యొకో
నీకా సరి పోర నతఁడు నేనే చనెదన్
డీకొని రావణు దుష్టునిఁ
బోకార్చెద నాన నిమ్ము వోవగ ననికై. 371

కం. అను లక్ష్మణుఁ గాంచి సరే
యని రాముఁడు యుద్ధభూమి ననుజుఁడు గననౌ
పనుల నిరూపించి పలికెఁ
దనువును మఱిపొందకుండ ధనువుంబూనన్. 372

ఉ. రాక్షసరాజు వీరుఁడు పరాక్రముఁడున్ రణకోవిందుఁడునున్
గక్ష వహించెనేని త్రిజగంబులఁగూడ వడంకఁజేయు నీ
చక్షుయుగంబు నీధనువు సంతతఘున్ నిను రక్ష సేయగా
దీక్షగ వైరి ఛిద్రములఁ దెల్సి నెఱింగి రణంబొనర్పుమీ. 373

ఆ. వె. రాఘవాజ్ఞ నొంది లక్ష్మణుండంతట
దర్ప మొప్ప గొప్ప ధనువుఁబూని
కౌగిలించి రాముఁ గావించి ప్రణతిని
వెడలె రణము సేయ వీర వృత్తి. 374

హనుమ - రావణుఁడు

తే. గీ. వివిధ విశిఖంబులఁ గొని కపితతిఁ జంపి
చంపుచున్న రావణుని లక్ష్మణుఁడు గాంచి
యతని దాక నుంకించెడి యంత హనుమ
యడ్డముగ వచ్చి తాఁదాకె నసురపతిని. 375

తే. గీ. దాసుఁడను నేనయుండ యుద్ధంబు సేయ
స్వామి రావచ్చునా యని వాయు సుతుఁడు
తోకతోడుత దైత్యేశు తూపుల గమిఁ
జెదరఁ గొట్టుచు నాతని చెంతకేగి. 376

ఉ. రావణ మున్నె నీవె రణరంగములం గడు వీరవర్యులన్
దేవతలన్ సురాదులఁ బదేపది గెల్చుట వాస్తవంబు కా
నీవనచారులన్గెలువ నేరవు నా కుడిచేయి నిన్నిదే
జీవము వీడఁజేయు నిక శీఘ్రముగా నను వాయుసూనునిన్.

చం. కనుచు సురారి రావణుఁడు గన్నుల నిప్పులు రాల గోపముం
గని వెనువెంటనే హనుమ కాయముఁ బాయఁగఁ జేసితేని నన్
వనచరుఁడౌ నొకండె సుర వైరిని రావణుఁజంపె నన్న కీ
ర్తినిగనగా బలాబలము తేల్చు మటంచు బల్కెడిన్. 378

కం. అనునంతన్ హనుమంతుం
డనియందేను వధియించి నట్టి నీసుతు న
తుని లోనెంచుచు నాదె
బ్బను స్మృతికెంచెచ్చికొమ్ము బల మెఱుఁగంగన్. 379

ద్వి. హనుమంతుఁ డామాట ననునంతతోడ
దనుజేశుఁడరచేత హనుమను గొట్టె. 380

ద్వి. ఱొమ్మున్పైఁదగిలిన రూక్షణహతిని
దిమ్మతిరిగితోడఁ దెప్పరిల్లుచును. 381

ద్వి. గట్టిగా నరచేత దిట్టరి హనుమ
గొట్టె రావణు వాని గోడు చలింప. 382

తే. గీ. భూమి కంపింపఁ బర్వత భూజ వితతి
కంప మొందెడి రీతి రాక్షస విభుండు
చలన మొందుచు హనుమంతు బలము మెచ్చె
యరివి నీవైన మెత్తు నీయతుల బలము. 383

తే. గీ. అనెడి రావణుఁ గాంచి నా హనుమ, తగుల
బడన నాపరాక్రమము నా పాణి హతిని
జావకుంటివిగా నీవు చచ్చు దెబ్బఁ
గొట్టెద మఱొక్క మారు నం గొట్టుమనియె. 384

చం. అన విని రాక్షసేంద్రుఁడు మహాకుపితాత్ముఁడు ముష్టిఁబూని వే
హనుమను ఱొమ్మున్పైఁ బొడిచెనాతఁడుమూర్ఛిలమూర్ఛఁదేరియా
యనిలజుఁడుగ్రుఁడై తనకు నాయువు దీయు నటంచు భీతి నా
తనివిడి పోయివేఁ జనియెఁ దాకగ నీలునిసైన్యనాథునిన్. 385

తే. గీ. ఆ పరాక్రమశాలి సురారి యంత
నిశిత బాణచయంబుల నీలుఁ గొట్టె
శరతతుల పీడితుఁడు కపిసైన్య పతియుఁ
బర్వతంబొండు విసరె రావణునిపైన. 386

తే. గీ. పంక్తికంఠుఁడు నీలుతో బవర మూనె
తెప్పరిల్లుచు మూర్ఛ నాఁదెసను గాంచి
యొరునితో పోరుచుండుట నొప్పు గాదు
తాక నిన్ననె హనుమ ఆ దైత్య పతికి. 387

తే. గీ. రావణునిదాక విసరిన రాతి కొండ
నేడు తూపుల ముక్కలై యిలను గూల్చ
విసరె చెట్లను నీలుడా యసురుపైన
దైత్యపతి వానిఁగొట్టెను ధాత్రిఁ బడఁగ. 388

ఆ. వె. విసరు కొండ గముల వీగఁగాఁ జేయుచు
వృక్ష తతుల దారి విఱుగఁ గొట్టు
దైత్యనాథుఁ బోరెఁ దనువుఁ గుంచించి
నీలుఁడంత వింత నేర్పుతోఁడ 389

తే. గీ. మేఘసంవృత గిరివోలె మేను జుట్టు
ముట్టు సాయకపంక్తులఁ దట్టుకొనుచుఁ
దనువు కుంచించి రావణు ధ్వజము కొనను
వాలి సింహగర్జనఁ జేసె నీలుఁడంత. 390

తే. గీ. తనధ్వజాగ్రమమున నుండి తల కిరీట
మునకు దూకుచు నటునిటు మోదుచుండి
లాఘవము సూపుచున్న మర్కటకిశోర
భాద సహియింపఁలేదు రావణ విభుండు. 391

తే. గీ. గుఱికిఁ జిక్కఁదు తూపునఁ గొట్ట లేడు
ధ్వజము మకుటంబులను గాళ్ళ దాకు దాని
నేమిఁ జేయఁగఁ దోపని నీర్ష్య; వీడె
మహితశర మొందు నాగ్నేయ మంత్ర శక్తి. 392

మ. బహురూపంబుల నెత్తె నేర్చితివి నన్ బాధించుచున్నావు నీ
వహా! ఆగ్నేయమహాస్త్రమియ్యదినినుం బ్రాణంబులందీయకే నీ
యిహామందుండఁగనీయ దింక నని దైత్యేశుండనెన్ నీలుఁడా
మహితాస్త్రంబునఁ జిక్కికూలె భువిపై మంటన్విసంజ్ఞుండుగా.

తే. గీ. అగ్ని మంటలఁ జావడా అగ్ని సుతుఁడు
అగ్నిహోత్రుని కృపఁజేత నసువుల విడ
కాతఁడంత మూర్ఛిల్లుచు నవనిఁ బడియె
దైత్యవిభుఁ డంత సింహ నాదంబు సలిపె. 394

తే. గీ. పుడమిఁ బడఁగొట్టి సీలుని బొంగి పొంగి
విజయగర్వంబుచే దైత్యవిభుఁడు తోఁడ
నడ్డముగ వచ్చు సూర్యసు తాది కపులఁ
బరిహరించుచు లక్ష్మణు పైకి దూకె. 395

తే. గీ. పుడమి దద్దరిల్ల గుణమ్ముఁ బూని భయద
నాద మొదవంగ యుద్ధసన్నద్ధుఁడగుచు
మీద మీదకు వచ్చు నమేయబలుని
రావణుని గాంచి పలికె నాలక్ష్మణుండు. 396

ఉ. నేనిట వేచియుంటి గమనింవవొ నిన్ను వధింప నాజిలో
వానరకోటిపై దుమికి వారల వీకునిరీతిఁ జంపెదో!
దానవనాథ యంచు విశదంబొనరించు సుమిత్రసూనుసిన్
జ్యానినదంబు సల్పెడి భయంకరునింగని రావణుండనున్. 397

ఉ. కాలము పండెఁగాకిటుగఁ గాలును దువ్వుచు యుద్ధమూనఁగాఁ
జాలు భవత్ప్రతాపమిదె చచ్చెదవీవు మదీయబాణముల్
గాలునిఁ జేర్చు నిన్నిపుడె కాచుకొ నీవిపరీతబుద్ధి వే
యేల వచింప నాసముఖ మీగతి లక్ష్యము సేసె మృత్యువే. 398

చం. అను నసురేశు వాక్యముల నాలన సేయుచు లక్ష్మణుండహో
దనుజ మహోదురాత్మ! అఘతత్పర! సల్పెదు స్వీయసంస్తుతిన్
జనులు గుణోత్తముల్ పలుక జాలరు నీవలె నీపరాక్రమం
బునుబలముం బ్రతాపములమున్నె యెఱుంగుదుఁ జూపఁగాదగున్.

కం. అన విని క్రుద్ధుఁడు రావణుఁ
డనుపమమౌ యేదు తూపు లంతట వేసెన్
దునియలుగా వానిని గొ
ట్టెను మార్గంబున మిగుల వడిన్ లక్ష్మణుఁడున్. 400

కం. ఒండొరుపై వడిఁదూపుల
దండిగ విడుచుండి వాని దారినె త్రెళ్ళన్
ఖండించుచు వేఁబోరుచు
నుండి రొకరికొకరు తగ్గకుండగ నంతన్. 401

తే. గీ. రావణు వధింపనెంచి యాలక్ష్మణుండు
వేగ వజ్రాయుధసమాన విశిఖములను
నగ్ని తుల్యంబులను వీడ నసురనాథుఁ
డపుడె ఖండించె ముక్కలై యవనిఁ బడఁగ. 402

తే. గీ. అంత రోషించి రావణుం డజుఁడొసంగి
యున్న ప్రళయకాలాగ్నిగా నెన్నఁ దగిన
దివ్యశరమున సౌమిత్రి తేజ ముడిగి
మూర్ఛిలిగఁ గొట్టె లక్ష్మణు ముఖముమీద. 403

తే. గీ. లక్ష్మణుఁడు తెప్పరిల్లుచు రాక్షసేంద్రు
విల్లు విఱుగంగఁ గొట్టె వే వేగ నతఁడు
మూర్ఛిలఁగఁ దీవ్రబాణాల మోదె నంత
బ్రహ్మ యిడినట్టి శక్తిఁ జేఁబట్టి వాఁడు. 404

తే. గీ. వానర సమూహ మంతయు భయముఁ జెంద
లక్ష్మణుని వక్షమునఁగొట్టె రగులు నగ్ని
యనఁగ నది లక్ష్మణు రొమ్ము నందుఁ జొరఁగ
మూర్ఛఁబడె లక్ష్మణుఁడు చావుఁ బొందఁ డయ్యె. 405

తే. గీ. మూర్ఛఁబడియున్న సౌమిత్రి పొంతఁ జేరి
చేతులనుబట్టి యెత్తఁగా సిద్ధమయ్యె
మేరుహిమమందరాద్రుల ధీరుఁడగుచు
నెత్తఁగలవాఁడు లక్ష్మణు నెత్తవేడు. 406

చం. అల మును నాది శేషుఁ డిల యందు జనించె సుమిత్రసూతిగా
యిల భరియించు వాని నెవఁడెత్తఁగలాడు త్రయీజగంబులం
జలన విహీనుఁడై పడియు స్వాంశఁదలంచుచునున్న వాఁడు భూ
స్థలి ఘనవైష్ణవాంశముఁ గదల్పఁగలాడె సురారియేనియున్.

చం. అది గని వాయుసూతి భయదాకృతిఁ గోపపరీతచిత్తుఁడై
కదనము వీడి లక్ష్మణుని గైకొనఁబోవగనున్న రావణున్
గదియుచు వజ్రముష్టిఁ గడు గట్టిగ రొమ్మున గ్రుద్దె నంతతోఁ
బదితలలున్న రావణుఁడు భళ్ళున బోరగిలెన్ ధరాస్థలిన్. 408

ఆ. వె. కనుల నోటఁ జెవులఁ గారగా రక్తంబు
దైత్యనాథుఁడు పడి ధాత్రిమీద
మూర్ఛ గాంచి వ్యథను మూల్గుచునుండంగ
సకలదివిజులుగని సంతసిలిరి. 409

తే. గీ. అతిసునాయాసముగ నెత్తి యాసుమిత్ర
నందనుని రామసన్నిధి యందుఁ జేర్చె
వైష్ణవాంశంబు సులువాయె వాయుజునకు
భక్తునకు మిత్రునకుఁ జేతఁ బట్టి యెత్త. 410

తే. గీ. దుర్జయుండైన లక్ష్మణుఁ దోడ విడిచి
రావణుఁని బొందె శక్తి వే రణము సేరి
వైష్ణవాంశంబు తానైన భావమూని
మూర్ఛదేరుచు సౌమిత్రి మోదమందె. 411

తే. గీ. రావణుఁడుగూడ మూర్ఛదేరంగ విల్లు
కరమునంగొని కదన రంగాన నిలిచె
వానరులు భీతి నటు నిటుఁ బాఱు వారి
రాఘవుఁడు గాంచి స్వయముగా రణము నూనె. 412

## రామరావణ యుద్ధము

ఉ. చాపముఁ బూని రావణుఁడు సంగరభూమిని నిల్చునంత వే
తూపుల విల్లుఁబూని రఘు తోయజనేత్రుఁడు డీకొనంగ నా
మూపున నెక్కి దైత్యపతిఁ బోరుము గారుడవాహనుండు తా
నేపగిదిన్ స్థితుండగునో నీవును నాపయి నెక్కు మాగతిన్. 413

కం. అనుచున్ రాముని జేరిన
హనుమంతుని నాదరించి యాతని మూపె
క్కెను రాఘవుఁడరిఁ బోరఁగ
వనచరతతి భీతి వీడి వరలఁగ మఱలన్. 414

ఉ. జ్యారవ ముప్పతిల్లె రథ మందసురాధిపుడుండె రాముఁడా
మారుతి మూపుపై నిలిచె మార్గణముల్ గొని రూపుమాపెదన్
నేరణమందు నిన్నిపుడె నీవిక దాగఁగ నెందుఁ బోదువో
క్రూర! మహోపకారమును గూర్చిన వాఁడవు నాకునిల్వుమీ.

చం. యముని సురేశుబ్రహ్మానల యగ్నిని, శంకరు, సూర్యుఁ జేరినన్
సమరమువీడిదాగ, నినుఁ జంపెదఁబట్టుచునెచ్చటున్న సా
యమునొనరింపఁగాఁగలుగు నన్యులు లేరుమదీయదృష్టియం
దమరిననీవుతప్పుకొని ప్రాణములన్ ధరియింపనేర్తువే? 416

తే. గీ. బ్రహ్మవరదత్తశక్తి నెవ్వానిమీద
వీడియుంటివో యవ్వాడె వీరవరుఁడు
నిను సబాంధవమ్ముగ నని దునుము వాఁడు
కడచి బ్రదికిన వాఁడున్నె కాల విధిని. 417

ఉ. నేనును దండకాటవిని నీకులగోత్రుల నన్నదమ్ములన్
వేనకు వేలుగాగ భువి పీడఁగఁ జేసితి నొక్క చేతితోఁ
బూనిరి వారలుఁన్ విశిఖ పుంఖములన్ నిను బోలు వారలున్
గానరు మంచిచెడ్డలను గండలఁ బెంచిన కావరంబునన్.

కం. అని రాముఁడు మాటాడఁగ
వినుచుండియె రావణుండు వీడెన్ శరముల్
హనుమంతునిపై వడి వడి
దనువెల్లయుఁ బుండ్లుపడగ దాశరథి గనన్. 419

## రావణ పరాజయము

కం. కని రావణు పల్లదమున్
వెనువెంటనె రాఘవుండు వీడుచుఁ దూపుల్
తునుకలుగా గొట్టె రథం
బును నాయుధమున్ దురంగ ముల సారథినిన్. 420

చం. పిడుగన వజ్రపాశమన భీకర తీవ్రమహోశుగంబులం
దడయక దైత్యు బొమ్ము గుఱి తప్పకఁ గొట్టెను దద్దరిల్లుచున్
విడిచెను విల్లుఁగూడ వెను వెంటనె మూర్ఛనుఁబొంది భూమిపై
బడె మకుటంబుఁగూడ భువిపైఁబడ రాముఁడు గొట్టెనంతటన్.

చం. విరథుఁడు నిస్సహాయుఁడు భువింబడి మూర్ఛిలిలేచి క్రమ్మరన్
దుర మొనరింపఁజాలని యధోగతి నిర్విషసర్ప మోయనన్
సురుచిరహీనమైన రవి చొప్పున మంటలు లేని నిప్పుగా
ధరఁ గలదైత్యపుంగవుని దాశరథీశుఁడు గాంచి పల్కెడిన్. 422

ఉ. ఈవుమహాభయంకరుఁడ వీవఘమూర్తివి భీమదుష్కృతిన్
నీవ యొనర్పవే? రిపులనిన్ నినుదాకుచుఁ జావకుందురే
దేవవిరోధివౌటఁ గడుదేహము డస్సె రణంబులందునన్
రావణ! దానఁజంప నిను లంకకుఁ బొమ్మికవిక్రమింపగన్. 423

తే. గీ. తడవు సేయక బొమ్ము వే వెడలి రమ్ము
రథముఁగొని ధనుర్ధరుఁడవై రణ మొనర్ప
రమ్ము చూచెద వంత నా రణబలమ్మ
టంచు రాముండు కృపఁగాంచి యనియె నంత. 424

ఉ. తేరు ధ్వజమ్ము ఛత్రముల దేజఁ గిరీటముఁ బాసి గుఱ్ఱముల్
ధారుణిఁగూల మేను శర తాడితమై భువి మూర్ఛదుల్లి సీ
తారమణీశు వాక్కులవి దారుణమై చెవి సోక లజ్జలం
కారమణుండు చేరెఁ దన కాపుగడన్ తలవంచి యెత్తకన్. 425

తే. గీ. రావణుఁడు పరాజితుఁడుగా లంకఁ జేర
వానరుల దేహములఁ జొచ్చి బాధ వెట్టు
తూపులను బెఱికించి సంతోష మిడిరి
వానరులకు రామలక్ష్మణ వీరవరులు. 426

తే. గీ. రావణపరాజయంబును రాముజయము
గాంచుచు మునులు సురలును గనిరి ముదము
దిక్పతులు సంతసించిరి దివిని నిండె
దుందుభిధ్వని లోకసంతుష్టి సెలఁగె. 427

తే. గీ. గరుడుఁగని పాము సింహంబు గాంచి గజము
భయముఁ జెందెడిరీతి మహా బలుని రాముఁ
గనిన యసురాధిపుఁడు భీతిఁ గడఁగఁ దొడఁగెఁ
దలఁచి తలపోసి రాముతూపులనె సతము. 428

తే. గీ. ఆ మహాత్ముఁడు రాఘవు నాశుగములు
కఱకు ములుకులు మెఱపుల కరణినుండి
కనుల గట్టుచునుండ రాక్షసవిభుండు
స్వీయపరివారమును గూడి చేరెఁ గొలువు. 429

ద్వి. సిగ్గుచేఁ దలవంచుఁ జేడ్పాటు నెంచి
యెగ్గురానుండె నం చెంచుచు మదిని. 430

ద్వి. పూర్వస్మృతులురాగఁ బొక్కుచు హృదిని
సర్వంబు వినిపించె సభ్యులకంత. 431

మ. వినుఁడో దైత్యకులప్రవీణులు మహా వీరాధివీరుండ న
న్ననిలో నొక్క నరుండు గొట్టి విజయం బందెన్ సుమావింతగా
మును నేఁబొందిన శాపముల్ విడుచు నే పూర్వస్మృతుల్ వచ్చినా
మనమందెంతయొ కుందుచుంటి నిక సంభావింపుడీ కర్జమున్.

ఉ. నా తప మెల్ల నేలఁబడె నావిధి మున్ననినట్టి రీతిగాఁ
జేతము దద్దరిల్లె నరుఁ జేతనె బ్రహ్మలిఖింపఁ దప్పునే
తాతను గోరనైతి వర దాత నవధ్యతమానవాళిచే
ఖాతరు సేయనైతి నరకాండము మున్నొక శాపముండియున్.

తే. గీ. అవతరించెడి మద్వంశ మందొకండు
దశరథాత్మజుఁడౌచు నాతండె చంపుఁ
బుత్రమిత్రసబాంధవమ్ముగ నటంచుఁ
బల్కె ననరణ్యుఁ డిక్ష్వాకు వంశజుండు. 434

తే. గీ. పోర ననరణ్యు వధియింపఁ బోవునప్పు
డిడిన శాపంబు తథ్యమౌ నేమొ! ఆమ
హాపురుషుఁడు దాశరథియే యనుచుఁ దోచుఁ
గట్టికుడుపదె కర్మంబు కాలగతిని. 435

తే. గీ. వేదవతి శాపముంగూడ వీడదు నను
మును బలాత్కరించుట శాపము నిడె జనక
పుత్రి సీతయై యామెయే పుట్టియుండె
నింతకును గాలగతి ముందె యెఱుఁగఁ గలమె! 436

తే. గీ. గౌరి నంది రంభయుఁ బుంజికస్థలయును
నుడివియుండిన విధమున నడుచుచుండెఁ
దపసులగువారి శాపంబు దాటవశమె
వ్యర్థ మగునొకొ ఋషుల స ద్వాక్య రీతి. 437

తే. గీ. విషయము గ్రహించి మీరు వివేకమూని
వర్తిలగలారలంచు నేఁ బల్కి నాఁడ
శత్రుసంహార దక్షత సమయకుండఁ
బురము వెలుపల లోపలఁ బూనవలయు. 438

తే. గీ. గోపురశిఖరముల గోటఁ గుమ్మములను
భటులు సంచార మొనరించు పట్టులందు
శూరులగువారి నిల్పి ప్రాకార మూని
యేమఱఁగరాదు పురిఁగాయ నెపుడు గాని. 439

తే. గీ. లేపు డీకుంభకర్ణుని లేపుడింక
దేవ దానవ సంహార దివ్యబలుఁడు
దేని బట్టించుకొనక నిద్రించు వాఁడు
ఆరు నెలలిమిదినెలలై నఁ గునుకు. 440

తే. గీ. అనిఁ దలంచిన సభకు నా డతఁడు వచ్చె
నాలముకుముందె నిద్రకై యరిగియుండె
నిట్టి కష్టాల నేనుండ నీతఁడిటుగ
గాఢనిద్రను జోగుట పాడి యగునె! 441

కం. సామాన్యుఁడు గాడాతం
డేమహితాత్ముఁడు శపింపఁ డెవ్వఁడునున్ సం
గ్రామంబున వానరులను
రాముని లక్ష్మణు దునుమగ లాడాతండే. 442

తే. గీ. ఆతఁడుపరాక్రముండయ్యు ననిఁ బూన
కున్న నాకేమి ఫలమగు నన్న పిలుపుఁ
దెలిపి మేల్కొలిపి యతని దోడు వేగ
ననఁగ దైత్యేశుఁడసురు లా యానఁ గొనుచు. 443

## కుంభకర్ణుని నిద్ర మేల్కొల్పుట

చం. పలువురు రాక్షసుల్ చనిరి బల్మిని లేపఁగ గుంభకర్ణునిన్
బిలిచిరి గొంతునెత్తి కడు బిగ్గరగాఁ గదలండు నాటపా
టల రొద సల్పినారలపుడైనను మేల్కొనఁడయ్యె దుందుభుల్
పెళపెళ గొట్టినం గనుల విప్పడు గాఢసుషుప్తి మగ్నుఁడై.

కం. చఱచిరి నరచేతులతోఁ
గఱచిరి మేనెల్లఁగాని కదలఁడు వేవే
పరిఘల దెబ్బలఁ గొట్టిరి
విఱుగడుగా నిద్ర భటులు విసిగిరి లేపన్. 445

తే. గీ. లేచునంతనె భక్షింప లేచునంచు
మాంసరాశుల మున్ముందు మహిషచయము
జంతుతతిఁ జంపి యుంచిరి సంప్రదాయ
సిద్ధముగ రక్తభాండాలఁ జేర్చినారు. 446

తే. గీ. యోజనాయతగంధసంయుతము నావి
శాలగృహమున నేల్పైఁ జాల నిదుర
నుండి గుఱ్ఱుగొట్టుచు నున్నవాని
దనుజ వారంబు మేల్కొల్పఁ గనరు దారి. 447

తే. గీ. శ్రేష్ఠ చందన లిప్తుఁగాఁ జేసినారు
పూల మాలలఁ దనువెల్లఁ బొదిగినారు
ధూపముల వేసినారు సంస్తుతులతోడ
శంఖనాదాలు మినుముట్ట సల్పినారు. 448

తే. గీ. కుటిల భీకరాకృతిఁ బెద్ద కొండ వోలె
నవయవములన్ని భూమిపైనంట నిద్రఁ
గొనెడి కుంభకర్ణుండు మేల్కొనుట లేదు
భటులు మేల్కొల్పఁగాఁ బట్టులఁ బట్టినారు. 449

తే. గీ. పర్వతశిఖరముల వృక్ష పంక్తితోడ
గదల గుదియలఁ బిడికిళ్ళ గట్టిగాగ
మోదుచున్నను మేల్కొనఁ బోడు వాఁడు
లంక మాఱుమ్రోగెను నిండి లంకధ్వనిని. 450

తే. గీ. గాడిదల గుఱ్ఱముల నొంటెగముల నతని
పైకిఁ దోలిరి నిద్దురఁ బాయడయ్యె
వేయి భేరుల నొకపట్టు వేగ మ్రోయఁ
గొట్టినను వీడఁగా లేదు కూర్కునతఁడు. 451

తే. గీ. ముకు చెవులయందు జలమును బోసినారు
కొట్టిరి శతఘ్నిమడమలఁ బట్టి వాని
కుంభకర్ణుండు నిద్ర మేల్కొనడు కడకు
వేయి యిభముల ద్రొక్కింప వీడె నిదుర. 452

తే. గీ. భీకరంబగు నోరును విప్పి విప్పి
ఆవలించుచుఁ బెనుగాలి నంత విడిచి
గ్రహాగతిగఁ దోచు నెఱ్ఱని కండ్లు విప్పి
నలుదెసలఁ జూచి కనియె దైత్యుల చయంబు. 453

తే. గీ, మాంసమును దిని త్రావుచు మద్య మపుడు
తృప్తిఁగను గుంభకర్ణుని తేరి చూచి
వినయ మొప్పఁగ దానవ వితతి యెల్ల
మ్రొక్కి మ్రొక్కుచు నాతని ముందు నిలిచె. 454

ఆ. వె. కుశల మడిగి వారి కుంభకర్ణుండంతఁ
దన్ను నిదుర లేపి యున్న హేతు
వేమి యనియె రాజు భీతుండు గాడుగా
వచ్చియుండవలయు వ్యధ యదేమొ. 455

ఆ. వె. అల్పకష్టమైన నన్ను నిద్రించెడి
నన్ను లేప మనఁడు విన్నయంతఁ
బరిహరించువాడ బాహుబలంబున
దానిఁ దెల్పుఁ డింక దైత్యులార! 456

కం. అని ప్రశ్నించెడి యాతని
కనె యూపాక్షుండు మంత్రి యాసుర వైరుల్
మనకపకృతిఁ బూనరుగా
మనుజుండే హేతువయ్యె మనభీతికహో! 457

కం. జానకిఁ గొనిదెచ్చుటచే
మానవనాథుండు రామ మహితుఁడు లంకన్
వానరయుతుఁడై ముట్టడిఁ
బూనెను నతుండు బలుడు పోరునఁ జచ్చెన్. 458

చం. మును నొక వానరుండె పురమున్ దహియించెసుమామఱిప్పుడో
వనచరులట్టివారు మన పట్టణ మంతయు ముట్టడించి రా
జనపతి రాఘవుండెమన జట్టినిఁజావఁగఁ గొట్టె చచ్చె నం
చని విడె రావణుండును మహాపదఁ గాంచెనుగుంభకర్ణుఁడా! 459

కం. దేవత లాసురు లెవ్వరు
రావణు జయింప లేరు రాముండొకఁడే
దైవవిధిం గొట్టెనుగా
నావహమ్ముం దసురనాథుఁ డపజయ మొందెన్. 460

చం. అనవిని కుంభకర్ణుఁడు మహాకుపితాత్ముఁడు భీకరుండు వే
చనియెద రామలక్ష్మణులఁ జంపెద వానరసైన్యజాలమున్
దునిమెద వారిరక్తమును దుష్టిగఁ ద్రావెద మీకు నిత్తు రా
వణుఁగనువాఁడ శత్రుతతి పైఁబడి దున్మిన పిమ్మటంచనెన్.

ద్వి. కోపగర్వంబుల కుంభకర్ణుండు
తాపాన; నన మహోదరుఁడది వినుచు. 462

ద్వి. వినతుఁడై గోరెనా వీరాధివీరు
తనయన్నఁ గనిపోవ తగునంచుఁ ననికి. 463

ద్వి. గుణదోషములఁ దెల్పఁ గూడుచు మీయన్న
రణమున జయము వి రాజిల్లు నటుగ. 464

ద్వి. రాక్షసు లంతట రావణుఁ జేరి
యీక్షణమందె వే యనుజుండు లేచె. 465

ద్వి. వెనువెంటఁ బొండు వే గొనిరండు వాని
నని రావణుండాడ నసురేశు కడకు. 466

ద్వి. చనె కుంభకర్ణుండు సారాయి ద్రావి
దనుజులు రావెంట ధర వణకంగ. 467

ద్వి. రాజ మార్గము వెంట రాజ గృహంబు
దేజంబుతోఁ బోయి భూజానిఁ గనెను. 468

ఉ. దారిని భీకరాకృతిని దానవ వీరుఁడు భూధరంబు నా
ధారుణి దద్దరిల్ల నతి దారుణకాయుఁడు కుంభకర్ణుఁడే
తేరుటఁగాంచి వానరులు తీవ్ర భయాకుల చిత్తులౌచు సీ
తా రమణీ మనోహరుని దగ్గరఁ జేరిరి గొంద అంతటన్. 469

తే. గీ. లంక కవతల నున్న మ ర్కట చయంబు
కొంద ఱారాము శరణంబు గూడియుండ
కొంద అంతట భూమిపైఁ గూలినారు
కొంద అప్పుడు పాఱిరి కొండ లెక్క. 470

తే. గీ. కాంచె రాఘవుండును కుంభ కర్ణు తీరు
ధనువుఁ దాల్చిన నీలంపు తనువు తోడ
నాతఁడు కిరీటధారియై యరుగు దెంచు
నతని దెల్పు విభీషణా యనియె ఱేడు. 471

ద్వి. అని విభీషణుఁ గోర నారామ విభుఁడు
వినిపించె నాతండు విశదంబు గాగ. 472

చం. ఇతఁడు ప్రతాపవంతుఁడుమహేంద్రుదయమున్ విజయించినట్టి వా
డితఁడ సురేశు సోదరుఁ డ హీనబలుండుఁ బ్రమాణమందు నం
దితనికి సాటియే యసురు లెవ్వరు లేరిల దేవదానవ
ప్రతతి సమైక్యమౌచు నలుపన్ రణముల్ విజయించు నీతఁడే.

## కుంభకర్ణుని నిద్రగాథ

తే. గీ. విశ్వవసు పుత్రుఁడు సహజ వీరుఁడతఁడు
తక్కుగలవారు తపసున దైవశక్తిఁ
బొందియుండిన వారలు పుట్టినంత
కుంభకర్ణుండు లోకంబు గుందఁ గడఁగె. 474

తే. గీ. పుటుకతోడనె జీవులఁ బొట్టఁ బెట్టు
కొనియె వేనవేలుగ నంత జనము భీతి
సురల పతిఁగోరెఁదముఁ బ్రోవ వరదుఁ డతఁడు
గొట్టె వజ్రాయుధంబున గుంభకర్ణు. 475

తే. గీ. అతఁడైరావతపుకోఱ నంతఁ బెఱికి
వాసవునిగొట్టె బొమ్మపై రోస మూని
తల తిరిగి వ్యధ నింద్రుండు తాతఁ జేరె
దేవదానవమౌని సంఘావృతుండు. 476

తే. గీ. ప్రజల భక్షించుచుండి దేవతలు ప్రుక్క
మునిజనాశ్రమంబుల నాశమూని పరుల
వనితల హరించు కుంభకర్ణుని గుఱించి
సర్వమును దెల్పఁ గర్తవ్య సరణి నెంచ. 477

కం. కని ముని మనుమని గతి
వినినాడను నీదుగాధ విపరీతముగాన్
మనఁజెల్లదు తెలివిగ ని
ద్రనుగను మీవిక సతంబు దైత్యా యనియెన్. 478

కం. తాత శపింపఁగ వెంటనె
భూతలమున కొఱిగె నిద్రఁ బొందుచు నాతం
డాతని ముందటఁ బడఁగా
భీతిలి రావణుఁడు బ్రహ్మ వేడఁగఁ బూనెన్. 479

కం. తాతా నీనుడి తప్పునె
భూతలమున వృద్ధిఁ బొందు భూజంబటుఁగం
బాతంబొందఁగ శాపం
బీతగునా నిద్రకుఁ బరి మితియేన్ లేదా? 480

కం. అన విని తొలి ముని దైత్యే
శున కనియెన్ నిద్ర లేచుచుండున్ దిన మొం
దున నాఱునెలల కొకపరి
దిన దిండిని మార్పిదియ యదే శాపంబున్. 481

ఆ. వె. వీడు లేచు నిద్ర నేడాది కొకమార
టంచు నిర్ణయంబు నజుఁడు దెల్ప
వినుచుఁ దమ్ము గూడి వెడలె రావణుడంత
నిద్రలేపె వీని నేడు రామ. 482

చం. విదితము రావణుండు రఘువీరుని బాణపరంపరాహతిన్
మది కలయంగ భీకరుని మానవభోజుని నిద్రలేపి వే
కదన మొనర్చి వానరనికాయము జంపఁగఁ బంపుచుండె నా
హృదయభయంకరుండు నిను నిప్పుడెదుర్కొని పోరు సల్పెడిన్.

ఆ. వె. వానిఁ జూచునంత వానరు లిటునటుఁ
బరువు లెత్తుచున్నవారు గనుము
రణము సల్పువాఁడు రాఁ జెప్ప వలయునె
కోతి మూక గాంచు భీతి మిగుల. 484

కం. ఈతండొక యంత్రముగాఁ
గోతులకుం దెల్పఁదగును గ్రూరుండనిలోఁ
జేతులఁ గల్పక పూర్వమె
భీతిని విడి వానరతతి వెలయుచుఁ బోరన్. 485

చం. అను నుడి వించు నాసురవిరాముఁడు రాముఁడు ప్రక్కనున్న నీ
లుని గపిసైన్యనాయకు విలోకన మూని విభీషణుండు ప
ల్కిన యది యెల్లఁ జెప్పి వెస కీశ బలంబును జక్కదిద్దనౌ
నని తెలుపంగనాతఁడటులంతటఁ గూర్చె బలంబు వ్యూహమున్.

ద్వి. సిద్ధంబుగాఁ జేసి యుద్ధంబుఁ బూన
గద్దరియై కుంభకర్ణుండు రాగ. 487

ద్వి. భుజాల శైలాలఁ బూని వానరులు
ఆజిసల్పఁగనుండి రత్యంత పటిమ. 488

ద్వి. గిరిపోలెడిగవాక్ష శరభులు హనుమ
హరిరాజపుత్రుండు నంగదుండంత. 489

ద్వి. కోటగుమ్మములందుఁ గొండలం బూని
పటుదీక్ష నిలిచిరి బవరంబు సలుప. 490

## రావణకుంభకర్ణులు

ఉ. భీకరుఁడై యకాలమున వీడుచు నిద్రను బాన మత్తుఁడా
లోకనసేయగా దనుజలోకము రాజ గృహంబుఁ జేరుచున్
వీక నొనర్చుచున్ వినతి వేన్రుపుఁ గాంచుచు లాంఛనాదులం
బ్రాకట రీతిఁ బొంరి రిపుఁబాధ యదేమనెఁ దన్ను లేపగన్.

ఉ. నీవు మహాసుషుప్తి గని నేఁగని నట్టి మహాపరాభవం
బీవెఱుగంగఁజాలవు సుమీ యిపుడైనను లేచినావు సు
గ్రీవునిగూడి రాఘవుఁడు కీశబలంబుల వార్ధిఁదాటి లం
కావరణమ్ముఁ జుట్టి యనికారకులై మనవారిఁ జంపరే. 492

ఉ. సేతువు గట్టి వార్ధికి నశేష వనీచర సైన్యయుక్తుఁడై
సీత విభుండు లంకదరిఁ జేరి వనంబుల నాక్రమించి యు
ద్ధాతురుఁడౌటఁ బోరితిమి దానవ ముఖ్యులు చాలమంది నా
కోతులె జంపఁగల్గినవి కోతుల ముఖ్యు డొకండుఁ జావఁడే.

ఆ. వె. ఇంకఁ జెప్పనేల ఎందఱెందఱో మన
రాక్షసాళి సచ్చె రణమునందు
వృద్ధులైనవారు బాలురు మాత్రమే
మిగిలియుండిరి కనుమీ పురాన. 494

ఆ. వె. అదియు కామవినుము వ్యయమూయెఁ గోశంబు
చిల్లి గవ్వకూడఁ జేత లేదు
అన్నకొఱకు నీవ యాహవంబూనుము
లంకఁ బ్రజల కిమ్ము రక్షణమ్ము. 495

తే. గీ. ఇతరు లెవ్వరుఁ జేయఁగా నెంచలేని
యీ మహత్కార్య మొనరింప నీకె తగును
నెప్పుడైనను మున్నిట్లుఁ జెప్పినానె
ఓ పరంతప! అరిఁజంపుమోయి నీవ. 496

తే. గీ. మున్ను దేవాసురులతోఁడఁ బోరి జయముఁ
గొంటివి పరాక్రముండవు ఘోర బలుఁడ
జీవరాశిని నీసరిజీవి లేదు
బాంధవప్రియ రణశూర భ్రాతను సుమ. 497

తే. గీ. హత మొనర్చుము వ్యధను నీహితుఁడ సుమ్మ
శాత్రువులఁ బాఱఁద్రోలుచు జయము గొనుమ
పవనమున శరద్ఘనము వేపాఱునటుగ
ననుచుఁ గుంభకర్ణుని గోరె నసుర రాజు. 496

కుంభకర్ణునిహితము

తే. గీ. వినుచు గుంభకర్ణుఁడు భ్రాత యనిన మాట
నవ్వుచుం బల్కె నన్నకు నయము మీర
మున్ను నేనన్న రీతినే ముప్పు గలిగె
హితుల మాటల విననైతి వీవు నాడు. 497

తే. గీ. అహా పరాక్రమగర్వంబె యతిశయించి
సీతను హరించి చేయవే చెడుగు పనిని
మొట్టమొదటనె గుణదోషముల నెఱింగి
ముందు వెనుకలయోజింపఁబూనవుగద. 498

తే. గీ. కార్యమును దేశకాలానుగతిఁ దలంచి
విఘ్నకారణ మెఱుగుచు విజయ మూనఁ
బూను రాజె సమర్థుండు ముందు వెనుక
యోజనము లేక జరియింప నొదవుఁ జేటు. 499.

తే. గీ. నాలుగు నుపాయముల నెంచి వీలు నెంచి
యొకటి రెండింటి మూడింటి నూని కార్య
సిద్ధిఁ దలంచిన దుఃఖమ్ము సేర దెవని
అక్కరకురాని చదువేల యవనినాథ! 500

తే. గీ. రాజు మెప్పునె గోరి పల్కెడు వారు
మంత్రిసభలోన నహితులే మంత్రు లుండి
రాజుఁ జెఱిచెడి శాత్రవులకొ అకు
హితుఁ వలెఁబల్కు మాటలె యెన్నఁ దగునె. 501

తే. గీ. శాత్రవులగతి నెఱిఁగి విశాలదృష్టిఁ
దన్నురక్షించుకొనఁ జాలకున్న వాఁడు
రాజ్యరమ వీడుఁ గను ననర్థంబు లెన్నొ
నీకుఁ దెలియని దేముండె నీతి విదుఁడ! 502

ఉ. తమ్ముఁడు మున్ విభీషణుఁడు ధర్మవిదుం డనినట్టిరీతి నీ
విమ్మెయిఁ జేయుటే తగు సుమీ యటుగాదని యెంతువే యికన్
బొమ్ము చతుర్థమార్గమున బుద్ధులు పుట్టును గర్మఁబట్టి చే
కొమ్మిక దత్ఫలంబిపుడె క్రోధము నాశన హేతువే సుమీ.

ద్వి. అని కుంభకర్ణుం డాడినఁగోప మూని
దనుజుల ఱేడాడె దమ్మునింగాంచి. 504

ఉ. ఏమిది కుంభకర్ణ యిటులీవనుజుండవు నయ్యుఁ బెద్దతా
ధీమహితుల్ సదాబలుకుతీరున శిక్ష విధించుచుంటివే
యేమి ప్రయోజనంబు గలదీ నుడులన్ శ్రమ మొంఁదెగాకహో
నీమహితోరు బాహుబల నిస్తుల విక్రమముందలంపవే. 505

తే. గీ. క్షాంతిపో జ్ఞానహీనబు వలనో బలప
రాక్రమంబుల గర్వకారణము వలనో
చేసియుండిన నాతప్పుచేత కూడి
వచ్చునె తలంపఁ బలుమార్లు పలుక నేల. 506

తే. గీ. కడచినది కూడివచ్చునె గతముఁ దలఁచి
బుద్ధిమంతులు దుఃఖింపఁ బోవ రెపుడు
నన్నుఁ బ్రేమింతువేని నీకున్న బలము
నీకెఱుక యేని రణమునే నిశ్చయింపు. 507

చ. హితుఁడగువాఁడె ఆపదల నెప్పుడుఁ దోడ్పడు వాఁడెబంధువౌ
హితులకుఁ దోడ్పడందలఁచు శేతగు నీకుఁ బరాక్రమోజ్వల
వ్రతమున నాదు పాపమికఁ బాపుము వైరులఁ జంపికార్యముల్
జత పడ సేయువాఁడె గద సద్గుణవంతుఁడు బంధుమిత్రుఁడా.

ఉ. దీనముగాఁగ నొక్కపటి తేకువతోడ మఱొక్కమారు కో
పానలదగ్ధచిత్తమునఁ బల్మరు పల్కెడి ఱేనిగాంచి యా
జానకినాథు రాఘవుని జంపెద శాంతిని గూర్తు నన్నరో
మానసమందు గోప మవమానము భీతిఁ ద్యజించియుండుమీ.

తే. గీ. తమ్ముఁడను స్నేహితుండను ధర్మ మెంచి
చెప్పఁదగినట్టి మాటనే చెప్పియుంటిఁ
గాని నీదు హితంబె యెక్కాలమందు
నాచరించెడివాఁడ గయ్యంబు సేతు. 510

తే. గీ. రామలక్ష్మణసుగ్రీవులను వధించి
వానరులసేన పాఱిపోవంగఁ జేతు
రాము శిరమును ఖండించి రాక్షసేంద్ర
తెచ్చియిచ్చెద సుఖమునఁ దేలు మింక. 511

తే. గీ. ఆత్మజులఁ గోలుపోయిన యసురు లెల్ల
దాశరథిశిరముఁగని సంతసము గాంత్రు
గిరి సమానుఁడు సుగ్రీవకీశరాజు
నెత్తురందోగఁ జూతువు నేడె రాజ. 512

ఉ. ఈవు మదీయరక్షితుఁడవెట్లు వధింపఁగలాడు రాముఁడో
రావణ రామవైరులగు రాక్షసవర్యుల నాదు జీవముల్
పోవకమున్న నిన్నెవరు ముట్టగలారలు నన్నుగూర్చి నీ
కేవిధమైన భీతి గలదేని త్యజింపుము శాంతిఁబొందుమీ. 513

తే. గీ. అగ్ని యమ కుబేరుఁలు వాయు వా సురపతియు
రాఘవున కడ్డముగ నిల్చి రణ మొనర్పఁ
బూనినను వారి గెలిచెదఁ బోరునందుఁ
బాహువులఁబట్టి విఱుతు నెవ్వారిఁ గాని. 514

తే. గీ. బ్రదుక నెంచిన వార లెవ్వారుగాని
నాదు కంటనఁ బడి మరణంబుఁ గనక
నుండగలవారె కోపంబు మెండెయైన
నింద్రుడైనను జేతితో నేవధింతు. 515

తే. గి. ఆయుధంబులు నాకేల యసురనాథ!
ముష్టినే గొట్ట రాముండు పుడమిఁ బడడొ
బ్రదికియేయున్న నాతని బాణవితతిఁ
ద్రావెడి నతనిరక్తమ్ము తథ్య మిదియ. 516

ఉ. నేను సజీవినై మనఁగ నీకు భయంబది యేల రావణా!
నేనికఁ బోయిరాననికి నీవిపు డాజ్ఞ నొసంగుమయ్య వే
ఆనరనాథులందునిమి యంతట నే కబళించి వైచెదన్
వానరకోటి నెల్ల నొకపట్టున భీతిని వీడు రావణా! 517

ద్వి. లంకఁ గాల్చిన వానరశ్రేష్ఠు హనుమ
జంకక మెడఁబట్టి చంపఁగాఁ గలను. 518

ద్వి. ఘనయశంబును నీవు గాంచెడి రీతి
వనచరబృందంబుఁ దునుముచుఁ దినెద. 519

మంజరి:

క్రుద్ధుఁడ నేనైనఁ గూలు దేవతలు
భక్షింతు యముఁగూడ భయమేమి లేక

అడ్డంబు వచ్చిన నగ్నినింగూడఁ
దోడ్తోడ మ్రింగెద ధూమంబుతోఁడ
సూర్యుఁడడ్డంబైనఁ జుక్కలతోఁడ
భూమిపైఁ బడునట్లు బోకార్చు వాఁడ
వాసవుఁ జంపెద వార్ధిఁ ద్రాగెదను
కొండలఁ బిండిగాఁ గొట్టెడివాఁడ
భూమిని గదలింతు ముక్కలౌ నటుగ
భూతము లన్నింటిఁ బొక్కంగఁ జేతు
నాశక్తిఁ జూపెద నాకు భయంబె
చాలకాలమునుండి శయనించియుంటి
బోకార్తు నిప్పుడె మూఁడు జగాల
నా పరాక్రమిప్డు నద్దెశలరయు
ఒకపూట తిండిగా నొప్పెడి జగతి
ఎటుగ నాతోఁబోర నెవ్వారు బ్రదుకు
రామునే నెవధింప రామ యాసీత
ప్రేమించి నినుగూడి క్రీడింప నెంచు
చిరకాల మామెతోఁ జెందుమీ సుఖము
మనసార ద్రాగుచు మనుమోయి యింక
భయమేల నీకింక భ్రాత నేనుండ
స్వేచ్ఛగా సుఖములఁ జెలఁగంగ నౌను
అని కుంభకర్ణుఁడు తనయన్న కనఁగ
విని మోదముం బూనె వీరరావణుఁడు.

## మహోదరుఁడు

చం. దనుజవరేణ్యు సోదరుని దర్పము లెల్ల మహోదరుండునున్
విని పలుకాడె నాతనికి వీరుఁడుగా నసురేశ్వరుండు చే
సిన పని కాదనందగునె చిన్నతనంబున గర్వితుండవై
యనిన త్వదీయవాక్కులు మహాపదకుంగడు హేతుభూతముల్.

తే. గీ. అల్పబుద్ధిని నీవిటులాడఁ దగునె
సత్కులంబునఁ బుట్టియు సరస వాక్కు-
నేర్పవైతివి మనరాజు నీతి నెఱిఁగి
సీతఁ గొనివచ్చినాఁడది చేటు గాదు. 522

తే. గీ. సకలశాస్త్రార్థవిదుఁడు రాక్షస విభుండు
తప్పు లొప్పు లెఱింగెడి ధర్మ వేత్త
గురుల సేవ నెఱుంగని కుఱ్ఱవాఁడు
తప్పనగఁ నొప్పు కార్యంబు దలఁచువాఁడె. 523

తే. గీ. ధర్మ మర్థంబు కామంబు దగ నొసంగు
వేఱు వేఱగు ఫలమంటి వీవు చెపుమ
ఏది ఏఫలం బొసగునో యెవరికెఱుక
నియతినే ఫలమిడు నెద్ది నిర్ణయింపు. 524

తే. గీ. ధర్మమే ధర్మఫలమిడు దారి గలదె
కర్మ మొనరింప ఫలములు గలుఁగుచుండు
ధర్మమునఁ బుట్టుచున్న దధర్మఫలమ
ధర్మమునఁ గల్గుచుండెగా ధర్మఫలము. 525

తే. గీ. ధర్మము నధర్మమును మనతలఁపునందె
గలదు ఫలములఁ గనలేము కాని యొకట
దుఃఖ మొదవించు దుష్కర్మ; దుష్టఫలమె
యిచ్చెడి యధర్మ మంచని యెంచరాదు. 526

తే. గీ. ఐహికాముష్మికార్థమై యాచరించుఁ
గర్మలపురుషుఁడెప్పుడుఁ గాని కామ
మొంచి సలిపెడి కర్మల మంచియె యగు
గామమునఁజేయు కర్మ సుఖంబె యొసఁగు. 527

చం. ధరణిజ దొంగిలించు మది దట్టిన యంతట మాకుఁదెల్ప నం
దఱము సరే యటంచనఁగ దైత్యవిభుండు హరించె సీత, నిం
దవుల బలంబుఁగూర్చి హృది నారయడంచని దోష మెంచుదే
అరమర వీడి తోడ్పడుట కందఱముంబనిఁ బూనుటొప్పదే. 528

ఉ. తా నొకరుండె చంపె మన దానవులం దఱ దండకన్ జన
స్థానమునందు నీ వెఱుఁగఁ జాలవె? నీ వొకరుండవే యనిం
బూనఁగ వానితోడఁ దల పూనెదొ! నీవ జయింప నెంచెదో
దానవులెల్ల భీతిఁగను దండక నేటికి రాము నెంచుచున్. 529

మ. కుపితంబౌ రఘురామసింహ మహ సంకోచింపకే దాకుదే
యిపు డీ వెంచెడి సాహసంబు నిదురించే పాము లేపన్ వడిన్
విపరీతంబుగఁ దోఁకఁ ద్రొక్కు గతియే వీరంబు లేలాడెదో
నృపుఁడా రాము తెఱంగెఱుంగు విడుమీ నీడాంబికం బింతతోన్.

ఉ. రాముఁడు దివ్యతేజమున రాజిలువాఁడు సతంబు వానినె
మ్మోమును దేరిచూడఁగల పూరుషుఁ డెవ్వఁడు లేదు మృత్యువే
యేమొ యనంగఁ గోపియగు నేని కనంబడువాఁడు వానిసం
గ్రామమునందు డీకొనెడి రాక్షసుఁ డెవ్వఁడు లేదు నేఁడిలన్.

తే. గీ. ఆశరబలంబు సర్వంబు నాశనమగు
వానితోఁ బోరు సల్పెడి వాఁడెవండు
నీవ యొక్కఁడఁ బోరఁగా నేర వతని
సమ్మతింప నొకండవే సమర మూన. 532

చం. ఎవఁడు సమస్తమానవుల నెన్నికఁ గాంచిన సాటిలేని వా
డెవఁడొ వివస్వతుండనఁగ నింద్రుఁడనంగను జెల్లు వాఁడె రా
ఘవుఁడతనిన్ మహాబలుని గాయముపై భ్రమవీడి పోరనా
అవిరళ విస్ఫులింగ నివహంబుల దూకెదొ కుంభకర్ణుఁడా! 533

ద్వి. అనుచు రావణుఁ గాంచి యనియె నీరీతిఁ
దనను బంపినఁ బోరు బని దీరు నంచు. 534

తే. గీ. తాను దుర్బలుఁడై యుండి తనవిరోధి
నమితబలవంతు నల్పుఁ డటంచు నెంచి
డీకొనఁ దలంచువాఁడు మఱియు నిజంబు
రాఘవుఁడు మున్ను వినకన రాని వాఁడు. 535

తే. గీ. కుంభకర్ణుని బంపుట గూడని పని
ఎవ్వరొంటరిగాఁబోవ నెంచరాదు
నీయభీప్సిత మీడేర నే యుపాయ
మొండు దెల్పెద దైత్యనృపుండ వినుము. 536

ఉ. సీతను గోరితెచ్చియును జెంతకుఁ దీయఁగ నూరకుంటివే
సీత త్వదీయవశ్యయగు శీఘ్రముగాఁదలపోసినంత సం
ప్రీతిని నాహితంబుఁజెవి పెట్టఁదలంతువయేని నీకుఁ గ
ష్టాతిశయంబులేని పని యయ్యెది రావణ లోకరావణా! 537

తే. గీ. నన్ను గుంభకర్ణు వితర్దనద్విజిహ్వు
ల మఱిసంహాద్రివీరుల రణమొనర్పఁ
బంపు పంపుచుఁ జాటింపు పట్టణమున
రాఘవుని జంపివత్తుము లంకకంచు. 538

ఉ. మేమనిసల్పి రాఘవుల మేదిని గూల్పగలారమేని యిం
కేమి యుపాయముందలఁప నించుకయుంబనిలేదుకాక యా
రాముఁడు లక్ష్మణుండె రణ రంగమునన్ మముఁజావబాదుచో
మేమనినుండి వచ్చెదము మేనుల రక్తము గారుచుండగా. 539

తే. గీ. రామనామాంకిత విశిఖ రాజి యొడలు
గ్రుచ్చికొనియుండ వచ్చినీకు నతిసల్పి
రామలక్ష్మణులను మ్రింగినామటంచుఁ
దెల్పువారము దైత్యేశ! తెలుపు నంత. 540

తే. గీ. ఒక డిభారూఢుడై పురిఁ నొప్పుగాగ
రక్కసులు మ్రింగినారలు రామలక్ష్మ
ణుల నటంచు చాటింపగా వలయునెల్ల
వారు నమ్మెడి రీతిగా భట జనులకు. 541

తే. గీ. పలువిధంబుల బహుమాన ములనొసంగి
వెల్లడించుము ముదమును వినుచు సీత
విశ్వసింపంగఁ దదుపరి వెడలి సీతఁ
గనుచు నోదార్చ నినుఁప్రేమ గనెడి యామె. 542

చం. కనక విభూషణావళులఁ గానుకగానిడి మంచిమాటలా
డిన వశమౌను సీత మరి లేరని యెవ్వరు దిక్కు వంతమై
నిను వరియింపకుండినను నీయెడ భీతి వహించి యైన దాఁ
గననగు నింకనైన నను సుఖంబని స్త్రీ చపలాత్మ గాదొకో! 543

ఉ. రాముని కంటిలోఁ బడకు రావణ నీకవయోగ మద్ది సం
గ్రామము లేకఁబొందనగు రామను నాదునుపాయమూనుచో
ధీమహితాత్మ! నేను కడు దెల్విని యోజన మూని చెప్పితిన్
కామితమా లభించుఁ గడ గండ్లను దప్పను సౌఖ్యమబ్బెడిన్.

ఆ. వె. దైత్యనాశనంబు తప్పుఁ బ్రాణభయము
పోవు సల్ప కనిని బొందఁగలవు
జయము కీర్తి సుఖము శాశ్వతంబుగ స్వీయ
రాజ్యలక్ష్మితోడ లంక నేలు. 545

## కుంభకర్ణుఁడు యుద్ధమున కేగుట

కం. అనుచు మహోదరుఁడాడఁగ
ననెఁ గుపితుఁడు కుంభకర్ణుఁ డంతట వేగం
బున బెదిరించుచు నాతని
దనుజాధిపు వంకఁ జూచి తాననె భక్తిన్. 546

ఉ. రావణ! నీపరాక్రమము రాజిల కార్యము పట్ల జూపెదన్
గేవలడంబముల్ పలుక కే రణమందునఁ జంపి వైరులన్
నీవ సుఖింపఁజేసెదను నీవిక వీడు భయంబు వీరులౌ
ధీవరు లీమహోదరుని తెన్నునఁ బల్కుదురొకొ డంబముల్.

ఉ. శూరులు తమ్ముఁదాము ఘన సూక్తుల జాటుకొనంగఁజూతురే
వీరులు గాగ కర్మలను వీర్యమతుల్యముగాగఁ జూపున
వ్వారలు నిర్వహింతురు జవంబున నింకెవరేని సల్పఁగా
నేరని కృత్యముల్ సలుప నేరని డంబము లాడె వీఁడహో! 548

ఉ. ఓయి మహోదరుండ! యిటు లొప్పనె ఱేని యభీప్సితంబు నే
కూయుచు వానినింబొగడి కోర్కులఁ దీర్చుకొనంగఁజూతు వే
ఆయన నిన్నుఁబోలు నధమాధములందరిఁ జేరదీసి తా
జేయు సమస్తధర్మములు చేవిడనాడుట నీత దెచ్చెగా. 549

తే. గీ. చిల్లిగవ్వంత పనినైనఁ జేయ లేని
యిచ్చకము లాడు నీవంటి హీనమతులఁ
బండితులవోలెఁ బలుకాడు పతితుల నుడిఁ
జెవిని బెట్టుట నింతటి చెడుగు మూడె. 550

చం. పోరని విన్నమాత్ర భయముంగని పాఱెడి నీసమానులౌ
వారలె ఱేనికిన్ హితము పల్కెడి వారయి దాపురింప నీ
తీరు తటస్థమాయెఁ బుఱిఁ దేజటి కోశబలంబులున్ హతం
బై రిపుభీతి రాజొకఁడె ప్రాణములన్ విడకుండనుండెగా. 551

ద్వి. అనుకుంభకర్ణుని నాసురరాజు
విని మోదమందుచు వెంటనె పలికె. 552

తే. గీ. రామునకు భీతిఁ జెంది యీ రాక్షసుండె
యీమహోదరుఁడే రణ మేల ననెడి
నిన్నుఁ బోలిన వీరుఁడు నీకు సముఁడు
హితుఁడు మఱియెవ్వరువ్వార రెంచిచూడ. 553

ఉ. హంతకు భంగి పొమ్ము రవి యాయన నిస్తుల తేజమూని వే
యంత మొనర్చు రాఘవుల నావనచారుల వానరాళి ఆ
వంతయు ధైర్యముం గనక నాహవమున్ విడి పాఱరే భయా
క్రాంత మనంబులన్ భయద కాయుఁడ నిన్‌గనినంతమాత్రనే.

తే, గీ. రామలక్ష్మణులను మ్రింగి రాగదయ్య
అనుచుఁ దనతమ్ము బలము దానతుల రీతి
నమ్మి జయమొందు నని యెంచి నెమ్మనమునఁ
దాఁ బునర్జాతునివలె సంతసము గాంచె. 555

ద్వి. దను జేశుఁడంత మోదంబున మునిగెఁ
దనతమ్ముఁడని కేగఁ దరలనుండంగ. 556

మంజరి :

రణమున కేగెడి రావణభ్రాత
తనయన్న మాటను దలఁదాల్చి యంత

శక్రాశని సముష్మ ప్రాధ్వసమైన
దానవ దేవ గంధర్వసూదనము
కనక భూషితమును ఖడ్గనిర్మితము
శాత్రవ సంక్షోభ సంయుతమైన
ఎఱ్ఱని పూదండ నింపగుదాని
నిప్పులు గ్రక్కెడి నిశిత శూలమ్ము
చేఁబూని బలగర్వ సేవితుండతఁడు
ఘటకర్ణుఁడని కేగఁ గదలుచుండంగ. 557

కం. రావణుఁ డాఘటకర్ణుని
బోవలదనె యేకతమున బొమ్మ్మి సేనల్
నీవెంటనురా నేమఱ
నావానరులు చంపుఁగోటికి యదటుగ ననియెన్. 558

తే. గీ. అనుచు బంగారు మాలిక ననుజు మెడను
వేసి స్వర్ణ భూషణముల వెలుగఁజేసె
ఆయుధంబుల భేదింవ నలవి గాని
కనక కవచంబు మెయి ఘటకర్ణుఁ డూనె. 559

తే. గీ. వే త్రిశూలంబు గొనుచుఁ దివిక్రమావ
తారమన నొప్పి యన్నను గారవమునఁ
గౌగిలించుచుఁ బ్రణమిల్లి యేగె ననికి
రథగజ తురంగ బలములు రాగ వెంట. 560

ఉ. కొందఱు ఘోరజంతువులఁ గొందఱు గాడిదలన్ గజంబులం
కొందఱు సింహసంతతులఁ గొందఱు గుఱ్ఱములన్ ఖగంబులన్
గొందఱు నెక్కి రాక్షసులు గొండలవంటి భయంకరాకృతుల్
వందలు వేలుగాఁ జనిరి వైరులఁ జంపఁగఁ గుంభకర్ణుతో. 561

తే. గీ. వెడలు కుంభకర్ణునిపైన వేడుకఁ గని
పూలవాన ముంచి రతని పూవుఁబోండ్లు
శోణితము ద్రావి మ్రుత్తిల్లి శూలపాణి
యైన దానవదేవారి యురిగె ననికి. 562

తే. గీ. పరిఘ గదముసలమ్ములు వరికరముల
తాళవృక్షుంబులను బూని దైత్య భటులు
భయద భీకరాకారులై బవర మూన
సింహానాదాలఁ జేయుచుఁ జెలగి రపుడు. 563

తే. గీ. ఒకమహాపర్వతంబన నొప్పి నూఱు
ధనువుల వెడలుపుఁ గలిగి ధనువు లాఱు
వందలపొడవునఁ దనుపు బండి చక్ర
ములను మించెడి కనులతో భూత మనఁగ. 564

తే. గీ. మారువేషంబుఁ లందున్నఁ మర్కటములఁ
గనుచు వీరపరాధులు గారు నాకు
వీరు వనభూషణమ్ములు వీరి చంప
హృదయ మొప్పదు చంపక యెటుగ విడుతు. 565

తే. గీ. రామలక్ష్మణు లెన్న కారణము వీరి
లంక ముట్టడి కిప్పుడు రాఘవులనె
చంపు టొప్పగు నంచు రాక్షసుల కనియె
నోరు పాతాళ కుహరంపు తీరు దోప. 566

తే. గీ. అశుభ శకునంబు లెన్నియో యైనవపుడు
మాలికలుగాగ నిల్చెను మార్గమందు
గద్ద లంతట మంటల గ్రక్కుచుండి
నక్కలెల్లెడఁ గూసిన వొక్క రీతి. 567

ఆ. వె. కడలి పుడమి వనులు వణకిన వప్పుడు
వామనేత్ర మదిరె వామభుజము
కూడ నదిరె దారి గుంభకర్ణుఁడు వేగ
నరుగుచుండఁ బోర నరులతోఁడ. 568

తే. గీ. కాలచోదితుఁడై కుంభకర్ణుఁడంత
నరకు సేయఁ డాయశుభ లక్షణము లేమి
శాత్రవులఁ జంపు దీక్ష రాక్షస వరుండు
సంగరంబూన నేగె నాక్షణమునందె. 569

ఉ. వానినిగాంచి వానరులు పాఱిరి చేరిరి కొండ గుట్టలన్
కాననసీమలన్ వినుచు గర్జనలన్ భువిఁగూలిసార లా
వానరులందు కొందఱిక వాలిరి కొందఱు రాఘవాంఘ్రులన్
జిందరవంద రయ్యెఁగపి సేనలు చూచుచుఁ గుంభకర్ణునిన్.

ఉ. వారలఁ జూచి యంగదుఁడు పౌరుషవంతుఁడు ఖిన్నుఁడౌచు వే
వారిభయంబు వాప నసె వానరులార భయంబదేల? యీ
దారుణరూపయంత్రమును దైత్యులుమాయనుగూర్చినారహో
శూర వనీచర ప్రతతి చూచి విభీతులుగా సజీవమై
పోరొనరింప జాలదిది బొమ్మసుమా యని వెన్ను నిత్తురే.

ద్వి. అనిఁ జచ్చువార లాయమరలోకంబు
గనువారు మఱలు డీ యనిఁబూన మీరు. 572

ద్వి. అని అంగదుండాడ నావనీచరులు
కొని చెట్లు బండలఁ ననిఁ బూనినారు. 573

శా. ప్రాకారంబును దాటి సైన్యతతి సంగ్రామాభిలాషన్ వడిన్
లోకాతీత భయంకరుండటకు రా రోషించి యావానరుల్
వేకొండల్ ద్రుమజాలముల్ విసిరి రా వీరాత్ముపై నంత భీ
మాకారంబుపయింబడన్ దునకలై యద్రుల్ భువింగూలెఁగా.

తే. గీ. కొండబండలు వానగా కురియ మీద
భూజములతోడఁ దనువెల్ల మునుఁగుచుండఁ
గుపితుఁడై కుంభకర్ణుండు కోతి మూక
మ్రింగఁ గడఁగె విచ్చలవిడి మేర లేక. 575

కం. కొందఱ మ్రింగియుఁ జంపియు
గొందఱఁ బడగొట్టి యెల్లకోతుల మూకన్
గొందల మందఁగఁ జేసెను
గందరగోళంబు కుంభకర్ణుండంతన్. 576

కం. పాఱిరి కొండల నెక్కఁగఁ
బాఱిరి భూజంబు లెక్కఁబాఱిరి గుహలన్
దూరగ సింధువులోఁ బడి
నారు కపులు గొందఱంత నలజడిఁ బడుచున్. 577

కం. అంగదుఁ డంతఁ బరాజిత
లాంగూలులకు హితబోధరయమున సల్పెన్
భంగ మొదవ మనకీర్తికి
సంగరమును వీడి పాఱఁ జనునే యనుచున్. 578

ఉ. చావునకుం భయమ్ముగనఁ జావక దప్పునె చావుపుట్టుకల్
జీవులకున్ నిసర్గమెటఁజేరిన వీడుమఁ బౌరుషంబు నీ
భూవలయంబునందు సుఖముంగనుచోటును బొందలేము యు
ద్ధావనిఁజావఁ బొందగల మా కడుదుర్లభదేవలోకమున్. 579

చం. విడువడు కుంభకర్ణు మనవీరుడుఁ రాముఁడు చంపుచుండగా
మిడుత జ్వలించు నగ్నిఁ బడ మేనునశింపకయుండు నొక్కొ ఒ
క్కఁడెగదవాఁడు పెక్కు కపికాండముపౌరుషమున్ యశంబునున్
విడి చనఁజెల్లునే రణము వీడుచుఁ బోరఁగ రండు రండనెన్

ద్వి. హనుమంతుఁ డంతలో నట కరుదెంచి
వెనువెంట నీలాది వీరులు రాగ 581

తే. గీ. ఒకపరి పది నిరువది వేరొక్కసారి
ముప్పదియుమంది కోతుల బూని చేత
నోటఁ బడవేసి కుంభకర్ణుండు మ్రింగు
చుండి విహరించుటను ద్వివిదుండు గాంచి. 582

తే. గీ. పర్వతంబొండుఁ బెకలించి బలము కొలఁది
కుంభకర్ణునిపై వైచె గుఱిని దప్పి
యద్రి సైన్యంబుపైఁ బడి సమయఁ జేసె
నిభమహాశ్వ సైనికబృంద మెల్ల దృటిని. 583

ఉ. విల్లుల బూని రాక్షసులు వేల కొలంది వనీచరావళిన్
బెల్లుగఁ జంపినారు కపి వీరులు కొండలఁ జెట్ల వైచుచున్
గొల్లుమనంగ దైత్యతతి గుండెలు బ్రద్దలు గాఁగఁ జేసి నా
ల్లెల్లరణస్థలంబుఁ బ్రవహించెను రక్తము కాల్వలో యనన్. 585

ద్వి. హనుమంతుఁడొక పెద్ద అద్రిఁ జేఁబూని
వినువీథిపై నుండి విసరఁగానంత. 586

ద్వి. ఘటకర్ణుఁడద్దాని గట్టిగాఁ గొట్టె
పటుతర శూలాన బ్రద్దలౌ నటుగ. 587

ద్వి. శూలంబుఁ జేఁగొని శోభింపఁ గపులు
లీలగా ఘటకర్ణుఁ డాలంబు సలిపె. 588

ద్వి. తఱుముచుఁ కపిసేన దైత్యవీరుండు
నుఱుమెడి మొయిలన నొప్పుచునుండి. 589

ద్వి. పెనుగొండ నొకదాని పెకలించి హనుమ
గని కుంభకర్ణుని గట్టిగాఁ గొట్టె. 590

ద్వి. ఆదెబ్బ కాతఁ డా హో యటంచనియె
ఛేదమై తల రక్త సిక్తంబు గాగ. 591

ద్వి. వెనువెంట నాతండు గొనుచు శూలంబు
హనుమంతు ఱొమ్మపై నదుముచుఁ బొడిచె. 592

కం. గిరగిర దిరుగుచుఁ బెద్దగ
నరచుచు మూర్ఛిల్లి హనుమ యవనింబడి నె
త్తురు గ్రక్కుచు స్పృహదప్ప వా
నరసేనయుఁ బాఱ దొడఁగె నలుదిక్కులకున్. 593

తే. గీ. అంతనీలశరభులు గవాక్ష గంధ
మాదన బుషభులు నతని మీదఁ బడిరి
పిడికిటల గ్రుద్ది బండల వృక్ష వితతి
బోరు సాగించినారలు ఘోరముగను. 594

## నీలగంధమాధన గవాక్ష శరభఋషభులు

సీ. కౌగిలింబట్టుటc గరముల ఋషభుండు
నెత్తురు గ్రక్కుచు నేలcబడియె
పిడికిలి పోటునc బీడింప శరభుండు
పొక్కుచు వెనువెంట భూమిcబడియె
మోకాలిచేc గ్రుమ్మి చీకాకుcబెట్టుచు
నీలునిc బ్రహరింపc గూలcబడియె
అఱచేతితోc గొట్ట నంత గవాక్షుండు
తలదిమ్మ దిరిగి భూస్థలిని బడియె

తే. గీ. పాదఘాతంబుననె గంధ మాదనుండు
నేలcబడరాసె వేటాడె లీల గాగ
కపిబలంబును రక్త సిక్తంబుc గాగ
కుంభకర్ణుండు నడ్డు లేకుండ నంత. 595

తే. గీ. వందలకొలంది మ్రింగగ వానర తతి
వాని ముక్కు చెవి రంధ్రాలc బయలు పడుచు
బాధc గలగింపసాగగ నవ్వానిcబట్టి
విఱచి తినసాగె వాడంత వేగిరముగ. 596

తే. గీ. పర్వతంబుల వృక్షాల వాని నెంత
గొట్టుచుండినను జలింప కుండెవాcడు
వానరుల రక్త మంతట నేఱు లయ్యె
పాఱుచున్నది గుంపులై వానరతతి. 597

## అంగదుcడు

తే. గీ. ఎండకాలాన నడవి దహించురీతి
వానరులc జంపుచుండిన వానిc గాంచి
అంగదుండొక్క పర్వత మతనిపైన
విసరె నిహతునిగాc జేయు విధముcగాగ. 598

ఆ. వె. కోపముట్టిపడగ గుంభకర్ణుcడంత
శూలము గొని విసర వాలి సుతుcడు

వడిగఁ జఱచె వాని వక్షస్థలంబున
మూర్ఛ నొంద వాఁడు మూర్ఛఁదేలి. 599

ఆ. వె. వాలిసుతునిఁ జఱచె వాఁడును మూర్ఛితై
ధాత్రి గూలెఁ దెలివి దప్పి యంత
దాని గాంచి యర్క తనయుండు వేవేగ
ననికిఁ బూని దాకె నసురవిభుని. 600

కం. కని యంగదు సుగ్రీవుఁడు
చని పెద్దగిరినిగయిఁ గొని చయ్యన వైచెన్
దనుజునిపై నంత బలికె
వనచరపతి కుంభకర్ణుఁ గనుచుం దోడన్. 601

చం. చంపితివీవు వానరుల జాలఁగ వీరుల నేన వచ్చితిన్
జంపఁగ నిన్నుఁ దాళు మిక క్ష్మాధర మియ్యదె వేసినాడ బల్
పెంపున నల్పు లౌ కపుల వే దగ మ్రింగితి వింకఁ జూతు నీ
తెంపు నిశాచరోత్తమ మదీయబలంబున నన్ను గెల్వుమీ. 602

ద్వి. ఆసురోత్తముడంత నామాట వినుచు
వాసిగఁ బలుకాడె వానర పతికి. 603

తే. గీ. బ్రహ్మపౌత్రుండ వని ఋక్ష రజుని సుతుఁడ
వంచు నధికపరాక్రమ వంతుఁ డవని
యేనెఱింగినదియె యది యెల్ల ఏల
నీవు గర్జింతు రణమున నిలువు మింక. 604

ద్వి. అని పల్కుచుండిన యాశరప్రధితుఁ
దనచేతఁ గల ఘనధరణీధరాన. 605

ద్వి. వనచరపతి గొట్టె వక్షస్థలాన
తునిగె నాయద్రి ఱొమ్మును దాకునంత. 606

తే. గీ. మండిపడి యంతకుంభకర్ణుండు తోఁడ
మెఱపువలె వెల్గు శూలంబు గిఱ గిఱ గిఱ
ద్రిప్పి సుగ్రీవు వధియింపఁ దీవ్ర గతిని
విసరె సుగ్రీవు నదిదాక వెడలు నంత. 607

తే. గీ. వాయుసూనుండు చూచి తే వచ్చి యటకు
కాంచనాలంకృతమ్ము దీక్షణమునైన
శూలముం జేతఁబట్టి మోకాలిమీఁదఁ
బెట్టి విఱచి వేసెను గడు దిట్టయాట. 608

తే. గీ. వేయిబారువుల బరువు వెలయు నుక్కు
శూలమును జేత విఱచిన గాలిబిడ్డఁ
గాంచి ప్రమదంబు నొందుచు గపులు సింహ
నాదముల గంతులను వేసినార లపుడు. 609

కం. తన శూలము విఫలంబై
చనమలయగిరిశిఖరంబుఁ జయ్యనఁ బెకలిం
చెను గొట్టెను దాన కపిప
తిని మూర్ఛిలి గూలి యతఁడు దెలివిందప్పెన్. 610

## సుగ్రీవుని కుంభకర్ణుఁడు ఎత్తుకొనిపోవుట

ఉ. అంతట గుంభకర్ణుఁడు మహాముదమందుచు వానరేశునిం
జెంతకుఁ జేరి వాయుగతి శీఘ్రముగాఁగొని పోయె లంక న
భ్యంతరపుణ్యకాంతలు సుమాళి సుగంధమాజలన్ మహో
దంతమువించురథ్యలను నాతనిపై గురిపించి రెల్లెడన్. 611

మ. హరియింపంగలనేని యీబలుని కార్యంబంతయుందీరు వా
నరయోధుల్ రఘురామలక్ష్మణులు చింతంజిక్కి స్వాధీనుతా
లకులంతన్ నశియించి నల్లెయగుసుమ్మాయంచులోనెంచుచున్
బురిఁజేరెన్ నడిదారియందుజనుచున్ బొందెన్ మహామోదమున్.

చం. వనచరనాథుఁ డాశరుడు బట్టి హరించుచుఁబోవుచుంట నా
తని బలగంబు లెల్లఁ గని దద్దరపాటునఁ జూచుచుండె నా
హనుమయుఁ గాంచుచుండి తన యంతటఁ దాగననైనకార్యమే
మని తలపోయుచుండె వెస నా కపిసైన్యము నూరడించుచున్.

చం. అతఁడు మహాబలుండరుల కాతఁడు చిక్కడె చిక్కియుండె మా
నితమగు నేయుపాయమున నేని బయల్పడి రాగలండు నే
నతనికిఁ దోడ్పడంగఁ జనగా నపకీర్తినిఁ బొందఁడొక్కొ మా
రుతి సుతుఁడిచ్చె రక్షయని లోకము నాతని నీసడించుగా. 614

తే. గీ. కుంభకర్ణుని బిడికిటఁ గొట్టి పొడిచి
భిన్నదేహుని గావించి వేగ నృపుని
విడిపుచ్చంగఁ జేసెడి వాఁడఁ గాని
సూర్యతనయుని బంధించు శూరుఁడెవఁడు. 615

తే. గీ. అనిని మూర్ఛిలియుండుట నతనిఁబట్టె
మూర్ఛఁదేఱి రాముని కార్యము నెఱవేరు
రీతిఁ జేసెడి యాతఁడే రిపుభయమ్ము
గనని వీరుండు బహుపరాక్రముఁడు వాఁడు. 616

తే. గీ. మహిత సుగ్రీవుని పరాక్రమ బుమీద
భారమిడి విచ్చిపాఱెడి వానరతతి
నూరడించుచు నిలుపుచునుండు వాఁడ
నాతఁడరుదెంచుదాక ధర్మార్థ మదియ. 617

ద్వి. అనుచు లోఁదలపోసి హనుమంతుఁడంత
వనచర సైన్యంబుఁ బాఱక నిలుపు. 618

ఉ. మూపున మోయుచుండి పురమున్నలువీథులఁ ద్రిప్పుచుండె దా
నేపు వహించిపైఁబడఁగ నింపగు చందన పుష్పగుచ్ఛముల్
నాపురవీథులందిరుగు నంతట జల్లదనంబుఁ నొంది వే
చూపు లభింపమూర్ఛసనెఱుట్టును సూర్యజుఁడంతఁ జూచుచున్.

ఆ. వె. తాను బట్టువడియె దైత్యుని కంచని
విడివడంగఁ దలఁచి తడవు లేక
కఱకు పండ్ల ముక్కుఁ గొఱుకుచుఁ జెవులను
వాడి గోళ్ళఁ ద్రుంచె వానరుండు. 620

తే. గీ. పార్శ్వభాగంబులనుగూడఁ బండ్లఁగొఱికి
ముక్కుచెవులను హరియింప మొగము రుధిర
సక్తమగుచుఁ గురూపిఁగా జేయఁబడుట
కుంభకర్ణుండు గోపించి కోతి నంత. 621

తే. గీ. మట్టిఁ బడవైచి కాలితో మట్టుచుండె
రక్తసిక్తుండు ఘటకర్ణ రాక్షసుండు
అంతటఁ దటాలుమని మింటి కెగిరి వడిగ
కెరలి రఘురాముఁ జేరె సుగ్రీవ రాజు. 622

ద్వి. తప్పించుకొని రవి తనయుఁడు పోవఁ
నప్పుడే చనె దైత్యుఁ డాలంబుఁ బూన. 623

ద్వి. ముద్గరముంగొని భూతంబు పోలె
నుద్గమించెను నాల మూనంగ మరల. 624

కం. తనవారినిఁ బగవారినిఁ
గనకుండఁగఁ దినెడి కుంభ కర్ణుండంతన్
దనుజుల వానరులను వే
వనచరబృందంబు భీతిఁ బాఱఁగఁ గడగెన్. 625

తే. గీ. ప్రళయకాలమృత్యువువలె వానరులను
భక్షణము సేయు ఘటకర్ణు భయమువలన
రాముకడ కేగి కీశవారంబు శరణు
వేడిరి సుమిత్రసుతుఁడంత వెడలె ననికి. 926

లక్ష్మణ కుంభకర్ణులు

తే. గీ. ఏడు తీవ్రబాణంబుల వీడి మఱియు
వేసె లక్ష్మణుండప్పుడు విశిఖతతులఁ
గొట్టె కుంభకర్ణుండు తా మట్టు బెట్టి
పాదఘాతంబుచే వాని ప్రక్కనె గల. 627

రామ కుంభకర్ణులు

తే. గీ. రామునిమీద కడరి నారాచవితతి
వీడ కుంభకర్ణుండు వేఁవేగ వాని
దునిమి రౌద్రాస్త్రమును ఱొమ్ము దూరఁ గొట్టె
దశరథసుతుండు దైత్యుండు దద్దరిలఁగ. 628

తే. గీ. రామబాణాభిఘాతుఁడై రాక్షసుండు
కుపితుఁడై మైమఱచె గద కూలెనంతఁ
జేయి జారుచు నేలపై జేతనున్న
ఆయుధములెల్ల నటుపైన నవనిఁగూలె. 629

ఉ. ఆయుధసంచయంబు భువి హస్తమునుండి బడన్ నిరాయుధుం
డాయసురుండురక్తమయుఁడై మహితాద్రినొకండుబూని భూ
నాయకుమీదకున్ విసరె నవ్యశరంబుల నేడువిడి తన్
డాయఁగ వచ్చునా గిరి బడన్ భువి రాముఁడు గొట్టెబిండిగా.

తే. గీ. మేరుశిఖరతుల్యుఁడు దైత్య వీరుడంత
రెండువందల కపులపై దండు వెడల
రాఘవుఁడు వానిఁ దూపుల రయముతోఁడ
నేలఁబడునట్లు గొట్టె వే లీలగాగ. 631

తే. గీ. అంత సౌమిత్రి యోజించి యతనిఁ జంప
వానరుల తండ మాతని మేను నిండ
నెక్కి పీడింప నాతండు క్రుక్కుననఁగ
ప్లవగు లెక్కి రాతని మెయి రయముతోఁడ. 632

తే. గీ. కుంభకర్ణుండు తృటిమాత్ర గుపితుఁడగుచు
వానరులనెల్ల విదళింప వానిఁ గనుచు
వధ్యుఁడీతండు చంపుటే పరమధర్మ
మనుచు రాఘవుఁడతనిపై కరిగె నంత. 633

తే. గీ. వింధ్యమందరగిరులన క్షితిఁ గొలుపు
రౌద్రమూర్తిని ఘటకర్ణుఁ రక్తమయుని
నాలుకను స్వీయరక్తంబు నాకువాని
యమునివలె నున్నవాని రామయ్య గాంచి. 634

కం. పలికెను ధనువుంగొని దై
త్యునిగని ఇంద్రుని జయించి యుండినఁ వాఁడా
గనుమీ రాముఁడనే నిం
ద్రునిగాను సుమా రణాన ద్రుంతున్ నిన్నున్. 635

ఆ. వె. భయ మదేలరమ్ము బవరంబు సల్పంగ
రాక్షసేంద్ర యనుచు రాముఁడాడ
రాముఁడతఁడుగాఁగ రాక్షసుండెంచుచు
పక పక మని నవ్వి పలుక సాగె. 636

ఉ. కాను విరాధుఁడన్ గనుము కాను కబంధుఁడ వాలిఁగాను నే
గాను ఖరుండ నింకెవరి గాను సుమా! నిలు! కుంభకర్ణుఁడన్
నేనుఁద్వదీయవిక్రమము నే యికఁజూతును జూచి పిమ్మటన్
దానవవైరి క్రమింగెద ని దానముగా నిను తుత్తు దీరగన్. 637

శా. మారీచుండనుగానుగానుమడియన్మాయం బ్రయోగించుచున్
బోరాటంబున నిన్నెదుర్చుచునె నిం బోకార్చి భక్షించెదన్
ధీరా! ముద్గరమియ్యదే గనుము నే దేవాళి నిర్జించితిన్
ఘోరానిన్ననిఁ గెల్వ లెక్కయొకొ సంకోచింపలేశంబయేన్.

ఆ. వె. ముక్కుచెవులుఁగూడఁ బోయిన పీడహా
నన్ను పోరు టయిని యెన్నవలదు
దానిబాధ సుంత యైనను నే గన
రామ! జూపు నీపరాక్రమంబు. 639

కం. అన విని రాముండాతని
ఘనవజ్రసమాన బాణ కాండముతోఁడన్
దునుమఁ దలంచుచుఁ గొట్టెను
దనుజుండు కలఁత గనండు దాన రవం తేన్. 640

శా. ఏబాణంబల సప్తసాలములు ము న్నేకంబుగాగొట్టెనో
ఏబాణంబల వాలినిఁ దునిమెనో యీబాణమే వ్యర్థముం
గా బాహాబలకుంభకర్ణుడల ఖడ్గంబూనుచున్ మధ్య నే
వే భూమింబడఁగొట్టి వానరులపై విద్వేషియై పడెన్. 641

రాముఁడు కుంభకర్ణుని జంపుట

తే. గీ. వానరులపైనఁబడి జంపుఁవానిఁ జూచి
యవనిభర్త వాయవ్యాస్త్రమంత విడిచె
అద్ది త్రుంచెను ఘటకర్ణు హస్త మంత
ముద్గరముతోడఁ జెయి తెగిభూమిఁబడియె. 642

తే. గీ. పర్వతాకారఘటకర్ణు బాహు వపుడు
ముద్గరయుతంబుగాఁ గపి మూకపైన
బడుట దానిక్రిందఁ బడుచు వానర తతి
చచ్చినారలు గగ్గోలు చదల నంట. 643

తే. గీ. చేయి దెగి వడ రెండవ చేతి తోఁడ
వృక్షమును బూని రాముపై వెడలె వాఁడు
దాని నైంద్రాస్త్రమునఁ గొట్టె దారుణముగ
భూజ సంయుత మాచేయి భూమిఁ బడఁగ. 644

తే. గీ. గిఱ గిఱందిరుగుచుఁ జేయి గిరి సమాన
భారమునఁ గూల దైత్యులు వానరులును
ప్రాణముల వీడి రాచేయి పైనఁబడుట
భీకరధ్వని కపికోటి బెదరి పాఱ. 645

కం. చెట్టును జేమలు గుట్టలు
పుట్టలు సర్వంబు రూపుఁ బోడిమి చెడుచున్
మట్టిని గలిసిన వెల్లయు
దిట్టరి బరువైన చేయి తెగిబడి తాకన్. 646

చం. కరములు నేలఁగూలియును గయ్యము వీడడు రాక్షసుండు వే
గిరమునఁ గాళ్ళతోడఁ బరుగెత్తెను రామునిమీదకంత దా
శరథియు నర్ధచంద్రగతి సాయకముల్ గొని రెండు పాదముల్
నరికెను నవ్వి భూమిఁబడి నాదము దిక్కులనిండె నెల్లెడన్. 647

చం. కర చరణంబులుం దెగియు గంతము నెత్తుచుఁ బెద్దనోటినిం
దెఱచుచు గర్జనంబులఁ బదేపది నల్పుచు రాముమీదకున్
బఱగెను రాక్షసుండపుడు పార్థివుఁడాతనినోరు నిండఁగా
శరములఁ గుచ్చెమూర్ఛిలినిశాచరయోధుఁడుభూమిపైఁబడెన్

తే. గీ. అంత వజ్రాయుధమువంటి యమ్ముతోఁడ
రాక్షస శిరంబు ఖండించె రాఘవుండు
కుండలమ్ముల వెలుగుచుఁ గోఱలు గల
నా శిరము నేలఁగూలె భయంకరముగ. 64

తే. గీ. ఆ కళేబరంబంతట నాకమంటఁ
నేగి పైనుండి వేగూలె సాగరమున
జలధిలోగల జలచర జంతుతతుల
జీవములఁ దీసి గర్భంబుఁ జేరె కడకు. 650

ఆ. వె. కడలి పుడమియు ఘటకర్ణుఁడిలను గూల
కదిలె మునులు ముదము గాంచి నారు
సర్వజగతి సంతసంబునుగనె నంత
సురలు మోదమంది చూచి రపుడు. 651

కం. ఖేదము సెందిరి దైత్యులు
సాదరమున రాముఁగాంచి యా వనచారుల్
మోదమునం జెలఁగుచు రిపు
సూదనుఁ గొనియాడి రంత శూరుండనుచున్. 652

## కుంభకర్ణుని చావు - రావణుని దుఃఖము

తే. గీ. కావు కావురనుచు ఘటకర్ణు చావు
చావక మిగిలిన యసుర సైన్యమంత
లంక కేగి దెల్పిరి తమ రావణునకు
దాని వినుచు మూర్ఛిలి దేటి దైత్యరాజు. 653

తే. గీ. వానరులఁ జంపి భక్షించి వాలిఁ గెలిచి
రామ తేజంబునందుది రాలిపోయె
నతని మొండెంబు సగమంత నబ్ధిఁ బడియె
శిరము మనలంక గుమ్మానఁ జేరియుండె. 654

తే. గీ. ననఁగ దేవాంతకుండు నరాంతకుండు
త్రిశిరుఁ డతికాయుఁడంత చింతించి నారు
పిన్నతండ్రి చచ్చినవార్త విన్నయంత
సోదరుని చావు వించు మహోదరుండు
నా మహాపార్శ్వులును ఖేద మందినారు. 655

ఉ. వీరుఁడ కుంభకర్ణ నను వీడుచు దైవగతంబునన్ యమున్
జేరితివే రఘూత్తమునిచే శరబాధను బీడితుండవై
ధారుణిఁ బవ్వళించితివె దానవవైరి మహాయుధంబునే
పారఁగఁ దోల గల్గిన నపారబలుండ! హతుండవైతివే. 656

తే. గీ. నాదు దక్షిణహస్తంబు నాశన మయె
ఏని బలమెంచి శాత్రవు లింతవఱకు
భయముఁ జెందిరో అద్దియే పడెను భువిని
నేనె వధియింపఁబడితిగా నేరు దిక్కు! 657

ద్వి. పనిలేదు సీతతోఁబనిలేదు సిరితొ
ఘనకుంభ కర్ణుండు కడతేరెఁ గాదె! 658

ద్వి. జీవింపఁగాఁ జాల జీవింప నెంచ
జీవచ్ఛవంబుగా జీవింప నేల? 659

కం. ఏమని జీవించెద నా
రామునిఁ బరిమార్చకుండ రణరంగమునన్
రాముంజంపనియెడ సం
గ్రామమునం దమ్మదారి గనెదన్ నేనున్. 660

ఆ. వె. దేవగణము లింక భావింపవో నన్నుఁ
బిరికిపందగాఁగ నరి నెదిర్చి
జయమె గాంతు లేక స్వర్గమ్ముఁ బొందెద
వీరలక్షణంబు వీడఁ జాల. 661

శా. మున్నా సోదరు నావిభీషణునిఁ గామోద్రిక్తభావంబునన్
నన్నున్ వీడఁగఁ జేసితిన్ ఫలితమీ నాడీ గతింగల్గె నే
తెన్నుంగానని దుఃఖవార్ధిఁ బడితిన్ నివారించి ఆ
పన్నుంగావఁగలార లెవ్వరని దాపంబొంది శోకించుచున్. 662

తే. గీ. స్పృహను వీడిమూర్ఛిలుచు నాసురవిభుండు
తేటి పరికించి కాంచుచుఁ ద్రిశిరుఁడాది
తనయుల నతికాయునిని సోదరులనుఁగని
వార లాడిన ధైర్యసంభాషణలు విని. 663

తే. గీ. పుత్రులను గౌరవించుచు భూషణ లిడి
ప్రేమ నాశీర్వదించుచు రిపులఁ బోరఁ
బంపెను మహోదరుని మహా పార్శ్వు లనెడి
తమ్ములను దోడుగా నిచ్చి దైత్యవిభుఁడు. 664

ఉ. ఘోరరణప్రవీణుల నికుంజరు లాసురరాట్కుమారల
వ్వారలు తండ్రిఁబోలు గుణవంతులు సర్వమహాస్త్రపండితుల్
శూరులు దైవదత్తవర శోభితులన్ గణనీయులందరున్
వీరులు దీర్పతండ్రివ్యథ వెళ్ళిరి యుద్ధమొనర్ప రాముతో. 665

రావణసూనులు యుద్ధమునఁ జచ్చుట

తే. గీ. అసురేశ్వరు వ్యథఁబాప నతని మాటఁ
గొడుకులును సోదరులుగూడ గోడుతోడ
యోపదాదులఁగొని వెంట యుద్ధభూమి
కరిగిరి గజాశ్వరథముల వరలి కాల
చోదితులగుచు శస్త్రాస్త్ర శోభితులయి. 666

తే. గీ. భూమి కంపింప దైత్యులు పోరిరంత
బాణములతోడఁ బ్లవగులు పర్వతముల
భూజముల వారిఁగొట్టిరి భూనభంబు
లదర రణమంత కంతకు నధికమయ్యె. 667

ద్వి. రాళ్ళరప్పలతోడ రణభూమి నిండెఁ
ద్రెళ్ళిన జీవుల దేహాలతోడ. 668

సీ. పిడికిట ఱొమ్ముపై వడి నంగదుఁడు గొట్ట
నానరాంతకుఁ డంత నవనిఁబడియె
తలపైనఁ బిడికిట బలిమిఁగొట్ట హనుమ
దేవాంతకుఁడుతోడఁ ద్రెళ్ళిపడియె
నెత్తిపైగిరిబూని నీలుండు గొట్ట మ
హోదరుండును భూమి మీదఁబడియె

త్రిశిరుఖడ్గమెలాగి త్రిశిరంబును హనుమ
ఖండింపఁ జచ్చి నా ఘనుడు పడియె

తే. గీ. ఆమహాపార్శ్వబుషభాఖ్యులవనిఁబడగ
నిటుగఁ దోడిహరలు చచ్చి యిలనుగూల
నతిగ రోషించి యతికాయుఁ డంత రణము
నందు భీకరుఁడై దూకె నతులరీతి. 669

ద్వి. రుధిరంబు ప్రవహించె రోతజనింప
విధిగాగఁ బోరిరి పీరులు తుదకు. 670

ద్వి. కపులతికాయునిం గనిభీతిఁ జెంది
విపులాతు రాముని వేఁ జేరి నారు. 671

ఉ. భీకరదైత్యుఁ గాంచుచు విభీషణు రాముఁడు దెల్పఁగోరె నా
లోకభయంకరుండెవఁడో రోషవిభీషణదృక్కులన్ నిజా
నేకమహాయుధంబుల ననింగన వేయిహయప్రయుక్తమై
నాకము నంటు నారథమునన్ విలుఁబూనుచు నున్నవానినిన్.

తే. గీ. కుండలమ్ములు గల ముఖమండలమ్ము
దీప్తిమై రుద్రుఁడననొప్పు తేజుతోఁడ
హిమగిరినిబోలు వాడాతఁ డెవఁడు దీర్ఘ
బాహుఁడు విపులవక్షుంబు వాఁడెవండు. 673

ద్వి. అని గోరు రామున కావిభీషణుఁడు
మనవి యొనర్చెను వినయంబుతోఁడ. 674

ఉ. ఈతఁడు ధాన్యమాలి సుతుఁ డీతఁడె సార్థకనాముఁడౌచువి
ఖ్యాతినిగాంచినట్టి యతి కాయుఁడు రావణసూనుఁడీతఁడే
తాతను గొల్చి పొందె సుర దానవవధ్యుఁడుగాక యుండ నో
రీతి వరంబునస్త్రముల ఈనిని బోలు బలుండువాఁడునున్.

తే. గీ. బహుళశస్త్రాస్త్రవిద్యలఁ బండితుండు
నోట మెఱుగని రణరంగ యోధుఁడతఁడు
ఇంద్రవరుణుల నని నిజయించె వాఁడు
నింగి నేలను రథగతి నేర్పువాఁడు.

నాల మొనరింపఁగల జెట్టి యతఁడు సుమ్మి
జాగుసేయ రాదికనీని జంప రామ. 677

తే. గీ. అని విభీషణుఁ డాడెడి యంతలోన
రాఘవుని డాసె నతికాయ రాక్షసుండు
రాళ్ళ రప్పలఁ దనతోడ రణ మొనర్చు
వానర శ్రేష్ఠ తతితోడఁ బూన కనిని. 678

మ. శరచాపంబులఁబూనుచున్ రథముపై సంగ్రామముఁబూని వే
పరిమార్పందలకొంటి శాత్రవుల సం భావింప నత్యల్పులన్
దురమందున్ వధియింప భీతులను నే ద్రుంచన్ దలంపన్ మవే
వ్వరు లేరేరణమూన సాయుధులు నవ్వారిప్డు వేరాదగున్.

కం. అను నతికాయుని మాటల
విని సౌమిత్రి విలుఁబూని పెకలెన్ నారిన్
నినదంబొనరించుచు ని
ల్చెను దైత్యుని ముందు రణము సేయఁగఁ దోఁడన్. 680

ఉ. నీవ రణంబునందెదురు నిల్చెడివాఁడవు పిన్నవాఁడవే
పోవదగున్ మదీయశర ముల్ నినుదాకకమ్ముందె వింటినిన్
నీవికవీడి ప్రాణముల నేర్పునఁ గాచికొనందగున్ సుమా
ఈవటుసేయవేని యిపు డే యముపాలికి నిన్నుఁబంపెదన్.

అ. వె. తమ్ము తామెపొగడి తనరారు వారలు
గొప్పవారుకారు గొప్పదనముఁ
జేతలందుఁజూపి జెప్పఁగాఁదగునంచు
లక్ష్మణుండు పలికె రక్కసునకు. 682

కం. చూపుము నీబలమంతయు
నాపిమ్మట నాదు బలము నంతయు నీకుం
జూపెద నీ శిరమంతన్
భూపతనముగాఁగఁ జేసి పోకార్చెదనిన్. 683

కం. అన లక్ష్మణుఁ డతికాయుఁడు
రణమూనెం దీవ్రశరపరంపరలను డీ

కొని రిర్వురు వీరులు వే
తునియలుగాఁ గొట్టికొనుచుఁ దూపులఁ ద్రుటిలో. 684

ద్వి. సౌమిత్రి దైత్యుని శరమొండుతోడ
భ్రూమండలినిఁగొట్టె బుండగు నటుగ. 685

ద్వి, అసురుండద్దాన నార్తినిఁ గని సె
భాసనె లక్ష్మణు పాటవంబునకు. 286

ద్వి. రక్కసుడంతతో లక్ష్మణు నురము
వ్రక్కలై చనఁ జేయ బాణంబు వీడె. 687

ద్వి. దానఁ ర క్తము జిమ్మ తబ్బిబ్బు లౌచు
బూని యాగ్నేయాస్త్రమునవీడె శరము. 688

ద్వి. అంత సౌరాస్త్రంబు నతికాయుఁడు విడె
వింత రెండస్త్రముల్ విన్నంటి పోరి. 689

ద్వి. ఒండొంటిఁదాకుచు నుర్విపైఁబడుచు
మండి నిస్తేజమై మరి గానరావు. 690

ద్వి. అంత నైషీకాస్త్ర మతికాయుఁడు విడెఁ
బంతాన సౌమిత్రి బరిమార్ప నెంచి. 691

ద్వి. విడిచె నైంద్రాస్త్రంబు వేగొట్టి దాని
బుడమిపై సౌమిత్రి పడవైచె దాని. 692

ద్వి. తన యస్త్ర మారీతిఁ బని పీడునంత
కనలి యామ్యాస్త్రంబుఁ గైకొని వైచె. 693

ద్వి. అదియు రూపఱఁగొట్టె నాలక్ష్మణుండు
వదిలి వాయవ్యాస్త్ర బలమున వడిని. 694

తే. గీ. విసివి సౌమిత్రి బహుతీవ్ర విశిఖములను
వేయవీడెను నవియెల్ల వీగఁ జేసి
నసురుఁడొకయింత యేనియు నార్తిఁగనఁడు
దైత్యుఁడొకదివ్యకవచంబుఁదాల్చియుండి. 695

తే. గీ. బ్రహ్మదత్తంబు కవచంబు వాఁడు దొడిగె
నది యభేద్యంబుఁ ద్రుంపఁగా నలవిగాదు
విడువ బ్రహ్మాస్త్రమున మాత్ర మడియునసురుఁ
డనుచు వాయుదేవుఁడు దెల్పి చనియె మరలి. 696

ఆ. వె. వాయుదేవుని నుడి బ్రహ్మాస్త్రమంత్రంబు
తోడ విశిఖమొండు వీడె నపుడె
లక్ష్మణుండు గాంచి రాక్షసుండద్దాని
సమయఁ జేయఁ జూచె శస్త్రతతుల. 697

తే. గీ. ఆ హిమాద్రిశిఖరభంగి నాశరుఁదల
ఆ కిరీటాలంకృతమంత నవనిఁబడియె
పరమదుఃఖితులౌచు నాశరులు మాతులు
గాని వారలు తమ ఠేని కడకుఁజనిరి. 698

సంగ్రామాశ్వాసము సమాప్తము.

ఆశ్వాసాంత పద్యములు :

ఉ. ఎంతగ విద్యనేర్చిన మహేశ్వరు నెంతగఁ గొల్చుచున్న భూ
కాంతునిగా విరాజిలినఁ గాలమెఱుంగకయుండువాఁడిలన్
జింతల పాలుగాడె తన చేతల మాటల సాధువర్తనం
బింతయు లేక స్వీయకృపి నేతలపోసెడివాఁడు రాఘవా! 699

తే. గీ. దైవచింతన మఱచు వర్తనమువాఁడు
స్వీయశక్తినెప్డు ఘటించి చేయుఁ బనుల
నవ్వివిఫలంబులౌనంత నార్తిఁ గనుచు
విధి యటంచని రామ నీ పేరుఁ దలఁచు. 700

ఇది శ్రీ గోవిందరామాయణ పట్టాభిరామ కావ్యమున సంగ్రామాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ